# తెలుగు హాస్యము

(తెలుగు సాహిత్యములో హాస్యరసము)


కర్త

శ్రీ ముట్నూరి సంగమేశం ఎం. ఏ.



ప్రచురణ:

ఆంధ్ర సారస్వత పరిషత్తు

బొగ్గులకుంట, హైదరాబాదు.

జయ శ్రావణము — 1954.

వెల 2-0-0

# విషయసూచి

తెలుగులో సాహిత్య సమాలోచక గ్రంథములు చాల తక్కువగనున్నవి. స్వతంత్ర సాహిత్యశాస్త్ర గ్రంథములు లేకపోగా సంస్కృతాదులలోనివైన పూర్తిగ అనువదింపబడలేదు. ఇతర భాషలలోవలె ఆంధ్ర సాహిత్యముపై సమగ్రమైన శాస్త్రీయ విమర్శగ్రంథములు వెలువడకపోవుట మన దురదృష్టము. మన సాహిత్యవేత్తలు తమ దృష్టి నీవైపు ప్రసరింపజేసి ఉదాత్తమైన సమీక్షలను వెలయింప బూనుకొనవలయును. ఈవిషయమున చక్కని కృషిచేసి సాహిత్యాచార్యులు శ్రీ ముట్నూరి సంగమేశంగారు ఆంధ్రలోకమునకొక ఉత్తమరచనను ప్రసాదించినారు.

ఈగ్రంథమున శాస్త్రీయపద్ధతిలో హాస్యరసచర్చ చేయబడినది. తెలుగు సాహిత్యమును లక్ష్యముగా నిడుకొన్నదగుట నిది మనభాష కపూర్వమైనది. ఈపుస్తకమునకు బహుమానమొసగిన తెలుగుభాషాసమితిని ప్రశంసించుచున్నాము. ఈ గ్రంథమును ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షమున ప్రచురించుటకు దయతో అంగీకరించిన గ్రంథకర్తగారి యెడ కృతజ్ఞులము. ఉత్తమములైన బాల ప్రజాసారస్వతములతోపాటు పండితసారస్వతము గూడ ప్రకటించి ఆంధ్రలోకమునకు సేవజేయుచున్న పరిషత్తునకిట్టి విద్వాంసుల సహకారము లభించుచుండునని విశ్వసించుచున్నాము.

కారణాంతరములచే ఈగ్రంథముద్రణము మిక్కిలి త్వరగా ముగియవలసి వచ్చి నందున అచ్చు తప్పులు కుప్పతిప్పలుగా పడినవి, ఇందులకు పాఠకలోకమును క్షమింప గోరుచున్నాము.

బుధ విధేయుడు,
పులిజాల హనుమంతరావు
ప్రధాన కార్యదర్శి.

హైదరాబాదు
జయ శ్రావణము

# నవ్వు

నవ్వ నేరని మనుష్యుడు వెదికినా దొరకడు. పశుప్రాయుడైన మనుష్యుడు కూడ నవ్వగలడు. అదే అతనిలోగల మనుష్యత్వానికి చిహ్నం. కాని ఈ రకపు నవ్వు చాలావరకు భౌతికమే గాని మానసికమైన నవ్వు అనిపించుకోదు. కోతినవ్వును. ఆ నవ్వులో బుద్ధి ప్రవేశించి ఉండదు.

కొన్ని విషయాలు చూచినపుడు, లేదా వినినపుడు, లేదా తలచినపుడు ఆయా విషయాల్లో ఉండే వికారము, వైపరీత్యము వైషమ్యము అతివాస్తవికత, అసహజత్వము, మొదలైన గుణాల వల్ల మనకు నవ్వుపుట్టును. నవ్వురావటానికి ముందు మనకు ఆనవ్వు పుట్టించు విషయమును గురించి కొంత పరిజ్ఞానము అవసరము. వస్తుస్థితి యిట్లుండుననీ స్థితి వైపరీత్య మిట్లున్నదనీ తెలిసిననాడుగాని నవ్వుజనింపదు. మనము వస్తువిట్లుండుననియూ, యిట్లున్నదనియూ ఎరుగుదుము గనుక నవ్వెదమని విలియం హేజలిట్టు చెప్పెను. మన పూర్వానుభవము, జ్ఞానము, ఊహ, తర్కము మొదలైన సంస్కారములు మనకొక విషయమును గూర్చి కొంత పరిజ్ఞానమును చేకూర్చును. ఈ పరిజ్ఞానమే మనకు మనలను నవ్వించే వస్తువులో గల నవ్వదగిన వంకరను వెదకి చూపించి నవ్వించును, ఉదాహరణకు, ఒకవ్యక్తి తన లాల్చీని తిరగవేసి తొడిగినాడనుకొందుము. అతనిని చూచి మనము నవ్వెదము. ఆవిధముగా లాల్చీ తొడగటం అనేది పరిపాటిలో లేని విషయము గనుకనూ, అసహజమని మనమనుకొనుట చేతనూ, మనలోకానుభవానికి విరుద్ధమైన దగుటచేతనూ మనము నవ్వెదము. మన అనుభవమునకు లేదా పరిజ్ఞానమునకు ఆవిషయము అసహజమని తోచనినాడు మనకు నవ్వురాదు. అసహజముగానో వంకరగానో తోచిననూ, అది విధివైపరీత్యమని గుర్తించిన చోటగూడ నవ్వుకు తావులేదు. అట్టిచోట వైపరీత్యముకూడ సహజమే అని మనజ్ఞానము మనకు బోధించును, సహజమూ, సంభావ్యమూ అయిన విషయము మన సానుభూతికి పాత్రమై ఉండుటచేత నవ్వుచల్లారును. దారంట పోవుచున్న మనుష్యుడు హఠాత్తుగా జారిపడి చతికిల పడిన వెంటనే దబ్బున లేచి దులుపుకొనుచూ, గబగబ నడచి పోయినచో మనకు మొదట నవ్వు వచ్చును. ఇందులో ఉన్నవాడున్నట్టుగా ఉండక నడుస్తూ నడుస్తూ కుదిమట్టముగా కూలబడి కుప్పగూలి నట్టై, తిరిగి చటాలున లేచి, వెనుదిరిగి చూడకుండా ముందుకు పోవటం అనేది అత్యంతమూ అసహజము, క్రమ విరుద్ధము, అనూహ్యము అగుటచేత మనకు మొదట నవ్వు వచ్చును. కాని ఏకారణాన్న అట్లా చతికిల బడ్డాడో అనిగాని, ఏమాత్ర

ఉంటుందో అనిగాని ఊహించే ముందే చాలు, నవ్వు పలాయనం చేస్తుంది. సకారణంగా జారినట్టయితే సాను భూతి జనించి, ఆపరిస్థితిలో ఆపాటు ఎవరికేనా సంభవమే అనిపించి నవ్వువచ్చి, దెబ్బకూడా తగిలినదని తెలిసిననాడు ఏడుపుకి తావేర్పడును. తర్కానికిగాని, హేతువాదానికిగాని నవ్వు నిలువదు. చివరకి చెప్పాలంటే, మనబుద్ధికి కూడా ఒక వికారం ఏర్పడినప్పుడే నవ్వు పుట్టును. మనజ్ఞానం ఒక క్షణంవెనక్కి పస్తాయించి మనలను అజ్ఞానంలో పిడిపెట్టి నవ్విస్తుంది. బెర్గసన్ వాక్యాల్లో చెప్పాలంటే, మనుష్యుడు యంత్రవత్ గా వ్యవహరించిన నాడు నవ్వుకి తావేర్పడును.

ఏపరిస్థితిలో మనము నవ్వుదుమో అని తెలిసికొనుటకు ముందు ఏపరిస్థితిలో మనము నవ్వలేమో తెలిసికొనుట మేలు. ఓ పనిగాని, ఒకవిషయముగాని, ఒకానొక వస్తువుగాని ఒక నిశ్చితమైన క్రమాన్ని అనుసరించి స్థితిగతులు కలిగి ఉన్నంతసేపు మనకు వాటిపట్ల నవ్వురాదు. ఆ క్రమ పరిణామంలో ఉన్న తీవ్రత, పటిష్ఠత, స్థాయిత్వము మొదలైనవి మనలను గంభీరులుగా మార్చి, మన భావాలనాకర్షించి, ఉత్సుకతను ప్రేరేపించి, ఇష్టానిష్ట సంకల్పాదులకు ఎడమిచ్చుచూ వచ్చి, చివరివరకు ఒక ఉద్వేగ పరిస్థితిలో మన హృదయమును నిల్పును. అదే క్రమపరిణామంలో తీవ్రత తలవని తలంపుగా సన్నగిల్లి, పటిష్ఠత హఠాత్తుగా పట్టుజారి, స్థాయిత్వములో అనుకొననిరీతిగా సందిగ్ధత ఏర్పడిననాడు మన గంభీరత తేలిపోయి మనచే ఫక్కుమని నవ్వించును. కాని యీమార్పులో ఒక అనిష్టాశంకగాని, అపాయ సూచనగాని, స్ఫురించినచోట నవ్వురాదు. సరిగదా, ఏడుపురాకమానదు.

వస్తుస్థితిలో వచ్చిన వికృతాభాస కూడ మనలను నవ్వించును, సహజాన్ని అసహజముగానో, అసహజాన్ని సహజముగానో భావించినచోట కూడ నవ్వుపుట్టును. అలవాటులో వచ్చిన పొరపాటుకూడ అట్లే నవ్వించును. పొరపాటుకి కారణంగూడ కొంత పొరపాటుగానే ఉన్నదని తెలిసిననాడు నవ్వు మరికొంచెము ఆయువు పెంచు కొనును. ఈనవ్వు, అనగా మనము తెలివితక్కువగా నడచి, నవ్వులపాలై, మన తెలివి తక్కువతనాన్ని మనమే గ్రహించిననాడు వచ్చిన నవ్వు మన స్మృతిపథంలో నిల్చి మనలను మరల నవ్వించుట కుపయోగించునట్టిది. ఇది మనలను సంస్కరించుటకు పనికివచ్చు నవ్వు. మానవ స్వభావంలోగల వికారాలను కనిపెట్టి నవ్వుట, నవ్వించుట అనేవికూడ మనకు పరి పాటిగా వచ్చుచున్నవే. మిథ్యాభిమానము, స్వార్థపరత, అహమిక, అసూయ మొదలైన గుణాలలో ఉండే నిస్సారత, కుత్సితత్వం, అన్యాయం, అస్వాభావికత్వం. వగైరాలు చూచి, చూపించి నవ్వటం, నవ్వించటంగూడ మన మెరిగినదే. ఈరకపు నవ్వు వ్యంగము నాశ్ర యించి పుట్టును. ఒకరిని హేళనచేయుటకు ఈనవ్వు వజ్రాయుధం,

మనము పటాలున నమ్మలేని విషయం విని నవ్వలేము. కాని చిరునవ్వు మాత్రం రాకమానదు. అదే నమ్మలేని విషయాన్ని నమ్మించే ధోరణిలో చెప్పగా వింటే నవ్వక మానలేము.

" అచటి విప్రులు మెచ్చరధిక విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటి వేల్పు "

అనే వాక్యాన్ని మొదటి దానికి ఉదాహరణగా తీసికొంటే, రెండవ దానికి,

" చాకి వానితోడ జగడాలు పడలేక,
సిరిగలాడు పట్టుచీరగట్టె
శివుడు తోలుగప్పె ఛీయని మదిరోసి
భైరవుండు చీర పారవేసె "

అనే పద్యం తీసుకోవచ్చు. అట్లే అతి గంభీరమైన విషయాన్ని చప్పచప్పగా తేల్చి చెప్పినా, అతి పేలవమైన విషయాన్ని మరీ గొప్పగా చెప్పినా నవ్వు రాకమానదు. ఏదో గంభీరమైన సంగతి చెప్తునని ఆరంభించిన చోట, అస్యసామాన్యమైన మాట తీసుకువస్తే నవ్వు ఆగదు. ఉదాహరణకు ఈ క్రిందివిచూలు.

" సకల తీర్థములందు సకల యజ్ఞంబుల
తలలు గొరుగ కున్న ఫలము లేదు
మంత్రజలముకన్న మంగలి జలమెచ్చు
విశ్వదాభిరామ వినురవేమ "

" శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
బవళించుట నల్లి బాధ పడలేకసుమా. "

ఒకరిని నవ్వమని శాసించలేము; కాని నవ్వవద్దని శాసించినా, నవ్వకూడదని భీష్మించుకొని కూర్చొనినా నవ్వురాక మానదు. మన పట్టుదల ఎంత తీవ్రంగా ఉంటే అంతకు రెట్టింపు తొందరగా నవ్వువచ్చే సన్నివేశం యిది. అసలు మన నవ్వుకి కొన్ని చోట్ల అర్థం పర్థం లేకపోవటం కూడ కద్దు. ఓ చెవిటి మూగ ముక్కరి వంటి వారిని చూచి నవ్వటం ఈ రకము. పిచ్చివారి చేష్టలు, చెవిటివారి మాటలు తొగ్రిగుబోతు ప్రసలా

పాలు నవ్వదగినవి కావని తెలియని మనుష్యులెందరో ఉన్నారు. వీధిలో పోయే కుక్కను కర్రతో కొట్టి "కంయ్" మనిపించి నవ్వే కుర్రవాళ్లను మనము చూస్తూనే ఉంటాము. అల్లరిచేసి, అల్లరిచూచి, ఆనందించే ఘరానా వ్యక్తులు మనలో లేకపోలేదు. ఆడవాళ్లని చూచి నవ్వే ఘటాలు కూడ మనలో ఉన్నారు. కాని యివేవీ గంభీరులైన వారిని సంస్కారులైన వారిని, ఆ మాత్రమో యీ మాత్రమో తగు మనుష్యుల మనిపించుకొన్న వారిని నవ్వ నివ్వవు కారణం, ఈ నవ్వు బుద్ధిమాంద్యము, క్రౌర్యము, హృదయరాహిత్యము, కుత్సితత్వము మొదలైన గుణాలవల్ల జనించే రకము కానటువంటే. ఇది సంఘానికిగాని, వ్యక్తికిగాని శ్రేయోదాయకమైన నవ్వుకాదు. ఈ నవ్వుకి కారణమైన వికృతి లేక ఆ సంగతి అనే గుణము నవ్వదగిన వస్తువులో కంటె నవ్వే వ్యక్తిలోనే స్పష్టంగా గోచరిస్తుంది.

నవ్వు ఒక శారీరక ప్రక్రియ. మన మనఃప్రసన్నతను బయటకు వ్యక్తముచేయు సాధనము. పసిపిల్లల నవ్వులో మనకు గోచరించేది వారి మనఃప్రసన్నతయే. నవ్వుతూ ఉన్న ముఖముద్ర ప్రసన్నచిత్తానికి ద్యోతకము. అందుకే అధికారులు, ఆడవాళ్లు అట్టే నవ్వకూడదని శాసింపబడ్డారు. ఆ అదునుచూచి అనువుకని పెట్టి, చనువుచేసుకొని, సక్రమంగా నడువవలసే వారిని అక్రమ పంథాలోనికి మరలించే స్వప్రయోజనపరులైన వ్యక్తులు కొందరుండ వచ్చుననే భయం ఈ శాసనానికి మూలం, అస్తు, నవ్వు ఒక సామాజికమైన గుణము. దీనికి సాంక్రామికదోషం, లేదా గుణంకూడ ఉంది. బెర్గసన్ వ్రాసిన ప్రకారం, ఒక మనుష్యుడు మరొక మనుష్యుణ్ణి చూచే నవ్వుతాడు గాని వేరేచోట నవ్వడు. ఏకారణం చేతనైన మానవేతర పదార్థాలు చూసి నవ్వినట్లయితే, ఆయాపట్ల మానవత్వాన్ని ఆపాదించిగాని, తదాభాస గుర్తించిగాని, తత్స్మృతిచింతనాదులవల్లగాని నవ్వునని ఎంచవలెను. ఒకరు నవ్వుతూ ఉండగాచూసి వేరొకడు నవ్వును. అందుచేతనే ఎవరైనా హేళనచేసి మనతోపాటు వారినిగూడ నవ్వించి సంస్కరించ గలుగుతున్నామని బెర్గసన్ వాదములోని సారము.

హర్షమునకు బాహ్యచిహ్నమే నవ్వు, అని కొందరు వేదాంతుల సిద్ధాంతము. కాని వారిమతంలో ఉపహాసపాత్రమైన వస్తువు లేక విషయముగూర్చి వివేకముగాని విమర్శ గాని అవసరము అయినట్లు తోచదు. ప్రారంభములో కడుపునిండా పాలు త్రాగిన బిడ్డ నవ్వి, క్రమంగా ఆనవ్వును అలవాటుచేసుకొని తరువాత ఆదేవిధంగా శారీరక పుష్టితో పాటు మానసిక పుష్టి కలిగినప్పుడుగూడ నవ్వటం అలవరచుకొనునని వికాసవాదుల మతము.

చిన్నప్పటి నవ్వుహృదయ నరనరాలలో జీర్ణించి, సంస్కారప్రాయమై, మనకి ఆనందమూ నిండూ కలిగినప్పుడల్లా అలవాటుగా మనముఖంలో ఉండే నరాలను కదిలించి, నోరువిప్పించి, బయటకు వ్యక్తం అవుతుందని ఈసిద్ధాంతానికి పరమార్థం. మనమస్తిష్కంలో ఉండేరక్తం కొంచెము గడ్డకట్టి, రుధిరప్రసారము మందగించి నరాలన్ని చలించి నవ్వుని ఉదయింప జేస్తాయని శారీరక శాస్త్రజ్ఞుల వాదం. కాని ఈ ప్రమాదం ఎందుకు వచ్చిందో, ఎందుకు వస్తుందో: నవ్వించే వస్తువులో ఉన్న ఏగుణము మనల్ని యింతగా బాధించి, మన మస్తిష్కంలో ఉన్న రక్తాన్ని గడ్డకట్టిస్తుందో వారు చెప్పరు. అయినదీ కానిదీ అన్నీ అవచేతనానికి (Sub-conseince) ముడిబెట్టడం మన సత్వ శాస్త్రజ్ఞుల లక్షణం. మనహృదయంలో ఒక భాగానికి అవచేతనమని పేరు. సంఘానికి వెరచి నీతిబాహ్యము, ధర్మవిరుద్ధము, అలౌకికము అసభ్యము అయిన భావాలను మనము తటాలున వ్యక్తము చేయలేమనిన్నీ అట్లు అవ్యక్తముగా ఉన్న ఆభావాలు అవచేతనలో అడగిమడగి ఉంటాయనిన్నీ, అవి అవకాశం చూసుకొని కలలోనో కళలోనో, కవిత్వంలోనో కనీసం నవ్వుల్లోనో వ్యక్తమౌతాయనిన్నీ వీరిసిద్ధాంతం మనకు వేరొకరిపై ఉన్న అసూయా ద్వేషాదులు ముఖంముందు స్పష్టంగా వెల్లడించడానికి వీలులేనివిగా ఉండి వ్యంగ్యంగానో, వేళాకోళంగానో, వెక్కిరించినట్లో మనచే నవ్వించి వ్యక్తమవుతాయని వీరి నమ్మకము కాగా ; నవ్వు మనము మనలో యిముడ్చుకోలేని అసూయాదులను బయటకు వెలిగ్రక్కే సాధనమని వీరి తాత్పర్యము. కాని మనకు అందరి మీద అసూయ ఉండదు. అసూయచేతనే మనము నవ్వము. ప్రేమ కలిగినచోట కూడ నవ్వుదుము. విలియం మెక్డగల్ ప్రకారం, మనము ఏడవవలేక నవ్వుతాము. ఏడుపునుండి కొంత విశ్రాంతి కావలసి నవ్వుతాము. నవ్వు ఏడుపును మరిపించి సుఖపెట్టే ఏర్పాటుతో వచ్చిన దైవికమైన వరము. మానవుడు సానుభూతి పరుడు. చిన్నతనంలోనే ఏడవటం నేర్చుకొన్నవాడు. ఆ అనుభవాన్ని దూరం చేసుకొనే వేరొక సాధనంగా నవ్వుని అలవర్చుకొన్నాడు. తానేడవలేక నవ్వబోయి వేరొకరిని హేళనచేసి ఏడిపించి తాను నవ్వుకోవటం కూడ యితని లక్షణమే. నవ్వు ఒక ఆటలాంటిది. మానవుని సహజ ప్రవృత్తుల ( Instincts ) లో నవ్వు ఒకటి. దీనికి వేదనతో వైరం అనే విపరీత సంబంధం కూడ ఉంది. ఒకరిని నవ్వించేది వేరొకరిని ఏడిపించేదిగా కూడ ఉండవచ్చు. నవ్వు ఏడుపుని మానిపించే అస్త్రమని తెలిసికూడా, మరొకరిని ఏడిపించటానికి నవ్వునే ప్రయోగించటం అనేది విషాన్ని ముందుగా ఉపయోగించడం వంటిది. ఒకరిని ఏడిపించి అయినా సరే సంస్కరించి సంఘంలో పదిమందిని నవ్వించి సుఖపెట్టే సదుద్దేశముతో ప్రయోగించబడిన నవ్వు పంచదార మెదిపిన క్వైనా మాత్రవంటిది.

# 6

మన ఆలంకారికుల పరిభాషలో నవ్వుకి హాసమని పేరు. "వాగంగాది వైకృతు ను చూచినందువలన కలిగిన చిత్తవికాసము హాసము" అని నిర్వచింపబడింది. ఎవరెన్ని చెప్పినా వికృతిలేనిదే నవ్వురాదని భావము. ఈ హాసము ఆరు రకాలని మన శాస్త్రజ్ఞులు గణించేరు. చిరునవ్వు, పలువరుస చూపిననవ్వు చప్పుడయ్యేనవ్వు, శిరః కంపనతో కూడిన నవ్వు, కన్నీళ్లతో సహా వచ్చిననవ్వు. కాళ్లుచేతులు కొట్టుకొనే నవ్వు, అని ఆరింటిని చెప్పి, యిందులో మొదటివి రెండే ఉత్తమమైన హాసములనిన్నీ, ఆఖరివి రెండూ అధమమైన వనిన్నీ, మధ్యవి మధ్యమాలనిన్నీ మనవారు చెప్పేరు. లోకంలో సాధారణంగా మనం నవ్వే నవ్వుకి, సాహిత్యగతంగా అనుభవించే నవ్వుకీ చాలా తేడా ఉంది. లౌకికమైన నవ్వులో అహంకార మమకారాలు, స్వార్థం మొదలైనవి మేళవించి ఉంటాయి. సాహిత్యకమైన నవ్వులో యీ గుణాలుండవు. ఆ నవ్వు నిస్స్వార్థమై "నమమేతి పరస్యేతివా" అనే రకంలో నిల్చి, కేవలమూ ఆనంగమే అవధిగా కలిగి ఉంటుంది.

మన రసశాస్త్రములో ఆనందానుభూతినే లక్ష్యముగా కొని రస సిద్ధాంతమును విస్తరించి చర్చించిరి. రసానుభూతిని బ్రహ్మానంద సహోదర మని అంగీకరించిరి. ఆనందానుభూతినే కలిగించు హాసము కూడ రసముగామారుననిన్నీ, రసానుభూతినిచ్చుననిన్నీ మన వారు చెప్పిరి, కాగా, యింకొకరెవరికైనా దుఃఖము కలిగించు హాసము ఉత్తమకోటికిచెందు హాసము కాదని మనసిద్ధాంతము. అందుకే మనకి అధిక్షేపకావ్యాలు, అపహాసపూరితమైన ప్రహసనాలు. హేళనతో నిండిన అనుకరణరచనలు; వ్యంగ్యము నాశ్రయించి వేళాకోళము చేయు సాహిత్యకృతులు, తక్కిన పాశ్చాత్య సాహిత్యములల్లో వలె తడవగానే దొరకడానికి తగినన్ని లేవు, మనవారి హాస్యము ఒకరిని బాధించదు. మనల్ని నవ్వించక మానదు; నవ్వు మానవసంఘాన్ని,. జాతిని వ్యక్తినికూడ సుఖంగా నడిపించే సాధనం అని మనవారు గుర్తించేరు. మన దుఃఖాన్ని విస్మరించడానికి. మన పొరపాటు దిద్దుకోవటానికి మరీ మన వశంగాని వాటినిచూసి, ఎంతసేపూ ఏడుపేనా అనేస్సి, కొంతలో కొంత నవ్వుపరిపెట్టుకోడానికి, మనచుట్టూ ఒక ప్రశాంతమైన వాతావరణాన్ని సృష్టించడానికి నవ్వుని మించిన సాధనం మరొకటిలేదు. నవ్వు ఏడుపులనేవి మన ప్రాథమికానుభూతులైన సుఖదుఃఖాలకి ప్రతిక్రియలు, సుఖాన్ని కోరుదుము. దుఃఖాన్ని వద్దందుము. వద్దన్నా వచ్చిపడే దుఃఖాన్ని దిగమ్రింగడానికి అనువైన అనుపానం నవ్వు దుఃఖాన్ని తాత్కాలికంగానైనా సరే, సుఖంగానో, సుఖాభాసగానో పిరాయించగల శక్తి నవ్వులో ఉన్నది. అనవ్వు నవ్వలేని వ్యక్తి ఈ జీవితమే దుర్భరం. అతని బ్రదుకు ఎప్పుడూ ఏడుపే; అతణ్ణిచూస్తే అందరికి నవ్వే.

సాహిత్యకమైన నవ్వులోగూడా తరతమ భేధాలు లేకపోలేదు. ఆలంకారికుల మర్యాదలో కేవలము భౌతికమైన నవ్వు అధమం. వేరొకరికి కష్టంకలిగించే నవ్వు మధ్యమం; అందరికీ సుఖించే కూర్చే నవ్వు ఉత్తమం. మరొకలాగున చెప్పాలంటే. స్వార్థపూరితమై, సంకుచిత హృదయంలో జనించివచ్చేనవ్వు అధమకోటిదనీ. అసూయా ద్వేషాదులతోనో, మాత్సర్యాభిమానాలతోనో ప్రేరేపింప బడిన నవ్వు మధ్యమ తరగతిదనీ నిస్స్వార్థమై, సకల జనానుమోదమై, ప్రియమై నిలువగలిగే నవ్వు ఉత్తమ స్థాయికి జెందుననీ చెప్పవచ్చును. థేకరీ వాక్యాల్లో, అతి ఉత్తమమైన హాస్యం మనకి యితరులపట్ల అంటే నవ్వదగిన వస్తువుపట్ల కొంతదయ కొంత కరుణ కలిగిస్తుంది. కాని ఈ సిద్ధాంతము మన రససిద్ధాంతానికి సర్వధా విరుద్ధము. కరుణకీ హాస్యానికీ పొత్తు కలవదు. ఈ విధమైన వైవాహిక శ్రాద్ధవిధానం బొత్తిగా అవైజ్ఞానికం, అస్వాభావికం కూడ. కరుణ, లేక శోకం, అనేదిచిత్త వైక్లబ్యానికి పేరు. హాసం చిత్తవికాసానికి పేరు. విశ్లథత్వాన్నో, వైక్లబ్యాన్నో అనుభవిస్తూ బరువెక్కిఉన్న చిత్తాన్ని వికసింపజేసి బరువుదింపి తేలికగా నవ్వించే హాస్య విధానము రసస్రష్టలైన మన కవీశ్వరులకలవాటుగా వచ్చినరచనా విధానము. హాస్యానికి తోడు భక్తివాత్సల్యము మొదలైన భావాలు మేల్కొనవచ్చును గాని దయా భయ జుగుప్సాదులు మేల్కొనవు. ఒక కంట ఏడుపూ, నొరొక కంట నవ్వూ కలిగించే ఫాల్‌స్టాఫ్ వంటి పాత్ర, ఆ పాత్రగతమైన హాస్యం వంటి ఉత్తమ హాస్యం, మనకు లేవని ద్విజేంద్రలాల్‌రాయి గారు వాపోయినారు. కాని ఫాల్‌స్టాఫ్‌ను గురించి చివరివరకు చదివి 'అయ్యో పాపం!' అని ఒక నిట్టూర్పు విడిచినామంటే, అది అంతకుముందే ఆపాత్ర యడల మనకు కలిగిన ప్రేమభావానికి ఫలితంగా పర్యవసించినదేకాని వేరుకారణంచేత వచ్చినది కాదని గుర్తించవలెను. 'ఆలంబనంపట్ల ప్రేమను జనింపజేయునట్టి నవ్వే నవ్వు' అను రామచంద్ర శుక్ల పండితుని సిద్ధాంతము మన రస సిద్ధాంతమున కనుకూలమైన సిద్ధాంతము. ఈ దృష్టితోనే మన పూర్వకవులు ఉపహసించవలసివచ్చిన చోట్ల, ఆ ఉపహాసపాత్రమైన విషయములోని వికృతిని, సర్వజన సాధారణమైన ఒకలోపముగా ప్రదర్శించుచూ ఏఒక్కరికి నొప్పికలుగని విధముగా హాస్యమును నిర్వహించుచూ వచ్చిరి. కుకవి నిందలోకూడ దురుసుతనము వ్యక్తముగాకుండుటకుగాను, శిల్పనైపుణ్యముపై మన దృష్టిని ఆకర్షించుటకు ప్రయత్నించిరి. అపహసించినా, అధిక్షేపించినా వీర రసాంగముగా స్వీకరించి నిర్వహించిరి. అదిగాక ఇట్టిచోట్ల ముఖ్యమయిన భావముద్వేషము, హాసము దానిని ప్రచ్ఛన్నముచేయుటకు వచ్చిన సంచారి భావము కాని వేరుకాదు. కనుకనే యిది శుద్ధ హాస్యముకాదు. అట్లని మనవారికి సంస్కార ప్రియత లేదనికాని: ఉపహసించి సంస్కరించుట ఎరుగరని కాని

తలపరాదు. వ్యక్తికి బదులుగా జాతినే గ్రహించి, అపహాసపాత్రమైన లోపమ
అంటగట్టి, లేదా అట్టిలోపము మానవస్వభావాన్నే ఆశ్రయించిఉన్న దుర్గుణమ
అన్యోక్తులలోనూ, అత్యుక్తులలోనూ, వక్రోక్తులలోనూ, వ్యాజోక్తులలోనూ,
మూలముననూ హాస్యము ధ్వనింపజేసి సంస్కరించుటకు జేసిన ప్రయత్నము అ
మనవారిలో గోచరించును. మన పూర్వులు శాస్త్రమెరుగుదురు, లోకవె
మానవ స్వభావమును వారు గుర్తించిరి. మర్యాద నలవరుచుకొనిరి. తప్పు తడవనితో
తప్పుతడివి చూపగలనేర్పు సంపాదించిరి. నవ్వి, నవ్వించగలిగి, ప్రేమించి సంస
నైపుణ్యము చూపిరి. విశుద్ధహాస్యమే వారి లక్ష్యము. అదే అత్యుత్తమైన హాస
శాస్త్రము.



# హాస్యరసము

మన జీవితము సుఖదుఃఖాలనే అనుభూతిద్వయంతో ప్రారంభించును. పసిపిల్లల నవ్వు ఏడుపుల్లో యీ రెండు అనుభూతులే మనకు వ్యక్తములగును. కాని రాను రాను మనం పెరుగుతూన్న కొలదీ, మన సంబంధ సాహచర్యాదులు విస్తరించిన కొలదీ, మన ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులుకూడ వర్ధిల్లినకొలదీ, బాహ్యవిషయమై విధ్యమును పురస్కరించుకొని ఆంతరంగికములైన సుఖదుఃఖానుభూతులుకూడ భంగ్యంతరములు చూపును. ఓచోట దయ, ఓచోట కోపము, ఒకరియందు ప్రేమ, ఒకరి యందు అసూయ, ఒకపనిలో ఉత్సాహము, వేరొకటనిన అసహ్యము, ఇట్లనేక రకములైన భావములను అనుభూతికి తెచ్చుకొనుట మనమలవరుచుకొందుము. వాస్తవానికి భావములన్నియు, మూలమున సుఖానికో దుఃఖానికో సంబంధించినవే. ప్రేమ ఉత్సాహము, హాసము వంటి భావాలు సుఖవర్గమునకు జెందినవయినచో, దయ, భయము, కోపమువంటివి దుఃఖవర్గమునకు జెందినవి. ఈభావములు మనహృదయగతములై నిలచి, మనజీవితమునకొక ప్రగతినిచ్చి, మనశీలమును నిర్మించి, మనసామాజిక ధార్మికాది వ్యవస్థలకు పునాదులై ఉండును. ఇట్టిభావములలో ముఖ్యమైనవాటిని కొన్నిటిని ఏర్చి మన ఆలంకారికులు స్థాయిభావములని పేర్కొనిరి. అస్థాయి భావేతరములైన భావములను సంచారిభావములని పిలచిరి. భావము స్థాయిఅయిననూ సంచారిఅయిననూ రసాత్మకానుభూతిని ఇచ్చుటకు మాత్రము సమర్థమైనదే అనికూడ చెప్పిరి. "రససహకృయోగిత్వాద్భావాదిష్వపి రసత్వమ్" అనిన్నీ "నభావహీనోస్తి రసోనభావో రసవర్జితః" అనిన్నీ చెప్పి రసభావాలకి పరస్పర సంబంధాన్ని అంగీకరించారుకూడ.

హాసము ఒకస్థాయిభావము. అది సంచారిగాకూడ మారవచ్చును. భావమేదైననూ స్థాయిఅని పిలబడేందుకు, సాహిత్యశాస్త్రాన్ని అనుసరించి దానికి కావలసిన లక్షణాలు రెండు. కావ్యనాటకాదులు చదివినపుడుగాని, చూచినపుడుగాని, వినినప్పుడుగాని, ఆద్యంతకాలమూ మనహృదయములో మేల్కొని క్రియాశీలమై, స్థాయిగా నిలచుట మొదటి లక్షణము. "తత్ర ఆప్రబంధం స్థిరత్వాదమీషాం భావానాం స్థాయిత్వమ్" అని పండితరాయల వాక్యము. అదేసమయంలో తనతోపాటుగా మేల్కొన్న భావాల్లో అనుకూలమైనవాటిచేత పుష్టిజెందుతూ, ప్రతికూలమైనవాటికి ప్రతిక్రియగా మరికొన్ని అనుకూలమైనభావాల్ని ప్రేరేపించడం అనేది రెండవ లక్షణము. ఈరెండు లక్షణాలుగల భావం స్థాయి అనిపించుకొంటుందనీ, రసదశను పొందుతుందనీ, మనఆలంకారికులు నిర్వచించేరు.

"భావస్య స్థాయిత్వం నామ సజాతీయ విజాతీయానభిభూతతయా యావదనుభవ మవస్థానం" అనేవాక్యాని కిదేతాత్పర్యం ఈరకమైన గుణాలుగల స్థాయిభావాలు తొమ్మిది అని మనవారి పరిగణన. అవేవి అని అంటే చెప్పినది:

"రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయంతథా
జుగుప్సా విస్మయశ్చేత్థ మష్టౌప్రోక్తాః శమోపిచ." అని

రతి హాసాదులు ఎనిమిదింటిని మొదట చెప్పి, బొడ్డు తువ్వరిగా శమము కూడా కలిపి తొమ్మిది అని చెప్పడం చూస్తే, ఈ సంఖ్య కేవలం ఉపలక్షణ మాత్రమే అనిన్నీ భక్తి వాత్సల్యము వంటివేవో ఇంకా మరికొన్ని ఉండవచ్చుననిన్నీ మనం గ్రహించవచ్చును. ఏది ఎట్లున్నా హాసము మాత్రము చెప్పబడిన స్థాయి భావాల్లో ఒకటిగదా! దానిలక్షణం. "ఆత్మనః పరస్యవా యేవేషభాషాకార వికార విరుద్ధాలంకారా స్పష్టభాషణ కుబ్జత్వాదయ స్తద్దర్శన శ్రవణ జన్యమనో వికారోహాసః." అని అంటే మనలోగాని యితరులలోగాని ఉండే వికృత వేషభాషాలంకారాదులను చూచినప్పుడుగాని, వినినప్పుడుగాని, మన హృదయంలో జనించే భావానికి హాసమని పేరు ఈ హాసము అనే భావాన్ని వ్యక్తం జేసే బాహ్య చిహ్నము నవ్వు. అది ఆరు రకాలని వెనుక చెప్పితిని. ఆలంకారికుల వాక్యాల్లో వాటి లక్షణాలు ఇవి "స్మితమిహ వికసన్నయనం, కించిల్లక్ష్యద్విజం హసితం, మధురస్వనం విహసితం, సాంగశిరః కంపముద్ధసితం, అపహసితం సాస్రాక్షం, విక్షిప్తాంగం భవత్యతి హసితం." అని ఇందులో మొదటివి రెండే ఉత్తములలో ఉంటాయని మన వారి ఆశయం.

ఒక భావము మరొక భావాన్ని పేరేపించవచ్చు, లేదా ఒక భావాన్ని పురస్కరించుకొని వేరొక భావము మేల్కొనవచ్చు. ఇట్లు అనుషంగికంగా వచ్చిన భావం ప్రసంగ వశాత్తూ సంచారిగా వ్యవహరింపబడుతుంది. భయము శోకాన్ని మేల్కొలుప వచ్చు. అసహ్యము నిర్వేదాన్ని రేకెత్తింపజేయువచ్చు ప్రేమ (రతి) హాసాన్ని ప్రోత్సహించవచ్చు. ఇట్టి చోట్ల హాసము సంచారి భావంగానే స్వీకరింపబడుతుంది, "హాసః క్రోధాదయః శృంగారాదౌ వ్యభిచారిణః" అని శాస్త్రము.

హాస మనే స్థాయి భావమే హాస్యరసముగా పరిణమించును. రస మనేది కావ్యానికి దానికి మరోపేరు. కావ్యనాటకాదులు చదివినా, వినినా, చూచినా మనలో అనుభూతికి వచ్చే భావాలు మనల్ని ఆకాస్తసేపూ నిస్స్వార్థులుగా జేసి మన ప్రపంచాన్ని మరపించి, విశుద్ధమైన ఆనందాన్ని యిచ్చేవిగా ఉంటాయి. ఈ ఆనందమేరసం. ఆ ఆనందానుభూతికే రసానుభూతి అనిపేరు. అయితే ఏభావాన్ని అనుభూతికి తెచ్చుకొని మనం ఆనందిస్తామో అదే

భావం పేరట ఆ రసాన్ని పిలుస్తాము. వాస్తవానికి రసం ఏదైనా ఆనంద స్వరూపమే. అందుకే కొందరు రసం ఒక్కటే అన్నారు. స్థాయిభావాల్ని బట్టి రసములు తొమ్మిది. అందులో హాస్యరసము ఒకటి.

భావం అనేది ఊరకే మేలుకోదు. దానికి అనుకూలమైన పరిస్థితులు సమకూరే వరకు అది మన హృదయంలో వాసనా రూపంగా నిలిచి ఉంటుంది. శత్రువును చూడనిదే విననిదే మనకు కోపమురాదు. మిత్రుని చూచిగాని హర్షము కలుగదు. ఇట్లా ఓభావాన్ని మేలుకొల్పడానికి అర్హతగల విషయాన్ని, సాహిత్యశాస్త్రానుసారం, విభావమని పిలుస్తాము. భావాన్ని మేలుకొల్పేదాన్ని ఆలంబనవిభావం అనిన్నీ, ఆ మేల్కొన్న భావాన్ని ఇంకీ తీవ్రించేసే యితర విషయాల్ని ఉద్దీపన విభావాలనిన్నీ అంటారు. హాసనమునకు ఆలంబనోద్దీపన విభావాలుగా అలంకారికులు పేర్కొన్నవి ఈ క్రింది విధంగా ఉన్నాయి.

“ వికృతాకార వాక్చేష్టం యమాలోక్య హసేజ్జనః
తదత్రాలంబనం ప్రాహు స్తచ్చేష్టోద్దీపనం మతమ్ ”

ఏ వికారాలున్నాయని మనము ఒక వ్యక్తినిగాని విషయాన్నిగాని చూచి నవ్వుతామో, ఆ వ్యక్తి లేక విషయము మన హాసానికి ఆలంబనం అనీ, ఆయా పై వికారాలన్నీ ఉద్దీపనాలనీ భావము.

స్థాయి భావేతరములైన భావాలను సంచారులని పేర్కొనిరని లోగడ చెప్పితిని వీటికి మరోపేరు వ్యభిచారులని. ఇవి ఏ స్థాయి భావంచేతనైనా ప్రేరేపింపబడవచ్చు. చిరకాలం నిలవ వలసేవి కావు కాబట్టి సంచారులనిన్నీ, ఏ స్థాయిభావంచేతనైనా ప్రేరేపింపబడదగినవి కనుక వ్యభిచారులనిన్నీ పిలువబడతాయి. అయితే, స్థాయిభావమేకాదు. ఒక సంచారికూడ వేరొక సంచారిభావాన్ని ప్రేరేపించవచ్చు. అసూయవంటి భావం. తాత్కాలికంగా స్థాయిగా వ్యవహరించి, మాత్సర్య శంకాదులకు పని కల్పించవచ్చు. గ్లాని అలసత్వాన్ని కలిగించవచ్చు. లజ్జ అవహిత్థకి మూలంకావచ్చు, ఈసంచారి భావములు సంఖ్యకి ముప్పైమూడు. ఈసంఖ్యకూడ ఉపలక్షణ మాత్రమే అన్నా. హాసముచే ప్రేరేపింపబడే సంచారి భావాలు ఈవిధమైనవిగా ఉంటాయి. “నిద్రాలస్యా వహిత్థాద్యా అత్రాస్యు ర్వ్యభిచారిణః” అని విశ్వనాథుడు. ఇలాటివి ఎన్నైనా ఉండవచ్చు గ్లాని, శ్రమము, చపలత, నిద్ర, స్వప్నము, శంక, అసూయ, అవహిత్థ, హర్షమువంటి భావములెన్నో హాసం చేత ప్రేరేపింపబడేవిగా మనము గ్రహించవచ్చు. స్వార్థపరమైన భావము బయటికి వ్యక్తమవ్వ్యో

తోవలు అనేకము. వాక్కు, క్రియ, గాక అశ్రుస్వేదాది సాత్త్విక ప్రక్రియలద్వారా కూడ ఒకానొకభావం వ్యక్తముగావచ్చును. ఈ వాగంగాది ప్రక్రియలకు అనుభావములని పేరు. సత్వసంభూతములైన అశ్రుస్వేదాదులకు సాత్త్వికభావములని పేరు. హాసమనేస్థాయి భావం ఈక్రింది సాత్త్విక, అనుభావములను కలిగించునని మనవారు చెప్పిరి.

“ అను భావోక్షి సంకోచవదన స్మేరతాదయః ”

కళ్లు కూరుకుపోవటం, ముఖంవికసించడం, కళ్లంట నీరుగ్రమ్మటం, వళ్లు పులకరించటం వంటి వెన్నైనా హాసానికి అను భావాలు కలుగవచ్చునని భావము.

స్థాయికివలనే కొన్ని సంచారిభావాలకి కూడా విభావానుభావాలు ఉంటాయి. “ సంచారి భావేషు మధ్యే కేచన కేషాంచన విభావా అనుభావాశ్చ భవంతి ” అని పండిత రాయలు. కాగా, హాసము స్థాయిగానూ, సంచారిగానూ కూడా విభావానుభావములను సంచారులను కలిగి, వాటిచేత పోషింపబడి, రసముగానో, రసాంతముగానో పరిణమించి రసాత్మకానుభూతిని యివ్వగలిగిన భావమని గ్రహించ వలెను. స్థాయిభావంగ నిలిచి యీ లక్షణాలన్నీ పట్టించుకొన్ననాడు రసమనిన్నీ, మరోస్థాయికి సంచారిగాఉండి ఈలక్షణాలు పొందిననాడు రసాంతరమనిన్నీ అంటారు. స్థాయినిమించి సంచారి వర్ణించబడినట్లయితే రసాభాస అంటారు.

“విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభి చారిణిః
ఆనీయమాన స్వాదుత్వం స్థాయిభావో రసస్స్మృతః. ” అనిన్నీ
“నసూస్మర్యాదం ప్రవృత్తే నాంగరసేన నబాధితః ప్రధాన
రసో రసాభాసః. హాస్యాది భూయిష్టాశృంగారాదయఆభాసీ భవంతి”.

అనిన్నీ చెప్పిన వాక్యాలు దీనికి సాధారణ ప్రమాణాలు. అంగిరసాన్ని మించి వచ్చిన రసాంతరం ఆ అంగి, రసానికి రసాభాసత్వాన్ని చేకూర్చేది అవుతుంది. మరొక రకమైన రసాభాస అనౌచిత్యాన్ని పురస్కరించుకొని ఏర్పడుతుంది. ఈ (అవ) లక్షణం భావానికి పట్టినట్టయితే దానిని భావాభాస అంటారు. “అనౌచిత్య ప్రవృత్తిత్వ ఆభాసోరస భావయోః” అని శాస్త్రము. మాన్యజనాద్య వలంబనం హాసానికి ఆభాసత్వాన్ని ఆపాదిస్తుంది. అయితే రసాభాస భావాభాసాదులు కూడా రసాత్మకానుభూతిని యివ్వటానికి సమర్థమైనవే.

" రసభావౌతదా భాసౌ భావస్య ప్రశసమోదయౌః
సంధిః శబలతా చేతి సర్వేపి రసనాద్రసా. ః" అనే

వాక్యానికి, రసము భావము. రసాభాస, భావాభాస, భావశాంతి, భావోదయం, భావసంధి భావశబలత అనేవి అన్ని రసాత్మకానుభూతిని యిచ్చేవే అని తాత్పర్యము. కాగా, హాసము రసముగానూ. రసాంతరముగానూ రసాభాసగాను కూడా ఆనందానుభూతిని కల్గించే భావము. భావభావా భాసాదుల్లోనూ ఇంతే.

ఇతర రసాల్లో ఏర్పడే రసాభాసకి హాస్యంలో ఏర్పడే రసాభాసకి కొంత అంతరం ఉంది. శృంగారాది రసాల్లో అనౌచిత్యం సహృదయులకి అంతగా నచ్చదు. కాని హాస్యంలో, అనౌచిత్యాన్ని పరాకాష్ఠకి తీసుకొనిపోయి అనౌచిత్యానికే అనౌచిత్యం ఏర్పరిచి నట్లయితే ఏమో తప్ప, మిగిలిన చోట్ల రసాభాసకూడ అంగీకరింపదగినదిగానే ఉంటుంది. హాస్యేతరమైన రసాల్లో అవతరించిన రసాభాసకూడ, ఒక్కొక్కప్పుడు, హాస్యాన్ని మేల్కొలుపవచ్చు. అసలు రసభాసకి మూలం అనౌచిత్యం. అనౌచిత్యం అనేది ఒక వికృతి. వికృతి హాసానికి ఆలంబనం. ఈ కారణంచేత హాస్యం రసంగా ఎంత ఆస్వాదనీయమో రసాభాసగా కూడ అంత ఆస్వాదనీయమే. ఉదాహరణకి ఈ పద్యంచాలు.

" భావ కవిత్వమట్లు బహుబంగుల దోచెడు పూజ్యభావ రూ
పావధిచే, గళానిధికి హాసము గొల్పెడు విఘ్నకార్య దీ
క్షావశునిన్, గిరాతసుతు, సామజవక్త్రుని, వక్రనాస్తు, దాం
తావను నేకదంతుని, దృణాంచితు మూషకసాది నెంచెదన్ "

ఈ పద్యంలో శ్లిష్టపద ప్రయోగమూలకంగా ఒక ప్రక్కనుండి హాసము, వేరొక ప్రక్కనుండి దేవ విషయకరతి భావము వ్యంజింపబడినవి. ఇది వినాయకస్తుతి. వినాయకుడు దైవము. దేవతాలంబన హాస్యరసాభాసనే సృష్టించినది. అయినా అనౌచిత్యం కూడా ఔచిత్య పూర్ణంగా నిర్వహింపబడినందున యిది రసాత్మకానుభూతిని యిచ్చే వాక్యం అని చెప్పడానికి సహృదయ హృదయమే ప్రమాణము. ముఖ్యమైన దేవ విషయకరతిభావం, హాసంచేత బాధింపబడి రసాంతరాన్ని సృష్టించినది. ఆ విధంగా చూచినా రసాత్మకానుభూతికీ రసాభాస ( రసాంతరం ) అభ్యంతరం కలిగించటన్నందుకు యిదే పద్యం ఉదాహరణకి చాలు. ఇదే విధంగా శంకరుడు, బ్రహ్మ, గంగ, పార్వతి వంటి దేవతలెందరినో హాస్యానికి ఆలంబనాలుగా తీసుకొని రచించిన పద్యాలు శతసహస్రా

ధికంగా సంస్కృతే సాహిత్యంలోనూ తెలుగు సాహిత్యంలోనూ కూడ దొరుకుతాయి. ఈ పరంపరాగతమైన రచనా పద్ధతి, హాస్యరసాభాసను, సర్వదా, సర్వథా, సహృదయాంగీకృతమే అని నిరూపించుచున్నది.

మనవారు హాస్యాన్ని రసంగానూ, రసాంతరంగానూ కూడ వర్ణించి పోషించిరి. కావ్యనాటకాదులలో వీరశృంగారాలే ప్రధానరసాలుగా ఉండాలనే నియమంచేత హాస్యానికి ప్రధానరసంగా వర్ణింపబడి పోషింపబడే అవకాశం తక్కువ అయినందుచేతనూ, "శృంగార వీరయోర్వాసః" అనిచెప్పి ప్రధాన రసాలైన వీరశృంగారాలకి అంగంగా హాస్యం ప్రయోగించవచ్చునని అధికారం యివ్వబడుటచేతనూ, హాస్యరసాన్ని మనవారు ఎక్కువచోట్ల, అంగరసంగానే పోషించుచూ వచ్చిరి. అసలు హాస్యము శృంగారమునుండి జనించిన రసమని మనకు మరో నమ్మకం. ఆ కారణంచేత ఈ రెండిటిని కలిపి వర్ణించడం మనవారికి నచ్చిన పంథా. అలాగని హాస్యానికి ప్రాధాన్యత యివ్వలేదని అనుకోకూడదు. ప్రహసనాదులు కొన్ని కేవలం హాస్యాన్ని ప్రధాన ( అంగి ) రసంగా గ్రహించి పోషించడం కోసమని ప్రత్యేకించబడ్డాయి.

హాస్యము ఆలంబన ప్రధానమైన రసము. ఆలంబనాన్ని విరివిగా, విస్పష్టంగా వర్ణించినట్లయితేచాలు హాసము ఉదయిస్తుంది; ఆశ్రయాన్ని నిరూపించి వర్ణించవలసేటంత అగత్యంలేదు. శృంగారంలో నాయకీ నాయకులు అన్యోన్యం ఆశ్రయాలంబనాలుగా ఉంటారు. వీర రసంలో నాయకుడు ఆశ్రయం; ప్రతి నాయకుడు ఆలంబనం. ఇలా అన్ని రసాల్లోనూ ఆశ్రయాపేక్ష ఉంటుంది. కాని హాస్య భీభత్సాలు రెండిటితోనూ యీ ఆపేక్షలేదు. వీటికి సామాజికులే ఆశ్రయం.- అందుకే "నను రతిక్రోధోత్సాహభయశోకవిస్మయనిర్వేదేషు. హాస్యజుగుప్సాయోంశ్చ యథాలంబనా శ్రయయోః సంప్రత్యయః నతథాహాసోజుగుప్సాయాంచ. తత్రాలంబనస్యైవ ప్రతీతేః" అని పండితరాయలు చెప్పెను. రసాంగా ల్లోఒకటి రెండు ఏవైనా చెప్పబడక పోతే వాటిని ఆక్షేపం చేసుకోవటం అనేది శాస్త్ర మర్యాద. హాస్యంలో సామాజికులే ఆశ్రయ విభావంగా ఆక్షేప్యం చేయబడతారు. "తదాశ్రయస్య ద్రష్టృ పురుష విశేషస్య తత్రాక్షేప్యత్వాత్. తదనాక్షేపేతుశ్రోతుః స్వీయకాంతా వర్ణన పద్యాదివ రసోద్బోధే బాధ కాభావాత్." అనే వ్యాఖ్యానుసారం, అట్లాక్షేపం చేయనినాడు కూడ ఈ రసానుభూతికి అభ్యంతరం లేదని భావము.

హాస్యం ఆత్మస్థమనీ, పరస్థమనీ రెండు రకాలు. ఆలంబనాన్ని చూచి నవ్వితే ఆత్మస్థం. మరొకరు నవ్వగాచూచి వారితో కలిసి నవ్వితే పరస్థం.

"ఆత్మస్థో ద్రష్టురుత్పన్నో విభావేక్షణ మాత్రతః!
హసంతమపరం దృష్ట్వా విభావశ్చోప జాయతే
యోసౌహాస్య రసస్తజ్ఞైః పరస్థః పరికీర్తితః!".

మనలో వున్న వికారమేమనని నవ్వించవచ్చు. ఇతరుల్లో ఉన్న వికారము పరకీయమయితే మనలో ఉన్నది మనస్వంతం. ఈస్వపరాలు రెండూ హాస్యానికి ఆలంబనలే. అందుచేత, ఆశ్రయం ఏవిధంగా చూచినా ప్రేక్షకులే అవుతారు. ఒకసారి వారు ఆలంబనాన్ని చూచి నవ్వుతారు, వేరొకసారి ఆలంబనంతో కలిసి నవ్వుతారు, అప్పుడాశ్రయం కూడ వీరికాలంబనమే.

హాస్యములో ఉన్న మరొక విశేషం. ప్రధానంగానూ కాక అప్రధానంగానూ కాక, ఉదాసీనంగా తటస్థించి ఆనందానుభూతిని కలిగించటం. శాస్త్రీయ పద్ధతిలో రసాత్మకానుభూతి సిద్ధించాలి అంటే సామాజికుల భావాలు ఆశ్రయగతమైన భావాలతో తాదాత్మ్యము పొందాలి. ఈ తాదాత్మ్యతని జనింపజేసేది సానుభూతి. సర్వసాధారణంగా సామాజకులు నాయికానాయకుల పట్ల సానుభూతి పరులై ఉండి, వారితో భావ తాదాత్మ్యాన్ని పొంది, కావ్యనాటకాదుల్లో రసాన్ని ఆస్వాదిస్తారు. కాని అన్ని చోట్లా ఇలా ఆశ్రయంతో భావసామ్యం, తాదాత్మ్యత అనేవి కుదరవు. కొన్ని కొన్ని సన్నివేశాలలో సామాజకులు ఆశ్రయం పట్ల సానుభూతి చూపలేరు. రసాభాసను నిరసించేది యిందుకే. కాని రసాభాసః కాకపోయినా, తాదాత్మ్యత అనుభవించక పోయినా, తటస్థులుగా ఉండి రసాత్మకానుభూతిని పొందేపట్లు కొన్ని తటస్థిస్తూ ఉంటాయి, ప్రతి నాయకుని వీరాలాపాలు, దౌష్ట్యము వగైరా లిట్టివి. వీటిని సామాజకు లామోదించలేరు. కాని వింటారు, భావసామ్యం పొందరు. ప్రాతికూల్యం అనుభవిస్తారు ప్రతి నాయకుడు వ్యక్తంచేసేది ఉత్సాహం, సామాజకులనుభవించేది అసహనం లేదా అమర్షం. ఇది ఒక విచిత్రానుభూతి. ఒక్కొక్కప్పుడీ భావాలు రానురాను తీవ్ర రూపం దాల్చి మనల్ని ఊపిరాడని పరిస్థితిలోకి దింపి, చివరకి నాయక పక్షంలోని వారెవరైనా, అధమం ఓదాసీనుడైనా సరే, వచ్చి ప్రతినాయకుణ్ణి దూషించేవరకూ ఉద్వేగ్నులుగా జేసి నిలిపి ఉంచుతాయి. అక్కడితో తిరిగి మనకి భావసామ్యం కుదిరి, అంతరంగికంగా

వచ్చిన భావాల బరువు దిగినట్టై, ఊపిరి పీల్చినట్లనిపిస్తుంది. కాని ఇదికూడా ఒక విధమైన రసాత్మకానుభూతిగానే పరిగణించ బడుతుంది. కాగా, యిటువంటి కొన్ని సన్నివేశాలలో హాస్యసంజాగా చేసుకుంటుంది. ఇది సామాజికుల్ని ఎంతైనా, ఆనందింప జేస్తుంది. ప్రతి నాయక పక్షం వారి అవమానం, అపజయం, ఆడంబరం, భయం, ఆఖరికి శోకంకూడ, సామాజికులకి హాస్య ప్రదంగానే ఉండి, నవ్వించ వచ్చును. ఇల్లాంటిచోట్ల హాస్యం తటస్థ రసంగా సంభవిస్తుంది. దీనికి ఆశ్రయం కవి. సామాజికులు కవి భావాలతో భావసామ్యాన్ని అనుభవించి ఆనందిస్తారు. లేదా, సామాజికులే, ఆశ్రయం అనుకొనినా అభ్యంతరం లేదు.

రసవిరోధాన్ని నిర్వహించిన పట్లు కూడా హాస్యానికి తావీయవచ్చును. ఒకే ఆలంబనం పట్ల ఒకే ఆశ్రయంలో రెండు విభిన్న ధర్మాలుగల భావాలను వర్ణించినట్లయితే, రసవిరోధం ఏర్పడి, సుందోప సుందన్యాయంగా రెండిటినీ శమింపజేస్తుందని ఆలంకారికుల వాదం. ప్రేమ, అసహ్యము అనే రెండు భావాలకీ ఒకే ఆలంబనం చెప్పకూడదు. ఈ విధమైన వైరుధ్యం కూడా ఔచిత్య పూర్వంకగా నిర్వహిస్తే దోషంలేదని శాస్త్రము. హాసానికి గంభీరత పనికిరాదు, అదికారణంగా దీనికి శోకభయాదులతో పొత్తుకలియదు. "భయానకేన తరుణేనాపి హాస్యో విరోధభాక్" అని ఆలంకారిక వచనము. కాని ఈ విరోధం హాస్యంలో సునాయసంగా పరిహరింప బడుతుంది. అనాలోచితమైన కోపం. అనుచితమైన భయం, అక్కరమాలినశోకం వగైరాలన్ని హాస్యాన్ని ఉదయింప జేసేవే, హాస్యానికి ఆశ్రయం సామాజికులే అయినందు వల్ల, రసవిరోధాన్ని పరిహరింప చేయడంకాని రసవిరోధాన్నే ఆలంబనంగా ప్రదర్శించడంగాని చాలాసులభం. ఇతర రసాల్లో కూడా యీ మాదిరిగా ఉండే వైరుధ్యాన్ని పరిహరించ డానికి జేసే ప్రయత్నం, ఆ ప్రయత్నంగా హాసాన్ని ప్రేరేపించ వచ్చును. వీరభయాన కాలన్యోన్యవైరులు. ఈ విరోధం విభిన్నా శ్రయగతమైతే పరిహరింప బడుతుంది, నాయకునిలో ఉత్సాహం ప్రతి నాయకునిలో భయం వవర్ణించి రసవిరోధాన్ని పరిహరించి, సక్రమరస నిర్వహణంచేయటం కవీశ్వరులకు పరిపాటి. కాని యుద్ధరంగంలో నుండి ప్రాణభయంతో, ముచ్చెమటలుపోసి తొట్రుపాటుతో, వెను దిరిగి చూడ కుండా బ్రదికిఉంటే వదివేలనుకొని పారిపోయే ప్రతివీరుడు మన హాస్యానికే ఆలంబనగా నిలుస్తాడు. ఇదే విధంగా వీరశోకాలకి కూడ విరోధమే. యుద్ధరంగములో మరణించిన సైనికులు ఈ రెండు భావాలకీ ఒకే సారి ఆలంబన కావచ్చును. కాని ఆ సందర్భంలో ఒక దానివెంట ఒకటి నిర్వహిస్తూ నడుమ స్వల్పమైన అంతరాన్ని చూపి, మరొక ఉదాసీన రసాన్ని ధ్వనింపజేసి, విరోధాన్ని పరిహరించడం శాస్త్రీయమైన పద్ధతి

కరుణశృంగారలకీ, శృంగారభయానకాలకీ, శృంగారరౌద్రాలకీ, వీరశాంతాలకీ మధ్య అంతరాన్ని కల్పిస్తూ ఉదాసీన రసంగా హాస్యాన్ని ధ్వనింప జేయడం మనవారి విరుద్ధరస నిర్వహణంలో తరుచు కన్పించే విశేషము.

హాస్యశృంగారాలకి మైత్రి. వీర రసానికి కూడ హాస్యము అంగంగా నిర్వహింపబడవచ్చును. శృంగారానికి హాస్యమెట్లో, హాస్యానికి ఆభాస శృంగారం కూడ అట్లే అంగమై ఉండవచ్చు. అసలు హాస్యంలేనిదే శృంగారంలో సరసతనేదే ఉండదు. అయితే యీ సిద్ధాంతం చాలవరకు దుర్వినియోగం కూడ చేయబడింది. అసభ్యశృంగారాన్ని హాస్యమని గ్రహించి, అసలు హాస్యాన్నే అపహాస్యం పాలుచేసిన రచనలు కూడ మనకు దొరుకుచున్నవి. మితిమీరిన హాస్యంశృంగారాన్ని రసాభాసగా మార్చినపట్లు మనసాహిత్యంలో ఎన్నో ఉన్నాయి. హాస్యం, శృంగారంతో వలెనే భక్తి, వాత్సల్యం, స్నేహం, బంధుప్రీతి మొదలైన భావాలన్నిటితోనూ మైత్రిని నిర్వహిస్తుంది. హాసానికి ఆలంబనమైన విషయం లేక వ్యక్తి ఈ విధమైన భావాలకి కూడా ఆలంబనమై ఉండటం సహజం. హాస్యమున కాలంబనమైన వస్తువు ఒక వంక మనకి వినోదవస్తువుగాను, వేరొక వంక మనమనస్సులో రాగమో, ద్వేషమో, అసహ్యమో, ఉపేక్షయో, విరక్తియో, ఏదోమరియొక భావమును కూడ జనింప జేయునదిగాను ఉండును. కాని ద్వేషాదులు శోకాత్మకమైన భావములు వాటిని పరిహరించి రాగమో, ప్రేమయో జనింప జేయునట్లు ఆలంబనాన్ని వర్ణించి హాస్యాన్ని పోషించినచో రస సిద్ధాంతమునకు విరోధము కలుగదు. వీరరసాంగమైన హాస్యములో ద్వేషాది భావములు త్యజింపబడిననూ, అవి ప్రాసంగికముగా ఔచిత్యాన్ని ఆపాదించుకొని, రసవిరోధదోషమును పరిహరించును. శృంగారాంగమైన హాస్యములోకూడ యిదేవిధంగా ప్రణయకోపం, మానం వగైరాలు నిర్వహించేపట్ల అసూయాద్వేషాదులను కేవలమూ బాహ్యనటనగా చూపినట్లయితే రసవిరోధ మనిపించుకోదు. నాయికను పరిహాసం కోసమనే భయపెట్టి లేదా ఏడిపించి లోలోపల నవ్వుకోవడం అనేది నాయకునిలో ప్రేమను సూచించేదే కాని మరొకటికాదు. భక్తివాత్సల్యాదులలోకూడ ఛలసహాయ్యమున యీ విధమైన హాసం నిర్వహింపబడవచ్చు. ఇవి ఔచిత్యాన్ని మించి వెళ్ల వలనేవికావు. ఔచిత్యాన్ని మించి ఎల్లలుదాటి వెళ్లినట్లయితే వినోదం క్రూరవినోదంగా మారి, రసాన్ని నీరసంచేసి విడిచిపెడుతుంది. లేదా విరసంగా తాయారౌతుంది. పోతన భాగవతంలో దశమస్కంధంలోని రుక్మిణీ శ్రీకృష్ణుల సంవాదం, సరాసరి యీ రకమైన స్థితికే వచ్చినది. సరసోక్తులు సుతిమించి, కటువులై, విరసత్వాన్ని సమీపించాయి.

ఇంతవరకు చెప్పిన దానిని బట్టి హాస్యం అంటేనే ఒక విచిత్రమైన తెలియక మానదు. 'రసం' అనిపించుకోనేందుకు కావలసిన అంగాలన్నీ దీనికి 'ఆక్షేపం' అక్కరలేకుండా నిరాక్షేపణీయంగా రసమని వ్యవహరింపబడ గ హాస్యమొక్కటే. దీనికి ఆశ్రయవిభావంతో నిమిత్తంలేదు. ఆలంబనవిభావ చిత్యం అసహజత్వం, అక్షేపణీయం, వంటిగుణాలుంటేచాలు, అది ఏయితర ఆశ్రయం అయినాసరే హాసం నిరఘ్యంతరంగా మేల్కొంటుంది. ఉద్దీపనః ప్రకృతి పరిసరాచుల్లోనుండి వెదకి ఏరుకోవలసే అగత్యం హాస్యానికి లేదు ఆలంబన గతమైన సంచారులు, సాత్వికాలు, అనుభావాలు అన్ని 'ఉద్దీప తయారవుతాయి. అసలు ఉద్దీపనంలేని ఆలంబనం, ఆలంబనంలేని ఉద్దీపః దారిద్ర్యం హాస్యానికెన్నడూ పట్టదు. అందుకే హాస్యం ఆలంబన ప్రధానమై చెప్పేరు. ఆలంబనం అంటూ ఒకటి కుదురుతే చాలు అన్నీ కుదిరినట్టే. అతిసునాయాసంగా రసదశను పొందగలిగేభావం, హాసంవినా యింకోటిలేదః తక్కిన రసాలకంటే హాస్యాన్ని నిర్వహించి ఒప్పించడంగాని, మెప్పించడం సులభం. అయితే ఔచిత్యాని నిలబెట్టుకోవటం అనేదిమాత్రం కష్టం. ఈ క కనిపెట్టి మన ఆలంకారికులు ఈ రసాన్ని ఎక్కడ ఏవిధంగా ఎంతవరకు పోషిం విషయాన్ని విపులంగా చెప్పేరు.



# హాస్యప్రయోగం : విభేదాలు

మానవుడార్జించ వలసిన పురుషార్థాలు నాలుగు. అవి ధర్మార్థకామ మోక్షాలు. వీటిని ఆర్జించడానికీ, నిలబెట్టుకునేందుకీ కావలసినవి వీరశృంగారాలు. ప్రాసంగికంగా వచ్చే సుఖదుఃఖాలు వీటిలో అంతర్భూతాలు. ఈ ఉద్దేశంతోనే మన ఆలంకారికులు కావ్యనాటకాదులలో వీరశృంగారాలు ప్రధానవర్ణ్యాలనీ, శోకహాస్యాలు ప్రాసంగికాలనీ నిర్వచించారు. లేదు మేము మరోకలా ఏడుస్తామంటేవారి అటంకం మాత్రంఏమీలేదు.

నాటకంలో నాయకునివృత్తి సాహిత్యశాస్త్రానుసారం కైశికీ, సాత్త్వతీ, ఆరభటీ, భారతీ అని నాలుగు రకాలు. ఇందులో భారతీవృత్తిలో హాస్యానికి ఎంతైనా జాగా ఉంది. ఈ విషయం కవులు గమనించేరు. పండితులంగీకరించారు. ఇక కైశికీ వృత్తి నర్మ, నర్మస్ఫింజ, నర్మస్ఫోట, నర్మగర్భాలనే పేరులు గలిగి నాలుగు విధాలు. అసలు నర్మమంటే పరిహాసోక్తి అని అర్థము. దీన్నిబట్టి కైశికీవృత్తిలో హాస్యానికిచ్చిన ప్రాధాన్యత యిట్టిది అని వేరేచెప్పనక్కరలేదు. తిరిగి ఆనర్మమనేది శుద్ధహాస్యమనీ, సభయహాస్యమనీ, శృంగార హాస్యమనీ మూడు రకాలు. అవి మళ్లా ఒక్కొక్కటి శుద్ధమనీ, రసాంతరాంగ మనీ రెండేసిరకాలు. ఇలా ఆరుగా తయారైన నర్మము తిరిగి వచోహాస్య, వేషహాస్య, క్రియాహాస్యములుగా పెరిగి పదునెనిమిది రకాలయింది ఇవన్నీ హాస్య మయము. ఈ నర్మము అటు ఆముఖం, అంటే నాటక ప్రారంభంలో నటీసూత్ర ధారులు నిర్వహించే ప్రారంభికరంగం మొదలుకొని, ఇటు ఫలప్రాప్తి అంటే మంగళం పాడేవరకు ఎక్కడైనా ప్రయోగింపబడవచ్చు. అయితే, సందర్భం సమయం, వక్త, శ్రోత, విషయం, మొదలయిన వన్నీ కనిపెట్టి ఔచిత్యం చెడకుండా హాస్యాన్ని ప్రయోగించు ... అనేది కవీశ్వరుల ప్రతిభావ్యుత్పత్తుల మీద ఆధారపడి ఉంటుంది.

ఈ నర్మాన్ని పురస్కరించుకొని నాయకుని నర్మసచివులలో ఒకనిగా విదూషకు డనే పాత్ర సృష్టించబడింది. ఈ పాత్ర కేవలమూ హాస్యపోషణకే "హాస్య ప్రాయో విదూషకః" అని చెప్పి.

"కుసుమ వసంతాద్యభిధః కర్మవపుర్వేష భాషాద్యైః
హాస్యకరః కలహరతిర్వి దూషకః స్యాత్స్వ కర్మజ్ఞః"

అని అతనికుండవలసిన చేష్ట కుసుమ వసంతాదులనీ, మాటామంతీ, వేషం భాషా, ఒసిహాటూ, అన్నిటిలోనూ నవ్విస్తూ ఉండేవాడనీ, చిలిపి జగడాలకి వెనుక తియ్యడనీ, తన స్వంత పనిలో ఏ మాత్రమూ ఏ మరపాటులేని బుద్ధిమంతుడనీ కూడ వర్ణించేరు. అతని స్వంతపని ఏది అని అంటే "స్వకర్మభోజనాది" అని వ్యాఖ్యానించి నిర్ణయించేరు. అసలు భోజనం అనేది రంగస్థలంమీద చూపవలసేదికాదు. అంటే ఈయనకుండవలసేది భోజన చింత. ఏది మరిచినా, అది మరువకపోవడమూ, అన్నిటిలోనూ దానినే పరమావధిగా ఎంచడమూ, అందుకనుకూలమైన వాక్క్రియా కలాపాలు అలవరచుకోవడమూ వగైరాలు యీయన లక్షణాలు. ఈ తిండిపోతుతనం అనేది నాడుగాక నేటికీ హాస్యానికి ఆలంబనమే. ఇదొక రకమైన లోభం. కానీ ఒకరిని బాధించే రకమైన లోభంకాదు. వ్యక్తిగతమైన లేక వ్యక్త్యున్ముఖమైన ప్రీతిని ప్రేమ అంటాము; విషయగతమైన లేక విషయోన్ముఖమైన ప్రీతిని లోభమంటాము. భోజనలోభి ఇతరుల్ని దుఃఖపెట్టడు. "అన్నదాతా సుఖీభవ" అనేది యితని ఆశయము. ఈ సుగుణాలుండబట్టే యీ తిండిపోతుతనాన్ని ఆదినుండీ మనవారు హాస్యానికి ఆలంబనగా తీసుకున్నారు. మన తెలుగులో మొదట కావ్యాలు పుట్టేయి. తరువాత రమారమి ఎనిమిదివందల ఏండ్లదాకా నాటకం పుట్టలేదు. కానియీ తిండిపోతుతనంలో ఉన్న హాస్యం మాత్రం ఆదిలోనే అందుకోబడింది. తెలుగు సాహిత్యానికి ఒరవడి పెట్టినవాడు నన్నయభట్టా? నన్నెచోడుడా? అనే ప్రశ్న నా కక్కరలేదు. ఈ యిద్దరిలోనూ ఎవరుముందైనా ఎవరువెనుకైనా తిండిపోతును చూచి నవ్వేరా? లేదా? అనేదే నాకు కావలసినది. ఇద్దరూ నవ్వేరు, నన్నయభట్టుగారు భీమునిలో "శతంవిహాయ భోక్తవ్యం" అన్న పరమార్థాన్ని చూచి నవ్వితే, నన్నెచోడుడు నారదుని కలహాశనత్వాన్ని గమనించి నవ్వుకున్నాడు. ఇది నాటినుండి నేటిదాకా వస్తూన్న అనూచానమైన సాంప్రదాయం. తిండిపోతులయినా, మానినా బొజ్జలు పెంచినవారు నేటికీనవ్వులపాలవుతూనే ఉన్నారు. జాషువాగార్కి బొజ్జలు పెంచిన పెద్దపెద్ద దాడీల సంస్కృతపండితులు వ్యంగ్యంగా హేళనచేయడం కోసం రాసేరు. సమ్మానలోభులైన యీవిధమైన పండితులకంటె అన్నలోభి అయిన విదూషకుడెంతో ఉత్తముడుగదా; లోభిఎప్పుడూ హాస్యానికి ఆలంబనమే. అయితే సంస్కృత నాటకాలలో విదూషకుడు కేవలమూ తిండిపోతుగానే కాదు, కయ్యాలకి కాలుదువ్వేరకంగా కూడ కనిపిస్తాడు. ఇది దాసదాసీలతోపడే పేచీకోరు వాక్కలహము. ఇవికాక యీ విదూషకునిపని వేరేయింకొకటి ఉంది. అది నాయికానాయకుల జగడాల్లో మధ్యవర్తిత్వం వహించడం:- నాయకుని మనోభీష్ట సిద్ధికి, మనోవాక్కాయ కర్మలా సహాయ్యపడటం, లేదా ఎడముఖం పెడముఖంగా ఉన్న నాయికానాయకులను ఒకరికొకర్ని సముఖులుగా చేయటం. ఈ కార్యాన్ని దక్షతతో నిర్వహించడానికి

కావలసేయుక్తి చాతుర్యం, వాక్చమత్కృతి, లోకజ్ఞానం, పరేంగిత గ్రహణశక్తి, ఆత్మ 'విశ్వాసం' వగైరాగుణాలన్నీ యితనిలో చూపబడేవి. కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలో విదూషకుని పాత్రికిచ్చిన ప్రాధాన్యమిచ్చబడిందో గమనించినట్లయితే, యీ తిండిపోతును చూసి మనం విసుగుకోనక్కరలేదు. కాని అందరూ ఈ విధమైన కవులుకారు: విదూషకులూ ఆ రకమైనవారుకారు. కాగా, మిగిలినది తిండిపోతు, ఎద్దుమొద్దు స్వరూపము; చేటపెయ్య విదూషకులు. సంస్కృతనాటకాలలో నుండి సరాసరి తెలుగులో వచ్చిన ప్రారంభిక నాటకరచనల్లో వరకు యిదేరకం మొద్దబ్బాయి విదూషకులు మనకు దర్శనమిస్తారు.

నాటకంలో విదూషకుడేకాదు ఏ పాత్ర అయినా హాస్యాన్ని ప్రయోగించవచ్చు. ముఖ్యంగా కావలసినది వాక్చమత్కృతి. ఈ వాక్చమత్కృతి అనేక రకాలు. ఇదే భారతీవృత్తికి ఆధారం. "భారతీ సంస్కృత ప్రయోవాగ్వ్యాపారో నరాశ్రయః" అని శాస్త్రము. దీని అవాంతర భేదాల్లో వీథి ఒకటి. ఇది పదమూడు అంగాలతో ఒప్పి, హాస్యమయమై ఉంటుంది. మచ్చుకి కొన్ని చెప్పాలంటే; అసద్విషయాన్ని గూర్చి నవ్వుపుట్టించే పరస్పరస్తుతి 'ప్రపంచము' ప్రియవచనముల వంటి ఆ ప్రియవచనములతో చేసి వంచన 'ఛలనం'. ఉపహాసంతోని గూఢంగా యిచ్చిన చెంపపెట్టు లాంటి జవాబు 'నాళిక'. సందర్భ శుద్ధిలేని సంభాషణము 'అసత్ప్రలాపం' వేరే ఒక ప్రయోజనాన్ని ఆశించి, హాస్యంగా మాట్లాడితే 'వ్యాహారం'. గుణాన్ని దోషంగాను, దోషాన్ని గుణంగాను పిరాయించి మాట్లాడితే "మృదవం". గూఢార్థంగా. మాటలు పేర్చి ఓయిద్దరు ప్రశ్నోత్తరాలు సాగనిస్తే 'ఉద్ఘాత్యకం'. నోరుజారిన మాటకి వేరేఅర్థం చెప్పి తప్పుకొనేది 'అవస్యందితం'. ఇలాగే మిగిలినవికూడ మిక్కిలిగా చెప్పి విసిగించడం నా ఉద్దేశంకాదు. హాస్యాన్ని ప్రయోగించు కొనేందుకు మన ఆలంకారికులు కల్పించిన అవకాశాలేవో చూపడంకోసం ఇల్లా చెప్పవలసివచ్చింది. ఇట్లే తక్కిన సంధ్యంగాల్లోనూ, లాస్యాంగాల్లోనూ, భూషణాక్షర సంఘాతాది నాట్యాలంకృతుల్లోనూ కూడా ఎన్నో హాస్యధ్వనికి ఉపకరించే వాక్య విన్యాస విభేదాలు పరిగణింపబడ్డాయి. వాక్చమత్కృతి హాస్యమనిపించుకొనునా; లేదా! అనేది వేరేచోట మనవి చేస్తాను.

హాస్యాన్ని అంగిరసంగా గ్రహించి పోషించే నిమిత్తం ప్రహసనాదులు కొన్ని ప్రత్యేకముగా పరిగణింపబడ్డాయి అని లోగడ చెప్పేను. ప్రహసనం కూడా ఒక నాటకమే. నాటకమనే రూపక విభేదంపేరు మిగతా అన్ని రకాల రూపకాలకీ "రూఢి"గా నాడు...

తుంది. అసలు మనవారు చెప్పినవి పది రూపకాలు. అవి నాటకం, ప్రకరణం, భాణం, డిమం, వ్యాయోగం, సమవకారం, వీథి, అంకం, ప్రహసనం, ఈహామృగం' అనేవి కాని నాటకానికని చెప్పిన లక్షణాల్లో చాలామట్టుకు ఈ అన్నిటికీ యింపుమించుగా వర్తిస్తాయి కాబట్టి అన్నిటినీ నాటకాలని పిలవడం ఒకవాడుక అస్తు. ప్రహసనంలో అంగిరసం హాస్యము. అంగిరసంగా శృంగారం ఉండవచ్చు. అసలు ప్రహసనానికి లక్ష్యం కామ శృంగారం. ఇదే విధంగా కామశృంగారాన్ని వర్ణించే సమవకారములోనూ హాస్యం అంగి రసంగా స్వీకరింపబడవచ్చు.

ప్రహసనం అనేవి మూడు రకాలు. మూడు రకాల్లోనూ నీచులు, నింద్యులు, ధూర్తులు, కితవులు, విటపురుషులు మొదలైన వారి చరిత్ర వర్ణించబడుతుంది. ఈయితివృత్తము కేవలమూ కవికల్పితము ఇందులో వీథ్యంగాలు యథోచితంగా ప్రయోగించుకోవచ్చును. ఇందులో నాయకుడు తాపసి, బ్రాహ్మణుడు, దేవపూజకుడు వగైరా రకంలోనివాడు. "పాషండాదుల చరిత్ర, చేటీముఖచే ప్రయోగింపబడుచూ, హాస్యపూరితమైన వేషభాషాది కముతో ఒప్పే ప్రహసనాన్ని" శుద్ధప్రహసనం అంటారు, "వృద్ధతాపస భగవద్విప్రాది పాత్రగతమై విపరీతవేషభాషా చేష్టితమైన ప్రహసనాన్ని" వికృత ప్రహసనమని అంటారు. "వీథ్యంగాలన్నిటితోనూ పోషింపబడి విటకితవ ధూర్తాది సంకులమైన ప్రహసనాన్ని" సంకీర్ణ ప్రహసనమని అంటారు. ఈ ప్రహసనాలు రెండంకాలు కలవిగాగాని ఒకే అంకం కలవిగాగాని ఉండవచ్చు. ఈ విషయంలో నాట్యాచార్యుని వాక్యాలివి.

"లోకోపచార యుక్తా యా వార్తా యశ్చదంభసంయోగః
తత్ప్రహాస నేషుయోజ్యం, ధూర్తోక్తి వివాద సంయుక్తం.
వేశ్యాచేట నపుంసకవిట ధూర్తాబంధకీ చ యత్రస్యుః
॥ వికృతవేష పరిచ్ఛద చేష్టితకరణంతు సంకీర్ణం.॥
' వికృతంతు విదుర్యత్ర షండకంచుకి తాపసాః
భుజంగ చారణభట ప్రభృతేర్వేష వాగ్యుతాః" అంటే

లోకోపచారయుక్తమైనదీ, దంభపూరితమైనదీ ప్రహసనానికి ఇతివృత్తంగా స్వీకరించవలెననీ, శుద్ధసంకీర్ణ వికృతాలనే మూడు రకాల ప్రహసనాల్లోనూ ధూర్తుల చరిత్రే వర్ణ్యమనీ భావము. వేశ్యాచేట నపుంసక బంధకీత్యాదులు పాత్రలుగా ఉంటారని చెప్పడం, వారి చేష్టలు, చరిత్ర మొదలైన వాటిని అపహసించ డానికే అని ఉద్దేశ్యం. ఇట్లాంటి నీచవర్గం లోనివారేకాదు; మధ్యమ వర్గంలోని

వ్యక్తులను కూడ అపహసించడానికి యిందులో అనువు కల్పించ బడినట్టు "తపస్విభగవద్విప్ర ప్రభృతిష్వత్రనాయకః" అనేవాక్యం వల్ల గ్రహించవచ్చును. ఇంతేకాదు ప్రహసనంలో స్మిత హసితాది షడ్విధాలైన హాస్యాలు ప్రయోగించ బడతాయి అంటే ఇది పండిత పామరులం దరికీ ఆనందం చేకూర్చేదిగా ఉండాలని తాత్పర్యం ఇదేవిధంగా 'ప్రకరణం' కూడా కితవద్యూతకార విటచేటాది సంకులమై ఉంటుంది. 'భాణం'లో నాయకుడు పండిత విటుడు; భారతీవృత్తి ప్రధానమైన ఏకాంకిక రచన, కల్పిత ధూర్తచరితమే యితి వృత్తము. భాణము వలెనే ఉండి ఒకటి రెండు పాత్రలు మాత్రమే కలిగి ఉండి, సూచ నీయశృంగారమైనది 'వీధి'. వీటన్నిటిలోనూ పాత్రలు, యితివృత్తము అనేవి యించుమించు ఒకేరకం. శృంగార హాస్యాలు వర్ణ్యాలు. అవి యించుమించుగా విడదీయరాని విధంగా కలిపి వర్ణించ బడతాయి. ఇవే కారణాలను పురస్కరించుకొని ప్రకరణ ప్రహసన వీధీ రూపకాలు అన్యోన్యమూ సంకరమయినవి. ఈ సాంకర్యము ప్రహసనమును మరింత రస వంతముగా చేయుటకు పనికి వచ్చినది. వస్తువు విస్తరించినది. ధూర్తుల ఆగడాలు, జూద గొండుల తగువులు, విటుల విలాసాలు, విప్రులదురంతాలు తాపసుల తామసాలు, భటుల దగాలు, దూతల మాయలు అన్ని ఒకేచోట కొంత శృంగారం, కొంతవీరం, కొంతశోకం, కొంతహాస్యం కలిగి, చూపరులను నవ్వించేవిగా దొరకేయి. ప్రపంచకాన్ని, అందులో ఉన్న నైచ్యాన్ని, ఓ అద్దంలో చూపి, అపహసించి, సంస్కరించడానికి చక్కని అనువు కుదిరింది. ఇది గమనించి పూర్వపు నాటకాల్లో మధ్యమధ్య భావవిశ్రాంతి (Relief) కోసమని యిట్టి చిన్నచిన్న ప్రహసనాలను ప్రయోగించేవారు. ఇవి కేవలము హాస్యవినోద పూర్ణమైన రచనలు. వీటిలో సాధారణంగా బ్రాహ్మణులు, వారి ఆచారము, సనాతన మౌఢ్యము, వేదజడత్వము, సాధుసన్యాసులనైచ్యము, వ్యభిచారుల బీభత్సము, వేశ్యల మాయలు, నవయువకుల విలాసాలు, ధనాశా పరుల అన్యాయాలు, సేవకుల ఆగడాలు వగైరాలన్నీ వ్యంగ్యంగా నిరసించబడుతూ ఉండేవి. అయితే, వీటిలో కథాచమత్కృతి గాని, శీలవైచిత్రిగాని, ప్రసంగ సౌందర్యంగాని చెప్పుకోదగిన స్థాయిలోనివి గావు. ఇది కేవలము నవ్వించడానికే పుట్టేవి. ఈ నవ్వుకూడా అప్పుడప్పుడు అతినాటకీయమూ, అసభ్యమూ అయిన ప్రసంగాలతో పుట్టించబడేది. ఈ దోషం శృంగారహాస్యాల అన్యోన్య సంబంధాన్ని బట్టి వచ్చినది.

రూపకాలు కాక మనకు వేరే ఉపరూపకాలు కూడా ఉన్నాయి. ఇవి పదు నెనిమిది రకాలు. వీటిలోకొన్ని హాస్యరసాన్ని అంగిరసంగా పోషించుకోవటం కోసం ఏర్ప డినవే. 'నాట్యరాసకం'లో శృంగారంతో కూడిన హాస్యము ప్రధానరసము. 'కావ్యం'లో

కూడ హాస్యమే అంగిరసము. దాసదాసీలే, నాయికా నాయకులుగా ఉండి సురాపానాది ప్రసంగాల్తోనిండి, సహాస్య శృంగారమై ఉండేది "ప్రస్థానకం". హాస్యశృంగార కరుణాలు మూడింటితోనూ ముప్పేటగా పోయేది "ఉల్లాప్యకం". హాస్యమే ప్రధానరసంగాకల్గి, భాషా విభాషాయుతమై మూర్ఖనాయక యుక్తమైనది "రాసకం". ప్రహసన శృంగారము కల్గిన ప్రాకృతగోష్ఠి "గోష్ఠి." ప్రత్యంక విమాషకము "త్రోటకము". విటవిమాషకాది సంకులము "విలాసిక". భారతీవృత్తి బహుళములైన 'దుర్మల్లికా'దులు కూడ యిట్టివే చాలు. ఈ రకాలన్నీ పూర్వం వ్రాయబడినవో, లేవో అని మనకిప్పుడు సందేహము. ఆలంకారికులు చూపిన ఉదాహరణలు నేడు మృగ్యములు. తరువాతివారు అట్టి రచనలు సాగించకపోవడం మన ప్రారబ్ధం. కాని శాస్త్రాన్నిబట్టి చూస్తేమట్టుకు వీటిలో హాస్యాన్ని పోషించుకోనేందుకు అవకాశం ఎంతైనా ఉన్నదని తోచక మానదు. కాగా, వీటిని చూచిన పిదప మనంగ్రహించవలసే అంశాలు నాలుగు. మొదటిది ప్రాచీనుల హాస్యాలంబనం విటవిమాషకధూర్తమూత్యకార కితవసురాప వేశ్యాబంధకీ చేటికాదులతో ఆరంభించి, భుకంవుకీతాపస వృద్ధస్త్రీ ప్రాకృత జనాదులవరకు ఉండేవని, రెండవది దంభాచారము, వ్యర్థవివాదము, వాక్కలహము, సురాపానము, ద్యూతము, వేశ్యాలంపటత్వము, పాషండత మూర్ఖత, మోసము మొదలైనవి వారికి అపహాస్యభాజనములుకానే తోచినవని, మూడవది 'ఉక్తి ప్రత్యుక్తి సంయుక్తం' అనిగాని, 'ఉక్తివివాదయుతం' అని గాని, 'వేషవాగ్యతాః' అనిగాని చెప్పిన వాక్యాలవల్ల వాక్చమత్కృతిని హాస్యంగా అంగీకరించేరని, నాల్గవది శృంగారంలేని హాస్యంగాని, హాస్యంలేని శృంగారంగాని వారికి అంతగా రుచించలేదనిన్నీ, అసభ్య శృంగారం హాస్యంగా చలామణీ అయిందనిన్నీ, ఇదిగాక మరొక విషయం; హాస్య ధ్వని ఆంగిక, వాచక ఆహార్యాలనే మూడు అభినయాలలోనూ ఉండేది. అటు శృంగారాన్ని, ఇటు హాస్యాన్ని కూడ రసాభాసగా వర్ణించడం అనేది హాస్యసృష్టి కనుసరించే సాంప్రదాయల్లో ఒకటి అనే విషయం కూడ వీటిని చూసి గ్రహించవచ్చును.

మనవారి రససిద్ధాంతము నాట్యశాస్త్రమున కంగముగా బయలుదేరి, నాటకములో విస్తరించి, కావ్యములలో ఇల్లుగట్టుకొన్నది. 'రసమే కావ్యానికి ఆత్మ' అని నిర్వచింపబడినది. రసమేకాదు తదితర నాటక లక్షణములు సహితము కావ్యములో స్థానము సంపాదించుకొన్నవి. అధికారిక రసము శృంగార వీరశాంతములలో నొకటిగా స్వీకరింపబడినది. హాస్యరస ప్రధానమైన కావ్యభేదము మనవారి పరిగణనలో కనబడదు. 'ఇదే హేతువుచేత' "హాస్యప్రబంధంబు" రచించడానికి పూనుకొనిన కూచి మంచిజగ్గకవి తన 'చంద్రరేఖావిలాపం' లో అసభ్యశృంగారాన్ని అంగిరసంగా స్వీకరించి పోషించాడు. కాని నాటకాలకవి చెప్పబడిన

అంగాలు సంధులు, సంధ్యంగాలు వగైరాలన్నీ కావ్యాల్లో కూడ వాడ బడుతూ వచ్చిన కారణాన్న, కావ్యంలోకూడ హాస్యానికి అంగరసంగా పోషించబడే అవకాశం చాలవరకు దొరికింది. ఇది శాస్త్రసమ్మతమైన హాస్యవిధానము. అంగిరసంగా హాస్యాన్ని పోషించేందుకు తగిన కావ్యభేదము మనకులేదు. పైగా

"శృంగార వీర శాంతానా మేకోంగీరస ఇష్యతే
అంగాని సర్వేపిరసాః సర్వేనాటక సంధయః" అనే నిర్ణయం

దీనికి బాధకంగా పరిణమించింది. కాని రసజ్ఞులైన మన కవులు హాస్యరస ప్రాధాన్యాన్ని గుర్తించక పోలేదు. ఔచిత్యము చెడకుండా అనువైనచోట్ల, హాస్యమును ప్రయోగించి కావ్యమునకు జీవముపోసిరి. రచన శృంగార ప్రబంధమే అయినచోట హాస్యము విధిగా అంగరసముగా అంగీకరింపబడి, ఆద్యంతమూ పోషింపబడుతూ వచ్చినది. పురవర్ణన పౌరవర్ణన, పుష్పలావికావర్ణన, రసికవర్ణన, సర్మవయస్కుల సంభాషణ, సఖుల చతురోక్తులు ప్రేయసీప్రియుల నర్మోక్తులు, నర్మద్యుతులు మొదలైనవెన్నో హాస్యాన్ని ప్రయోగించడానికి పనికివచ్చేపట్లు వాటంతట అవేసిద్ధించినవి. కావ్యము వీరరసప్రధానమైన నాడు కూడ హాస్యము రసాంతరముగా ధ్వనింపబడేది. అనుచితమైన భయం, అనవసరమయిన శోకం, అర్థంలేని ఆడంబరం, అక్కరకురాని ఆర్భాటం అందుకోలేని ఆశలు, అసలు సిసలైన చేతగాని తనం వగైరా గుణాలు ప్రతి పక్షం వారిలో ఆరోపించి, లేదా ఆభాసింపజేసి లోలోపల గంభీరంగా నవ్వుకోవటం, మనల్నికవ్వించి నవ్వించటం వీరకావ్యరచయితలో ఉన్న ప్రత్యేకలక్షణం వల్లు తెలియని శోకంలో ప్రయోగించే "ద్రవము", వల్లు మండే కోపంలో ప్రయోగించే "అభూతాహరణము" మొదలైనన్ని రచనా సాంప్రదాయాలు కూడా ప్రాసంగికంగా హాస్యధ్వనికి ఉపకరించేవి. ("ద్రవోగురువ్యతిక్రాంతిః శోకావేగాదిసంభవా-తత్రవ్యాజాశ్రయం వాక్య మభూతాహరణం మతమ్") శాంతరస పూరితాలైన పురాణ కావ్యాల్లో హాస్యానికి అవకాశం తక్కువే, కాని అవకాశాన్ని కల్పించుకోవటం అనేది కవివ్యక్తిత్వము మీద ఆధారపడి ఉంటుంది, పరమశివుని, ఆయన పరివారాన్ని, పరిహాస భాజనులుగా చేసిన కవులెందరో ఉన్నారు. శ్రీకృష్ణుని బాల్య క్రీడలలో ఎర్రన, పోతన లిద్దరూ నవ్వినవారే. పర్వత నారదుల వృత్తాంతం, చండిక కాపురం, వంటి ప్రాసంగికమైన కథలెన్నో హాస్యాన్ని పోషించేందుకు తగిన ప్రసంగాలుగా ఎంచి వ్రాయబడ్డాయి. అసలు పురాణ కావ్యాలనేక అనేక కథాసమన్వితాలు. వాటిల్లో కొన్నికొన్ని ఘట్టాలు కథలేకావు, ధర్మశాస్త్రవిషయాలు వేదాంతసిద్ధాంతాలు, సృష్టిరహ

స్యాలు, వంశవర్ణనలు, రాజుల జాబితాలు అన్ని పురాణాల్లో స్థానం సంపాదించు కొన్నాయి. అధికారిక రసమని చెప్పబడే శాంతరసం (లేక భక్తిరసం) వీటన్నిటినీ సంపుటీకరించడానికి సూత్రప్రాయంగా గ్రహించబడుతుంది. దానిని అధికారిక రసమని అనే కంటే బీజరసం అనటం కొంత సబబుగా ఉంటుంది. కాగా, ఇలా ఏదానికది ప్రత్యేకంగా విడదీసి చూచినట్లయితే, పురాణాల్లో ఏ కథకాకథ ఒక సంపూర్ణమైన కావ్యంగా తయారవుతుంది. ప్రాసంగికాలని చెప్పిన రసాలే ప్రధాన రసాలుగా మారుతాయి. ఈ దృష్టితో చూస్తే హాస్యరస ప్రధానమైన కథలు పురాణాల్లో అనేకం దొరుకుతాయి.

తెలుగు సాహిత్యంలో శతకాలకి ఒక ప్రత్యేకస్థానం ఇవ్వబడింది. ఇవి భక్తి, వైరాగ్యం, శృంగారం, నీతి, లోకధర్మం అనే వాటిలో ఏదో ఒక దానిని ప్రధానంగా గ్రహించి వ్రాయబడినవి. వీటిలో ఏ పద్యానికా పద్యం స్వతః సంపూర్ణమైన కావ్యం. ఒక్కొక్కటి ఒక రసగుళిక. వీటిలో హాస్యాన్ని పోషించిన కవులుచూడ మనకు చాల మంది దొరుకుతారు. ఒక లోకవృత్తాన్ని ఈసడించో ఓ ఆడంబరాన్ని అపహాసించో, ఓ గ్రామ్యత్వాన్ని నిరసించో, ఓ సామ్యాన్ని వికారంగా ఎత్తిచూపి ఉన్న సత్యాన్ని పేళనగా ధ్వనింపజేసో నవ్వించటం శతక కవుల సాంప్రదాయం. వీరిరచనల్లో సామెతలు జాతీయాలు, వికటోక్తులు, యమకాలు, శ్లేషలు, వ్యాజస్తుతులు, వ్యాజనిందలు, వక్రోక్తులు అనుకరణలు, పంటి వెన్నా హాస్యధ్వనికి అనుకూలించే రచనా విధానాలు కనుపిస్తాయి. అలంకార శాస్త్రాన్ని ఆపోసన పట్టిన మన పూర్వ కవులకి, హాస్యసృష్టికి కావలసిన ఉపకరణాలు, మార్గాలు, అవకాశాలు అన్నీ సుపరిచితాలే.

మనకు గద్యకావ్యాలు తక్కువ సంస్కృత భాషలోనే గద్యకావ్యాలు విరివిగా లేవు; మనకేలావస్తాయి. ఈ భావదాస్యం మనల్ని చాలాకాలం పీడించినమాట వాస్తవం. గద్యరచనలో హాస్యానికి అవకాశం ఎక్కువ. ఆధునిక సాహిత్యంలో గద్యకి ప్రాధాన్యమివ్వబడింది. హాస్యాన్ని పోషించే రచనలు కూడా ఎక్కువగా కనిపిస్తున్నాయి. కాని ఉత్తమ హాస్యం అని అనిపించుకోగలిగిన హాస్యం చాలా తక్కువగా గోచరిస్తుంది. ఇదిగాక ఏ రకమైన రచనలోనైనా హాస్యాన్ని ధ్వనింపజేయవచ్చుననే సంగతి నేటి రచయిత్రీల్లలో, ఏ కొందరో తప్ప, మిగిలినవారు గమనించినట్లు తోచదు. నీ రసమైన శాస్త్రీయ విషయాలకి సంబంధించిన వ్యాసాలలో కూడ, అక్కడక్కడ హాస్యాన్ని ప్రయోగించి సరసంగా వ్రాయవచ్చును. ఇలా వ్రాసే రచయితలు నేడు ఏ ఒకరిద్దరో తప్ప ఎక్కువగా కన్పించరు. పై సాహిత్యాలెన్నిటిలోనో యీ రకమైన రచనలు. రచయితలు కనిపిస్తారు

నేడు మనం ఎన్నిటినో వారిననుసరించి వ్రాస్తున్నాము. ఈ విషయంలో కూడ ఏల అనుకరించరాదు? నేడు మన తెలుగు సాహిత్యంలో నానాటికీ యితోధికంగా స్థానం సంపాదించుకొంటూ ఉన్న చిన్నకథ, నవల, నాటకం, ఏకాంకిక, వ్యాసం, విమర్శ అన్నీ పాశ్చాత్య సాహిత్య సంపర్కాన్ని పురస్కరించుకొని లేచినవే. అన్నీ అంతో యింతో అనుకరణలే. అసలు గద్యలో రచన సాగించడం అనేది మనము విదేశీయులనుచూచి సాహసించి అభ్యసించిన విషయము. ఇంతకుముందు మనకు గద్య లేదని కాదు. ఇప్పుడు మనం చూస్తూన్న గద్యకి మన ప్రాచీన గద్యకి స్వరూపంలో ఏమాత్రమూ పోలికలు లేవు. 'శ్రీకారం' నుండి 'చిత్తగించవలెను' వరకు గద్యలో వ్రాసిన పుస్తకాలట్టే మన పూర్వులెరుగరు. చంపూకావ్యాల్లో వ్రాసిన గద్య కొల్లేటి చేంతాటి గద్య. దానికొక ముక్కూ మొగమూ ఉన్నట్లు తోచదు. అదో ఛందోనిబద్ధముకాని దండకం. భట్టబాణుని కాదంబరిని అనుకరించి వ్రాసిన గద్యరచనలు కూడ మనకు లేవు. కాగా, నేటి మన గద్య పూర్తిగా పాశ్చాత్య గద్యకి అనుకృతి. అయితే, అనేకమైన అనుకరణలలో సిగ్గుపడనక్కరలేని అనుకరణ. గద్యకి ఒక పరిష్కృతమైన రూపం ఏర్పడిన తరువాత నవల, నాటకం, వ్యాసం, కథ వగైరాలన్నిటికీ వికసించడానికి తగిన అవకాశం కలిగింది. ఇవికూడ అనుకరణలే, అప్పుగాక. మంచిని అనుకరించడం మంచికే. ఆసేతు శీతాచలమూ నేడు ఇట్టి అనుకరణ వ్యాపించి ఉంది. ఇక మనకేమి? అనుకరించడం రాదా? అనుకరిస్తే దోషమా? ఈ అనుకరణతో పాటు పాశ్చాత్యుల హాస్యరచనా విధానంకూడా స్వేచ్ఛగా అనుకరింపబడింది. అక్కడక్కడ వారి ఆలంబనాలనుకూడ యథాతథంగా గ్రహించడం కనిపిస్తూంది. ఆధునిక సాహిత్యంలో ఉన్న హాస్యాన్ని సమగ్రంగా అర్థంచేసుకోవాలంటే పాశ్చాత్యుల ఆయా హాస్యరచనా విధానాలే కాకుండా వారి హాస్యతత్వాన్ని కూడా స్థూలంగానైనా తెలుసుకోవలసి ఉంటుంది.

పాశ్చాత్యులలో హాస్యం ముఖ్యంగా రెండు రకాలు. ఒకటి 'హ్యూమర్' (Humour) నీ, రెండవది 'విట్' (Wit) అనీ పిలవబడతాయి. వాస్తవానికి మన భారతీయ దృష్టిలో యీ రెండూ హాస్యాంతర్గతాలే. కారణం రెండూ రసాత్మకానుభూతిని కలిగించేందుకు ఒకేవిధంగా తోడ్పడతాయి గనుక. కాని వారి మతంలో ఈ రెండిటికీ అంతరం చెప్పబడింది. ఆ అంతరం ఏదంటే, 'హ్యూమర్'లో వికృతి సహజంగానే ఉంటుందనీ, 'విట్'లో వికృతి ఆరోపింప బడుతుందనీన్ని. అసల్లోనో, ఆరోపణలోనో వికృతి అనేది ఉంటేచాలు హాస్యం జనిస్తుందని మన వారి మతం. వారి నిర్వచన ప్రకారం, హ్యూమర్ అనబడే హాస్యం ప్రకృతిని ఆధారంగా తీసుకొని, సహజత, వేషభాషా

చేష్టా సన్నివేశాదులచేత కలిగించబడుతుంది. "స్వాభావికమూ, సంభావ్యమూ, సంభవమూ అయిన వికృతివల్ల జనించే ప్రహర్షమే హ్యూమర్" అని చెప్పిన నిర్వచనము మన భారతీయ హాస్య నిర్వచనానికి చాలా సన్నిహితమే అని వేరే చెప్పనక్కరలేదు. కాని హర్షమని చెప్పడం వల్ల ప్రసన్నత, సుముఖత్వం ఉల్లాసం వంటి భావాలుకూడా యిందులో అంతర్గతమైపోయినందున యీ 'హ్యూమర్' అనే శబ్దానికి అర్థవిస్తృతి కలిగింది. మన మతంలో హర్షం తక్కిన రసాలకి వలెనే హాస్యానికి కూడ సంచారిగా రావలసే ఒక భావం మాత్రమే. అంటే హాస్యంలో హర్షం రావచ్చుగాని, హర్షాన్నే హాస్యమని అనుకోనేందుకు వీలులేదు.

'విట్' అనేది వాక్చమత్కృతి లేక వికృతిని తటాలున ఆరోపించగల ప్రజ్ఞ. ఓ మానవునిలోనో ఒక పరిస్థితిలోనో, ఒక ఘటనలోనో ఒక స్వభావంలోనో ఆకస్మికంగా వచ్చిన లేక అలవర్చుకోవడంవల్ల ఏర్పడిన వికారాలను, ఉన్నవి ఉన్నట్టుగానే చూపి చెప్పడానికి బదులు, మరేదో ఉదాహరణచూపి, ఉపమానం చెప్పి, సామ్యం గుర్తింపజేసి, కొంత కళా కవిత్వమూ కలిపి, తటాలున మన దృష్టిని వికృతివైపు మరలించే ప్రజ్ఞ 'విట్'. మీద చెప్పిన 'హ్యూమర్'లో వికృతి వికృతిగానే చూపబడుతుంది. ఈ 'విట్'లో వికృతిలేనిచోటకూడా ఆరోపించబడటమో, ఆభాసింపజేయబడటమో అవుతుంది. 'హ్యూమర్'లో హృదయ ధర్మానికీ, 'విట్'లో బుద్ధితత్వానికి ఎక్కువ ప్రాధాన్యముంటుంది." మన భాషలో పిలుస్తే 'హ్యూమర్'ని హాస్యం అనిన్నీ 'విట్'ని వికట ప్రజ్ఞ అనిన్నీ పిలువవచ్చు. వికట ప్రజ్ఞ (Wit) తో కూడిన మాటకి 'వికటోక్తి' (Witticism) అని పేరు. మెచ్చికోలు, వ్యంగ్యం, చమత్కృతి వగైరాలతో ఆడే ఒక ఆటలాటిదే 'వికటాలాడుకోవడం' అనేది. ఒక సక్రమసంబంధంలో ఉన్న మన భావాలకి తటాలున అడ్డువచ్చి 'వేదాంతులు వస్తున్నారంటే చెంబులు జాగ్రత్త' అని చెప్పినట్లు మన ఆలోచనకి మరో ఆధారం చూపి, లను పెడమొగం పట్టించడంగాని, అయినది కానట్లో, అటునుండి ఇటు వ్యత్యస్తంగానో షించడంగాని, దేనినీ అంతగా పట్టించుకోకుండా, వేళాకోళపు దృష్టితోనో, వెక్కిరింపుతోనో చూస్తూ 'అంతా మామూలే' అని భాసింపజేయడంగాని వికటప్రజ్ఞకలకి ఎడంచేతిపనిగా ఉంటుంది. తర్కాన్ని లేవదీసి, నిజాన్ని ధ్వనించి ఆక్షేపించే జోక్తులు, తర్కాన్ని కావలసిన ప్రక్కకి మళ్లించి నిజాన్ని కల్లగానో, కల్ల నిజంగానో సింపజేసే ఛలోక్తులు కూడ వికటప్రజ్ఞలో (Wit) అంతర్గతాలే. కాని అవి శ్రోతకి ంకాకపోతే నిరర్థకం. వికటోక్తులలో ఉన్న చమత్కృతి శబ్దగతంగానూ అర్థగతంగానూ డ ఉండవచ్చు. కాని శబ్దగతం అయిన వికటప్రజ్ఞ (Wit) అనువాదానికి లొంగదు. ంగ్యపూర్ణమైన సంభాషణకూడ ఒకప్పుడు శబ్దాధారంమీద నడుస్తుంది. కాని ఆ వ్యంగ్యం

బయటపడి వాచ్యం అయినట్టయితే వికటప్రజ్ఞ (Wit) హాస్యం (Humour) గా మారుతుంది. ఒక వెక్కిరింపు సమర్థనగాని ఒక వేళాకోళపు సారగ్రహణంగాని 'దావాపోయినా కోర్టు పద్ధతులు తెలిసేయిగదా' అనేరీతిలో చెప్పినప్పుడు కూడా ఈ వికటప్రజ్ఞ (Wit) అందరికీ తేటతెల్లంగా తెలిసి హాస్యం (Humour) గా మారిపోతుంది. ఒక నీతివాక్యం, ఒక పద్యపాదం, ఒక వేదవాక్యం, ఒక వేదాంతసత్యం వంటివి ప్రస్తుత ప్రసంగానికి అన్వయించే లాగ ఉల్లేఖించి ఉన్న అర్థానికి విరుద్ధమైన వికటార్థాన్ని స్ఫురింపజేయడం సజీవమైన వికటప్రజ్ఞ. ఈ దృష్ట్యానే జాతీయాలు సామెతలు వగైరాలు సమయోచితంగా వాడబడి వికటార్థాన్ని ధ్వనిస్తాయి. కాని అట్టి సామెతల్లో స్వతః నవ్వు కల్గించే అర్థం ఉన్నట్టయితే వికటప్రజ్ఞ (Wit) హాస్యం (Humour) గా మారుతుంది.

వికటప్రజ్ఞలో పరిపూర్ణమైన అనుభవము, పరిపక్వమైన జ్ఞానము, ప్రకృతి నిరీక్షణ వగైరాలు కూడ మేళవించి ఉన్నట్లయితే అది వినోదప్రజ్ఞ అవుతుంది. వేమన్న సూక్తుల్లోనూ, శతకకవుల అర్థాంతరన్యాసాలలోనూ, నిదర్శన, దృష్టాంతం వంటి అలంకారాల్లోనూ మనకీప్రజ్ఞ ఎక్కువగా గోచరిస్తుంది. ఇదేకాదు పంచతంత్రి కథల్లో ఉన్న రూపకాంతర్గతమైన నిగూఢ సత్యం, అరేబియన్ నైట్సు కథల్లోనూ, మన శుకసప్తతి కథల్లోనూ ఉన్న యుక్తి చాతుర్యం వగైరాలుకూడా యిదే రకమైన వికటప్రజ్ఞకి ఫలితాలుగా గ్రహింపబడ్డాయి. కాని భారతీయ సాంప్రదాయంలో యివి హాస్యమనిపించుకోదు. కేవలయుక్తిగాని, చమత్కృతిగాని హాస్యం కల్గించవు. మనః ప్రసన్నతనో, ఆశ్చర్యాన్నో కలిగిస్తాయి. ఇవి హాస్యానికి సన్నిహితం కావచ్చుగాని, హాస్యాన్నే కలిగిస్తాయనిగాని, హాస్యమే అనిగాని అనుకునేందుకు వీలులేదు. అయితే సమయం, సందర్భం కూడా జతపడిననాడు వీటివల్ల హాస్యం జనించి పోషింపబడడానికి అవకాశం ఏర్పడుతుంది. ముఖ్యంగా కావలసినది వినోదం, చర్చలు వినోదకథలు, రామలింగని కథలు, వగైరాలలో ఉన్నయుక్తి చాతుర్యం వినోద మిశ్రితమై హాస్యాన్ని గొల్పుతూంది.

వేరొక కావ్యాన్నిగాని, కవితాశైలినిగాని అక్షరశః అనుకరిస్తూ, లేకితనాన్ని కల్గించి,లేవిడీకొట్టి, వేళాకోళంచేసే హాస్యానుకృతులు(Paradies) పాశ్చాత్య సాహిత్యంలో కొంతస్థానం సంపాదించుకొన్నాయి. తెలుగులో కూచిమంచి జగ్గకవి వ్రాసిన "చంద్రరేఖా విలాపం" యీ రకమైన రచన అయితే యీ హాస్యం మూలకృతి తెలిసిన నాడుగాని స్పష్టంగా బోధపడదు. మూలకృతిలో ఉన్న గంభీరత, అనుకృతిలో అనూహ్యమైన స్థాయిలోకి అవతరించి, లేకితనానికి జాగాచేస్తుంది. ఈ వైపరీత్యమే యిందులో ఉన్న

హాస్యహేతువులైన వికృతి. హాస్య రచయితకి కావలసినదల్లా క్రింద పడడం, లేదా త్రోసి పుచ్చడం. చెడపడానికి చేటు పెయ్యాలనన్నట్లు, రామాయణం వంటి కావ్యాన్ని గూడా వికారంగా చదివి అసహ్యమైనదనిపించవచ్చు. గాంభీర్యం కావ్యానికీ, లేకితనం హాస్యానికీ స్వాభావికమైన గుణాలు. అణుమాత్రం అసందర్భమో, పటిష్టతాభంగమో, ఐక్యతా విచ్ఛిత్తియో ఏర్పడితేచాలు గంభీరత చస్తుంది. వెంటనే లేకితనం తలెత్తుతుంది. ఈ సులువైన హాస్య నిర్మాణసూత్రం యీ హాస్యానుకృతులలో అనుసరింపబడుతుంది. వెంటనే ఆకర్షించి హాస్యాన్ని రక్తికట్టించడం కోసం యిలా వ్రాసిన పద్యాలూ శ్లోకాలూ పనసలూ వగైరాలు పగటివేషగాళ్లు చదువుతూ ఉంటారు. కాని యీ అనుకృతులు మరో విధంగా మూలానికి గౌరవం తెచ్చేవి కూడా అవుతాయి. మూలాన్ని విస్మరిస్తే, యీ అనుకృతికి అసలు అస్తిత్వమే ఉండదు.

మనకావ్యాల్లో రసభావాదుల కెంత ప్రాధాన్యం యివ్వబడిందో అంత ప్రాధాన్యం, పాశ్చాత్యకావ్యాల్లో పాత్రపోషణ, శీలవైచిత్రి, ఘటనా వైవిధ్యం, విధివైపరీత్యం వగైరాల కివ్వబడింది. మనకు పాత్రలచే గాని ఘటనాదులచేగాని ధ్వనింపబడిన రసము ముఖ్యం. పాశ్చాత్యులకి రసాశ్రయమైన పాత్ర ముఖ్యం. ఈ కారణాన్ని పురస్కరించుకొని పాశ్చాత్య సాహిత్యంలో ఎన్నో హాస్యాశ్రయమైన పాత్రలు (Humorous Characters) సృష్టింపబడ్డాయి. ఈ పాత్రలు హాస్యానికి ఆశ్రయం, ఆలంబనం కూడ అవుతూ ఉంటాయి. అత్యధికమైన, లేక అత్యున్నతమైన, హాస్యం ఇట్టి హాస్య పాత్రను సృష్టించి పోషించడంలోనే ఉంటుందని పాశ్చాత్య శాస్త్రజ్ఞులమతం. తెలుగులో మొక్కపాటి వారి 'బారిష్టరు పార్వతీశం' యీ రకమైన సృష్టి. అసహజత్వాన్ని ఒక క్రమగతిలో ఎడ తెగకుండా నడపడం యీ రకపు రచనల్లో ఉన్న విశేషం. వీటిలో ఘటనలు పూర్వనిర్ణీతాలై, వికృతికి ఓక్రమం ఏర్పరుస్తూ, అడుగడునా అసంభావ్యమైన విషయాలు తారసిల్ల జేస్తూ, అన్నిటినీ ఒకే సూత్రానికి గ్రుచ్చి యిక్కడితో సరియైన లేక లోకసామాన్యమైన, పంథా కుదురుతుందనే ఆశ అనుక్షణమూ కల్గిస్తూ, ఆఖరికి అనుకోని వంపులోకి కథనీడుస్తాయి. మనఊహ ఒకటీ సరికాదు; పాత్రగాని, కథగాని మనల్ని విడవదు; కథాగతి సక్రమమే; ఘటనలు ఒకదానికొకటి అతికినవే. ఉన్నదల్లా నిర్వహణలో చూపే వైకృతి. ప్రపంచం తల్లక్రిందులైనట్టు, వికృతి సహజమైనట్టు భాసింప జేయడం యీరచయితకి నియమం. వైముఖ్యంలో సుముఖత్వం, సుముఖత్వంలో వైముఖ్యం చూపి, మన తర్కాన్ని, ఊహని, సదుద్దేశాన్ని, అనుభవాన్ని అన్నిటిని అనుకోని రీతిగా పరిణమింప జేయటం అనేది వీటి సిద్ధాంతం. తెలివి తక్కువ తనాన్ని గుడ్డిగా నమ్మి, పొరపాటు

సహజం అనుకొన్నది అయినదల్లా సత్యమే అని గ్రహించడం యీ పాత్రకి శీలం. అయితే ఋజువే మానవులలో ఉన్న లోపం. ఆలోచనకి దూరం కాకుండా ఉండే తెలివి తక్కువ తనం మనలో ఒక సరదా అయిన గుణం, ఇది చివరికి 'మనం యింతే కదా' అనో 'అయ్యో, పాపం!' అనో అనిపించి, కళ్లుచెమ్మగిల్లించి నవ్వించేరకం. ఇదే విధంగా అల్లరితో కూడిన అతిసాహసం, అనిశ్చితమైన సుఖంకోసం పడే ఆరాటం, అలువుబలువులు తెలియక సాగించే ఆర్భాటం, శృంగారంలో జరిగిన శృంగభంగం వగైరాలతో చిత్రించిన పాత్రలు, వాటికథలు కూడ యీరకమైన హాస్యాన్నే సృష్టిస్తాయి. ఈ హాస్యం ఉత్తమ కోటికి చెందుతుందన డానికి ప్రబలప్రమాణం ప్రజాదరణ. ఈ రకపు హాస్యపాత్రలు, ఆభాష, ఆజాతి, నిలిచినంత కాలము నిలిచి ఉంటాయి. బాచిగాడు, పరమానందయ్య, పార్వతీశం వంటి పాత్రలు తెలుగు హృదయంలో శాశ్వతమైన స్థానాన్ని గడించాయి. కవిప్రతి. భావంతుడైననాడు వేరే కథలోనో. నాటకంలోనో కూడ యిట్టి హాస్యాలంబనమైన పాత్రనుదిద్ది అందిస్తాడు. మన తెలుగునాట గిరీశాన్ని సుబ్బిశెట్టినిగాని ఎరుగని వారుండరు. వీటిలో ఉన్న విశేషమేమంటే, కథ మరచినా, పాత్రను మరవలేక పోవటం; కాలాంతరాన ఈ పాత్రను కేంద్రీకృతంచేసి అల్లినకథలు అంటగట్టిన వృత్తాంతాలు అత్యధికంగా పోషనూపటం; చివరికీ పాత్ర దేశ కాలాద్యవధులన్నిదాటి విశుద్ధంగా జాతీయ మైన ఒక సొత్తుగా ఉపమాన పురుషుడుగా పరిణమించటం.

పాశ్చాత్య సాహిత్యంలో అధిక్షేప హాస్యం (Satire) ఒక విశిష్టమైన స్థానం సంపాదించుకుంది. ఈ అధిక్షేప కావ్యాల్లో ఓ కవినో, రాజకీయవేత్తనో మరెవరినో హేళన పూర్వకంగా నిందించటం కనిపిస్తుంది. ఇలావ్యక్తిగతంగా కాకుండా ఓ సంస్థనో, సమాజాన్నో హేళన చేయటంగాని, సంఘంలో వ్రేళ్లుపాతుకొనిపోయి ఉన్న మూఢా చారాలు, అంధ విశ్వాసాలు, వెర్రిమొర్రి సాంప్రదాయాలు వగైరాలను హేళన చేయటం కాని ఈ అధిక్షేప కావ్యాల్లో అప్పుడప్పుడు కావ్యవస్తువుగా కనిపిస్తుంది. పారశీక సాహిత్యంలో 'హజో' అనే సాహిత్యశాఖ యిదే రకమైనది. మన ప్రాచీన సాహిత్యంలో యిట్టి రచనలకంత ప్రాముఖ్యము కలుగలేదు: పిండిప్రోలు లక్ష్మణకవి వ్రాసిన 'రావణ దమ్మీయము' తెలుగులో వ్యక్తినిందకి నాంది. ఆధునికులలో తిరుపతికవులు 'గీరతం' వ్రాసి, మరి కొందరికీ రకం రచనలు చేయటానికి త్రోవచూపెట్టేరు. అనంతపంతుల రామలింగ స్వామిగారి శుక్లపక్షము' తెలుగులోగల అధిక్షేప కావ్యాలకి తలమానికము. తత్కాలీన కవినో లేక రాజకీయవేత్తనో నిందించుటకు బదులు, జాతినీ, తద్గత ఆచార చారాలనూ లోపములెంచి సంస్కారాభిలాషతో నిందించినటయితే, ఆలంబనకి వ్యాప్తికలిగి, అధి

క్షేపము హాస్యానికి సన్నిహితమవుతుంది. పానుగంటివారి 'సాక్షి' ఈ రకమైన అధిక్షేప హాస్యమునకు ఉదాహరణ. కాని తక్కినచోట్ల యీ హాస్యము నిమ్న తరగతికే చెందుతుందని అయితే, సంస్కరించడానికి యీ హాస్యం వజ్రాయుధం వంటిది. "శఠం ప్రతి శాఠ్యం సమాచరేత్" అన్న న్యాయం యిందులో కొంతవరకూ కనిపిస్తుంది. ఫలతః యీ హాస్యం కొన్నిచోట్ల కటువుగా మారుతుంది. అధిక్షేపం వ్యక్తిగతమైన నాడు యీ దోషం మరీ విస్పష్టంగా గోచరించి హాస్యాన్ని ఆక్రోశం క్రింద మార్చి విడుస్తుంది. ద్వేషామర్షాలతో గూడి ఉన్న యీ హాస్యం శుద్ధహాస్యమనిపించుకోదు. అదే కారణాన్ని పురస్కరించుకొని మనవారిట్టి రచనలంతగా చేయలేదు. అధిక్షేప చాటువులు మాత్రం అధికంగా దొరుకుతాయి. పుస్తకాలకు పుస్తకాలే వ్రాసి సమయాన్ని ప్రతిభని వినియోగించి తిట్టడమే పనిపెట్టుకొన్న కవులు మనకి తక్కువ. అయితే, యిప్పుడీలోపంలేదు. చాలా మంది నేడిట్టి రచనలు చేసినవారూ చేస్తూన్నవారూ మనకి కనిపిస్తున్నారు. గద్యతో పాటు యీ అధిక్షేప హాస్యంకూడా అతిశయిస్తూంది. అంతేకాదు అధిక్షేపం కొంతలో కొంత మృదువుగా ఉంది. హాస్యాన్ని ప్రధాన లక్ష్యంగా నిరూపిస్తూంది. కాని ఇంగ్లీషులోని 'గలివరుయాత్రలు' వంటి రచన యింకా తెలుగులోకి రాకపోవడం శోచనీయం.

అధిక్షేపానికి సన్నిహితంగా ఉండి సాయపడేది వ్యంగ్యం (Irony) పాశ్చాత్యుల యీ వ్యంగ్యానికీ (Irony) మన లాక్షణికుల వ్యంగ్యానికీ భేదం ఉంది. వారి వ్యంగ్యం, కొన్ని చోట్ల వ్యంగ్యార్థాన్నీ, కొన్నిచోట్ల లక్ష్యార్థాన్నీ కూడా యిస్తుంది. లక్ష్యార్థాన్ని యిచ్చేచోట్ల 'విపరీతలక్షణ' కనిపిస్తుంది. అధిక్షేపకావ్యాల్లో యీ విపరీత లక్షణ ఎక్కువగా వాడబడుతుంది. ఇదిగాక కోరికోరి ఒక విషయాన్ని ప్రచ్ఛన్నం చేస్తూ మరొక తొడుగుతొడిగి, అందుకను కూలంగా నటిస్తూ ఆడిన మాట కూడ వారిలో 'వ్యంగం' (Irony) అనే చెప్పబడుతుంది. నాటకాల్లో వ్యంగ్యానికి (Dramatic Irony) ఒక ప్రత్యేకస్థానం, విలువ యివ్వబడ్డాయి. ఆ నాటకీయ వ్యంగ్యం కూడా రెండు విధాల కనిపిస్తుంది. ఒక పాత్రనోట, తెలిసో తెలియకో, భావికథా సూచకమైన పలుకులు పలికించడం మొదటిరకం. దీనిని హాస్యంగా గ్రహించడానికి వీలులేదు ఇది కేవలం చమత్కృతి, ఇక రెండవ రకమైన నాటకీయ వ్యంగ్యం (Dramatic Irony) పాత్రల అన్యోన్య సంభాషణలో మువ్విధాల ప్రయోగింపబడుతుంది. ఒక పాత్ర తెలివి తక్కువగా ఏవో మాట్లాడటం అది ప్రేక్షకులు గమనించి నవ్వటం అనేది దీనిలో మొదటిరకం. ఇందులో పాత్ర సత్యాభాసను చూచి మోసపోతాడు, ప్రేక్షకులు సత్యానికీ యీ ఆభాసకీ పాత్రలో తాత్కాలికంగా ఏర్పడిన మూర్ఖతకీగల కార్యకారణాలు గ్రహించి నవ్వు

కుంటారు. పాత్రలొకరికొకరు తెలియక ఒకదానికింకొకటి మాట్లాడటంగాని, చెప్పకూడని రహస్యాలు చెప్పేసుకోవటం గాని రెండవ రకము. ప్రేక్షకులు పాత్రలు పడుతూన్న పొరపాటు గ్రహించి నవ్వుకొంటారు. ఇదేరకమైన సంభాషణ ఒకపాత్ర పొరపడి ఉండి, వేరొకపాత్ర తననుతాను పరిచ్ఛన్నం చేసుకొంటూ ఉండి జరిపినట్లయితే మూడవ రకము. ఇందులో ఒక పాత్ర చతురుడు. రెండవ పాత్ర మోసానికి గురియై తాత్కాలికంగా మూర్ఖుడవటం, నవ్వుల పాలవటం జరుగుతుంది. ఈ అన్నిటిలోనూ ఉండే ముఖ్యలక్షణం పొరపాటు. దాని తరతమ భేదాలు నవ్వులో హెచ్చు తగ్గులు ఏర్పరుస్తూ ఉంటాయి. అయితే యీ రకాలన్నీ మనవారు కూడా వాడినవే. మనవారు వీథ్యంగాలుగా చెప్పిన ఉద్ఘాత్యకాదు లిట్టివి. ఇవిగాక అభాసను నిరసించి సత్యాన్ని ధ్వనించే వ్యంగ్య వాక్యాలు (వక్రోక్తులు, వ్యాజోక్తులు వగైరాలు) కూడ పాశ్చాత్యులచే "వ్యంగ్యం" (Irony) గానే గ్రహింపబడతాయి. ఒక పనిచెయ్యబోగా అది వికటించి "అయ్యవారిని చెయ్యబోతే కోతి అయిం" దన్న చాటంగా తయారైతే అది 'విధి' లేక 'ఘటనావ్యంగ్యం' (Irony of fate or action) అని పిలవబడుతుంది. మనవారి 'అవలిగతం' అనే వీథ్యంగం యిట్టిది. (యత్రైకత్ర సమావేశాత్ కార్య మన్యత్రసాధ్యతే! ప్రస్తుతే ఽన్యత్ర వాన్యత్ స్యాత్తచ్చావలిగతం మతమ్॥) అయితే యివి అన్ని చోట్ల హాస్యాన్ని కలిగించేవి కావు. సమయం, సందర్భం అనే వాటిపై ఆధారపడి, అనువైన చోట హాస్యాన్ని ధ్వనించడానికి ఉపకరించేవిగా ఉంటాయి.

జీవితాన్ని తేలికగా, వినోదదృక్పథంతో చూపే హాస్యనాటికలు(Comic Plays) కాక, ప్రత్యేకంగా హాస్యాన్నే అవధిగా కల్గి నడిచే మన ప్రహసనాలవంటి 'ఫార్సు' (Farce) అనబడే రచనలు కూడ పాశ్చాత్య సాహిత్యంలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ 'ఫార్సు'లో యదార్థం తక్కువగానూ, అసంభావ్యమైన కల్పన ఎక్కువగానూ ఉంటుంది. హాస్యనాటికల్లో యదార్థం, సంభావ్యం, అయిన విషయాలు వర్ణించబడుతూ, పరిస్థితికీ (Situation) పాత్రకీ (Character) గల సంబంధంలో అనుకోని వికృతి ఏర్పర్చబడుతూ ఉంటుంది. పాత్ర పరిస్థితి వశాత్తూ, తనకుతానుగానే, విరుద్ధంగా నడిచి నవ్వులపాలవుతాడు. 'ఫార్సు'లో పాత్రలు, ఘటనలు, అన్నీ ఆ చివరినుండి యీ చివరిదాకా వికృతంగానే చూపబడతాయి. తెలుగులో యీ రెండు విధాలైన రచనలు నేడు దొరుకుతాయి. మన ప్రహసనం, వేషంమార్చి 'ఫార్సు'గా తయారైనట్టుకూడ కనిపిస్తోంది. వస్తువు పాత్ర, సంభాషణ, అన్నీ సరికొత్త రీతిలో కూర్చబడుతున్నాయి. ఈ కాలనికిది సరిపోయి మన వారి ఉదారతకి, సమయజ్ఞతకి ప్రమాణంగా ఉంది, పాశ్చాత్య సాహిత్యంలో యిప్పు

డిప్పుడు కనిపిస్తూన్న 'సూక్ష్మాఖ్యాయికలు' (Nut-shell Novels) యింకా వచ్చినట్లులేదు. వీటిలో కథ శ్లేషాధారం మీద నడిచి, చిట్టచివరదాకా రెండో గోప్యంగా ఉంచి, ఆఖరున బయటపెట్టి నవ్వించే ధోరణిలో వ్రాయబడుతు రెండోసారి కథంతా చదివి శ్లిష్టపదాల్లో ఉన్న అర్థాన్ని గ్రహించి పాఠకుల ఇందులో నవ్వుకి మనం మొదటపడిన పొరపాటు హేతువుగా ఉంటుంది.



# హాస్యకల్పన

హాస్యగ్రంథాని కుండవలసే లక్షణాలు ఫలానా అని చెప్పడం చాలాకష్టం, ఇంతవరకూ చెప్పిన దానినిబట్టి హాస్యరచనలో అవాంతర భేదాలు అనేకం ఉన్నట్లు తెలియక పోదు. ఇక ఒకానొక గ్రంథాన్ని హాస్యగ్రంథమని నిర్ణయించడం మరీ కష్టమైనపని, కారణం, మన కావ్యాలన్నిటిలోనూ శృంగారమో, వీరమో ముఖ్యరసమై ఉండటమే. కాగా శైలి, అర్థవ్యంజక శక్తి, ఘటనా నిర్మాణ విధానం, రసాంతర సంసృష్టి, అవాంతర కథాసంవిధానం వగైరాలననుసరించి వాటిలో ఉన్న హాస్యధ్వనినీ దాని తరహానూ గ్రహించికొని, కావ్యవస్తువుయొక్క తత్వమూ, ఉద్దేశమూ వగైరాలు గమనించికాని ఏదైనా ఒక గ్రంధాన్ని హాస్యగ్రంథంగా నిర్ణయించవలసివస్తుంది. హాస్యప్రియుడైనకవి ఏ రకపు రచనలోనైనా హాస్యాన్ని ముమ్మరంగా అందించగలుగుతాడు. అతని సునిశితమైన దృష్టి అంతటా వికృతిని వెదకి, గ్రహించి, మనకు చూపగలుతుంది. వికృతిలేనిచోట కూడా వికృతిని ఆరోపించి, లేక ఆభాసింపజేసి వికటప్రజ్ఞా ధురీణుడైనకవి హాస్యాన్ని అత్యంత సునాయాసంగా సృష్టించి అందిస్తాడు. ఇలాంటి కవుల రచనల విషయంలో ఒకొక్కప్పుడు మన నిర్ణయం పెడత్రోవబట్టినా పట్టవచ్చు. కాబట్టి హాస్యసృష్టికై మన కవులు తరుచుగా అవలంబించే మార్గాలేవో స్పష్టంగా తెలుసుకొని, ఆ లక్షణాలు గమనించి, అవి ఎక్కడ ఎక్కువగా కనిపిస్తే అక్కడ ఆరచనల్ని హాస్యరచనలుగా గ్రహించడం కొంత మేలు.

హాస్యసృష్టికై మన కవులు సాధారణంగా అనుసరించిన మార్గాలలో మొదటిది శబ్దసంబంధమైన వికృతిని కల్పించటం. మాటల్లో తారుమారు చేయడం, ఆడిన మాటనే త్రిప్పియింకో అర్థంలో వాడటం, ఒకదాని కొకటి వ్యాఖ్యానించడం, యమకం, శ్లేష, అనుప్రాస వగైరాలు విశేషంగా వాడడం, వ్యర్థవచోడాంబికం చూపడం, వాక్యాన్ని పొడిగించి కొసరుమాటలు వేయడం, విభాషనాశ్రయించడం, గ్రామ్యాన్ని ప్రయోగించడం, లోకోక్తులు, జాతీయాలు, నీచోపమలు, కాకువులు మొదలైనవి కూర్చటం, వేదశాస్త్రాల్లోని వాక్యాలని సామాన్యమైన చోట విపరీతార్థంలో సార్థకంగా భాసించేలాగున ఉదాహరించడం, వికృతంగా ఒకర్ని అనుకరించడం, రెండు మూడు భాషలు మిశ్రమంచేసి రచన సాగించడం మొదలైనవన్నీ యీ రకమైనవి. వీటిలో వికృతి కేవలం శబ్దసంబంధి అయినందుచేత వీటిని వేరొక భాషలోకి అనువదించడం చాలాకష్టం. బొత్తిగా శబ్దాధారం మీద నడిచే హాస్యం కావటంచేత యిది యితరుల్ని అంతగా బాధించే రకం కాదు. అందుకే యీ తరహా హాస్యం కొందరి మతంలో ఉత్తమ హాస్యంగా పరిగణించ బడుతూంది.

మన తెలుగులో హాస్యరచయితలందరూ యీ రకమైన హాస్యాన్ని విరివిగా అందించిన వారే. మచ్చుకి యీ క్రింది పద్యాలు కొన్ని చూడండి.

"ఉన్నది యున్నదంచనుచు నుండెడి వాఁడధముండు, తెల్విమై
నున్నది లేదటంచనుచునుండు నతండిల మధ్యముండు, లేకున్నది
యున్నదంచనుచునుండు నతండిలనుత్తముండయా నెన్నగ ముత్తె
అంగులు మహింగల యట్టి విమర్శకుల్ నృపా."
("శుక్లపక్షము"— అనంతపంతుల రామలింగస్వామిగారు)

పైపద్యంలో ఉన్న హాస్యం అనువాదానికి ఎన్నటికీ లొంగదు, రేఖాంకితమైన పదాలు అనువదిస్తే హాస్యాన్ని కోల్పోకమానవు. ఇలాగే ఈ క్రింది.

"తుమ్మెద నటించు నేపనితోపకుండ
జటిమి ఝుంకారములు సేయ దగునె భృంగి
నీలకంఠాఖ్య, పురివిచ్చి యేల కేక
లొనరవేసెదు సిగ్గుమాలిన శిఖండి." అనేపద్యంలో కూడ.
(మృత్యుంజయవిలాసం—గోకులపాటి కూర్మనాథకవి)

శబ్దాలంకారాల్ని హాస్యాన్ని గోల్పేలాగున ఉపయోగించడం అనేది చాలాచోట్ల కనిపిస్తుంది. అక్కడక్కడ యీ అలంకారాలు కవి కట్టి అభిప్రాయమున్నా మానినా హాస్యాన్ని కలిగించి తీరుతున్నాయి.

"చిన్నచిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు
నాగులేటి నీళ్లు నాపరాళ్లు
సజ్జ జొన్న కూళ్లు సర్పంబులును తేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు". —(శ్రీనాథుని చాటువు)

జాతీయమైన మాటలు, సామెతలు పదైరాలు స్వతః హాస్య పూరితాలై కూడ ఉండవచ్చు. లేనిచోటకూడ సందర్భాన్ని పురస్కరించుకొని హాస్యప్రదాలుగా మారుతాయి. ఇవి ఒక విధమైన కట్టు హాస్యాన్ని చేకూర్చేవిగా కూడా ఉంటాయి.

"నక్క పొదరిల్లు పంచాననంబు కరణి
వారకామిని యిలు సొచ్చె వైష్ణవుండు

ఎన్ని చదువులు చదివిననేమి నీచు
లకు గురుతత్వంబు వైష్ణవులకు సతంబు.



తప్పుగా జూడరేని నేనిప్పుడొక్క
మనవిజేసెద దేవర మనవి చిత్త
గింపవలె, దప్పయిన క్షమింపవలయు
దాసరులతప్పు దండంబుతో సరిగద.
వర్ణములలోన వృత్తిని బట్టిజూడ
మా కులంబెంత కేనియు గాకులంబు
తగిన యన్నంబులోనికి దగినకూర
దొరకదను సామెతకు మే మెగురుతుసుండి.
కాన దీనిని మీ దాసిగా నొనర్చి
సంతసము పెరుమాళ్లకు సంఘటింతు
భాగవత కైంకర్యంబు భగవదధిక
సమ్మతంబని కాదె వైష్ణవ మతంబు."

(శ్రవణానందము - తిరుపతి వేంకటకవులు)

వీటిలో సామెతలు జాతీయాలే కాక ఒక విశిష్ట సాంప్రదాయాను గుణమైన మాటలను ప్రసంగానుకూలంగా ప్రయోగించి హాస్యాన్ని జనింపజేయడం కూడా కనిపిస్తుంది, పై నుదహరించిన వేశ్యమాత మాటల్లో వైష్ణవ సాంప్రదాయాన్ననుకరించే కట్టుమాటలెన్నో యీ విధంగా వాడబడటం పాఠకులు గమనింపకపోరు.

"గొడ్డుటావు బిదుకగుండ గొంపోయిన
పండ్లురాలదన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబులేదయా
విశ్వదాభిరామ వినురవేమ"

ఈ పద్యంలో గొడ్డుటావుపాడి లోభిదాతృత్వము రెండూ శూన్యమే అని చెప్ప డానికి బదులు, గొడ్డుటావు, దాన్ని పిదుకబోవటం, కుండ గొంపోవటం, అది పండ్లూడ దన్నటం వగైరా మాటలన్నీ హాస్యము కోసమని కోరికోరి వాక్యాన్ని పొడిగించడానికి

వేసిన కొసరు మాటలే అని స్పష్టంగా తెలుస్తుంది. ఇదే విధంగా అనవసరమైన వాచాలత్వ, ఓ దొంతీ పరసా పెట్టి కూర్చిన మాటలుకూడా హాస్యాన్ని చేకూర్చేవే అనవచ్చు.

“ నీళ్లకు నేత్రత్తోళ్లకును నేతి కరళ్లకు దొడ్డయుత్తరేన్
క్రొళ్లకు డస్సుముళ్లకును వేడిపున్నోళ్లకు సన్నకట్టు వి
స్తళ్లకు రాచవేళ్ల కనికంబును మళ్లకు పప్పుకూర ప
చ్చళ్లకు రాగిడెళ్లలకు సంతతమందుదు రాంధ్రవైదికుల్. ”

(చాటువు.)

విభాష, మిశ్రభాష, గ్రామ్యభాష వంటివి వాడి హాస్యాన్ని కల్గించడం తెలుగు లోనేకాదు అన్ని భాషాసాహిత్యాల్లోను కనిపిస్తుంది.

“ ఆహా దొమ్మరిమంగి గర్భజననం దాసీగృహే వందనం
మాయామంగలి పోతిగాడి మరణం ఏటొడ్డు రామాయణం
పశ్చాత్ చాకలిపోలితోడి జగడం పాపౌఘ నిర్వాపణం
కాకచ్ఛేదన కల్మషాపహరణం ఏతన్మహా భారతం. ”

(భామాకలాపం)

“సంగీతకాడ పాడకిక సాలిచు నీవది పాడినందుకున్
యింగితమెంచి నేను మరి యున్నదుకున్ సరి పోయె వింటివా
అంగున నే తలూపినటి అప్పుకు తంబుర యీడమెట్టి పో
బంగుడు బాపనాడయని పల్కును మూర్ఖుడు చంద్రశేఖర.”

(చంద్రశేఖర శతకం).

ఈ పద్యాల్లో ఉన్న అనుకరణ కూడా హాస్యానికే. ఇలాంటి హాస్యానుకృతులు (Paradies) నేడు కూడా చాలా వ్రాయబడుతున్నాయి.

హాస్య సృష్టికై కవులనుసరించే రెండవ మార్గం అర్థ సంబంధమైన వికృతిని కల్పించడం. ఇది వాచ్యంగానూ, వ్యంగ్యంగానూ కూడ ఉండవచ్చు. కొంచెమైన దానిని గొప్పగా జెప్పడం గొప్పను కుదించి కొంచెపరచటం సామాన్యమైన దానిని అసామాన్యంగా వర్ణించడం, అసామాన్యమైన విషయాన్ని అలౌకింగా నిరసించటం మొదలైన వీర వక్ర ధోరణులు. నాటకీయ వ్యంగ్య, (Dramatic irony) విభేదాలన్నీ యిదేతహార్కి

చెందుతాయి. వ్యాజస్తుతి, వ్యాజనింద వక్రోక్తి, సరోక్తి, నిగూఢోక్తి నిబర్హణ, నీచో-పమ, అర్థశ్లేష, అపహ్నుతి, కాక్వాక్షిప్తం, కావ్యలింగం వంటి అలంకారాలన్నో యీ రకమైన వికృతిని కల్పించడానికి సహాయపడేవిగా ఉంటాయి. అపహాస్యం, ఉపహాస్యం, ఎత్తిపొడుపు, ఉపాలంభన వగైరాలన్నీ యీ రకమైన వికృతి ననుసరించే నడుస్తాయి. మన లాక్షణికుల 'నర్మవృత్తి' యీ విధమైన హాస్యాన్నే సృష్టిస్తుంది. గ్రామ్యాన్ని (బూతును) ధ్వనించే రచనలో కూడ యిదే హాస్యం కనిపిస్తుంది. అర్థాని కపార్థం కల్పించడం, అపార్థాన్ని సార్థకంగా భాసింపజేయటం యిందులో విశేషంగా కనిపిస్తాయి. ఈ క్రిందిపద్యంలో విన్నాయకునికి (భావకవికి) అంట గట్టిన వికృతులు చూడండి.

"ఆనుకళావిభూతి విబుధావళి పెట్టిన భిక్షునీకు, నీ
వేసము కృత్రిమం బదుకువేసిన బొంతను బోలు జీవితం
బీసున కిక్కవౌదువెఱవే సుమ నీ తలకాయ, యింక నీ
వేసరణిం దలంప మొగమెత్తుట కాను గజాననాఖ్యుఁడా!"

(శుక్లపక్షం — అ॥ రామలింగస్వామిగారు)

పొగడ వలసే ఘనకార్యాలన్నిటినీ యీసడించి, అపార్థాన్ని కల్పిస్తూ చేసిన వ్యాజనింద యీ క్రిందిది.

"పలగురు ద్వేషి నొజ్జలుగ నెన్నొని కాచి నిష్ఠుర మంత్రముల్ నేర్చినావు
పూర్వదేవతలు కాపురమున్న పురిలోన వంచించి యగ్గి పెట్టించినావు
తాపల తరమున ప్రద్వంచిన పయోధి బేరుగా కొంత పూడ్పించినావు
మోసపాటెఱుఁగక మోహించి వచ్చిన యెలనాగముక్కు,
గోయించినావు
భళిర, నీవంటి ధార్మికుఁ బ్రస్తుతింప,
గొదువ లింకేమి కైవల్య మెదురువచ్చు
చిత్రచిత్ర పరిభావ దాక్షిణ్యభావ
హతవిమత జీవ శ్రీ కాకుళాంధ్రదేవ." (ఆంధ్రనాయక శతకము)

ఇంతకంటె నిర్మోమాటంగా దుయ్యబట్టుకొని నిందించిన ధోరణి క్రిందిది.

"వెనువెంట, దిరిగి తేఁటకానితో, జెప్పినసముహూర్త్బగార్యంబు సానిదైన
మచ్చిక చేసితే వచ్చిన దొంగను, గూసిపోగొట్టును గుక్కయైన
నలవాటు చేసితే యాడుగు నంటిన ముల్లు రక్షసేయును పాదరక్షయైన

నీవాఁడననుకొన్న నెలనెల పనిజేసి మానిపోవును డబ్బుమంగలైన
నంతకన్నను దక్కువైనట్లు దోఁచె
ననుసరించిన వారిఁగాయంగలేక
యందలంబెక్కి తిరిగితే యతిశయంబె
ఖండనారాతి భీమ కోదండరామ." (కోదండరామశతకం)

మొదట గొప్పగా చెప్పి అందలం ఎక్కించే లాగునటించి, చివరికి దభీమని నేలకూలవేసి క్రుంగదీసే విరసాన్ని చూడండి

"అల్లుఁడు బహుమానస్తుఁడు
అల్లున కొక పనియు జెప్పనైనంగానీ
చెల్లును మూడు పనులకై
యిల్లలుకను పేడఁజేసి యెంగిలెత్తన్" (చాటువు)

గొప్పను కుదించినట్టుగానే, కొంచెమైన దానిని గొప్పగా జెప్పి నవ్వించడం కూడా ఓ పరిపాటి. వెనుక నల్లికిచ్చిన ఘనత ఉదాహరించాను. ఇట్లే నస్యం ఒకాయనకి 'సభాపూజ్య' మయితే మరొకాయనకు పొగచుట్ట 'మబ్బు పెట్టిన యంత బొబ్బలు పెట్టించు నుబ్బసాదులకు సూర్యోదయంబుగా' కనిపించింది. ఓకవి 'అతడంబకు మగండీతడమ్మకు మగండెన్న నాతని కంటె నితఁడె ఘనుఁడు' అని పరమేశ్వరునికంటె బసవడే ఘనుడని ఘంటా పథంగా చెప్పాడు. ఇంకో కవి తీరుపబడిగా "పొగత్రాగని వాడు దున్నపోతై పుట్టున్" అని స్తుత్యర్థాన్ని సాయించేడు. ఈ క్రింది వ్యాజస్తుతికి ఏకాక్షి ఆలంబనగా నిల్చిపొందిన ఘనత చూడండి.

"అన్నాతి, గూడ హరుఁడవె
యిన్నాతిని గూడ నప్పు డసురగురుఁడ వా
దన్నా తిరుమలరాయా
కన్నొక్కటి మిగిలెఁగాని కౌరవపతివే." (చాటువు).

ఈ క్రింది అన్యోక్తిలో ఉన్న చమత్కారం చూడ దగ్గది.

"ఉష్ట్రముల దైన వైవాహికోత్సవమున
గానమొనరించినవి వేడ్క గార్ధభములు
ఎంత చక్కందనమ్మొ మరెంత సుస్వ
రమ్మొనా మెచ్చుకొనెను బరస్పరమ్ము."

ఈ అత్తకోడండ్రి అన్యోన్య సంభాషణలో ఉన్న అంతరార్థం గ్రహించ దగినది." వేణికా భారమందున వెదురుటాకు

కలికి కోడల యెబ్బంగి గలిగె జెపుమ
పలికి పలికించు కొనుటేమి పాడిభవంబొ
అత్త నీవీపు నెలిమిడి యంటెనేమొ"

సంభాషణలో నాటకీయ వ్యంగ్యాన్ని విరివిగా వాడిన కవితిక్కన. ఈ క్రిందివి కీచకునితో భీముడు సైరంధ్రిగా నటిస్తూ ఆడిన మాటలు.

"ఇట్టి వాడవు గావున నీవు నిన్ను
బొగడుకొన దగు, నకటనా పోల్కి యాడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకు
బడయ వచ్చునె యెఱుగక పలికితిట్లు."
నాయొడలు నేర్చి నప్పుడె
నీ యొడలెట్లగునొ దాని నీ తెత్రిగెదు న
న్నేయబలలతోడిదిగా
జేయదలంచితివి తప్పునేసితి గంటే
ననుముట్టి నీవు వెండియు
వనితల సంగతికి, బోవువాడవె యైనం
దనువేబడసిన ఫలమే
కనియెద విదెచిత్త భవ వికారములెల్లన్. "

(తిక్కన-విరాటపర్వం)

ఈ క్రింది పల్కులలో ఉన్న వ్యంగ్యం జగత్ప్రసిద్ధము. ఇవి ద్రుపదునితో ద్రోణుడాడిన మాటలు. ద్రుపదపరాభవము ఘట్టము.

" వీరెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె, యిపుడు మ
హారాజ్య మదాంధకారమది వాసెనొకో. "

(నన్నయ-ఆదిపర్వం)

హాస్యధ్వనికి ఉదాహరణగా శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చూపిన పద్యం యీ క్రిందిది. ఇది వారు వ్రాసిన 'వేమన' పుస్తకంలోనిది.

" ఆలివంకవారు ఆప్త బంధువులైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాది పగవారు
విశ్వదాభిరామ వినురవేమ. "

జాతీయోపమాన వాక్యాలన్నీ ఓ చోట చేర్చిగాని, సామెతలవంటివి దొంతిగా పేర్చి వాచాలత చూపుతూగాని, నవ్వించడం కూడా మనకి పరిపాటిగా వస్తూన్న సాంప్రదాయమే.

" నంబికవిత్వంబు, తంబళజోస్యంబు వలనొప్ప కోమటి వైష్ణవంబు
వరసనేయుప్పరివాని సన్యాసంబు తరువాత శూద్ర సంతర్పణంబు
రజకుని గానంబు రండాప్రభుత్వంబు వెలయగా వెలమల వితరణంబు
సాతాని పండితశాస్త్రవాదము వేశ్యాతనయుడబ్బకు బెట్టు తద్దినంబు
నుభయభ్రష్టత్వములు సుమీ యుర్విలోన
రాజసభలందు నెన్నగా రాదుగదర
మహితపురవిహార మునిజన హృదయలోల
వేణుగోపాల భక్త సంత్రాణశీల. "

(వేణుగోపాల శతకం)

కొందరు కొందరు వాడిన హాస్యోక్తులు లోకంలో సామెతలై స్థిరంగా నిల్చిపోతాయి. ఈ క్రింది పద్యంలో అఖరి చరణము అరకము.

" అదితి కశ్యపులకు గుజ్జువడుచు బుట్టి
యడుగుకొనలేదె ధరను మూడడుగులీవు
ఇచ్చమెత్తుట యిది క్రొత్త విద్యగాదు
నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష. "

(గయోపాఖ్యానం–చిలకమర్తివారు)

ఈ పైని చెప్పిన రెండు విధాలైన వికృతి కల్పనల్లోనూ ముఖ్యంగా కనపడే విశేషము వాక్చమత్కృతి. అసలు కావ్యమనేదెద్దైనా శబ్దార్థాలని ఆశ్రయించే నడుస్తుంది.

"రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యనామభాక్" అని లాక్షణికులు. కవికి కావలసినది భావవ్యంజన. భావము వ్యక్తమవుటమనేది అనుభావాల సహాయ్యాన జరుగుతుంది. ఈ అనుభావాలు సాత్విక, ఆంగిక, వాచకాలని మూడురకాలు. ఉత్తమ కవుల రచనల్లో మనకెక్కువగా కనిపించేది యీ వాచకానుభావకల్పనమే. అంటే తక్కినవి కనపడవని కాదు వాచకానుభావాన్ని కల్పించటం సులభమైన పని కాదు. భావవ్యక్తీకరణలో తక్కిన అనుభావాలకంటె యిది ప్రౌఢమయినది. వాక్కుకి వారంపారం అంటూ లేవు. ఎంత లోతుగా ఉన్న భావాన్నైనా, ఎంత విశాలమైన భావాన్నైనా వాక్కు వ్యక్తం చేయగలుగుతుంది. క్రోధం శరీరక్రియల ద్వారా వ్యక్తం కావాలంటే ప్రాణాంతకమైన దెబ్బ కొట్టడం కంటె మించి చేసేది వేరె లేదు. దానినే మాటల్లో వ్యక్తపరచాలంటే 'పచ్చడి చేస్తా'మనో 'నూరుకో' తాగుతా', మనో 'పులుసులోకి ఎముక మిగులకుండా చిదుక కొడతా' మనో చెప్పగలము. దీనికి మేరలేదు. అందుకే ఉత్తమ కవులు దీనినెక్కువగా వాడి భావవ్యంజన చేస్తారు. ఈ వాక్కుకి వక్రత కల్పిస్తే చమత్కృతి సిద్ధిస్తుంది. చమత్కృతి ఉల్లాసం, ఉత్కంఠ ఉత్సాహం, ఆశ్చర్యం వంటి భావాలను ధ్వనిస్తుంది. ఈ భావాలన్ని హాసానికి సంచారులుగా రాదగినవే, కనుకనే వాక్చమత్కృతిని మనవారు హాస్యాంగంగా పరిగణించేరు. అయితే ఒక పరిమితమైన అర్థంలోనే యిలాపరిగణించేరని గ్రహించాలి. కేవలవాక్చమత్కృతి హాస్యంగాదు. అందుకు తగిన సన్నివేశం, సమయం వగైరాలుకూడ కలిసిరావాలి. శృంగారంలో చూపిన వాక్చమత్కృతి హాసాన్ని మేల్కొల్పేదిగా ఉంటుందికాని విప్రలంభంలో వాక్చమత్కృతి హాసాన్ని కలిగించదు.

హాస్య సృష్టికై కవులనుసరించే మూడవ మార్గము కథాగతిలో వక్రతచేకూర్చి, ఘటనావికృతిని (Absurdity in action) కల్పించడం ఘటనానుకూలమైన పాత్ర- పాత్రానుగుణ్యమైన ఘటన అనేవి యిందులో ఎక్కువగా తటస్థపడతాయి. ఒక్కొక్క పరిస్థితిలో పాత్ర తనకు తానే తెలియక మూర్ఖుడుగా మారి చరిస్తాడు. ఒకటవుతుందని భావించే చోట మరొకటిఅవటం. ఒకటి చేస్తానని బయలుదేరిన వాడింకొకటి చేయడం, చేయబూనినదీ కూడ ఒక్కొక్కప్పుడపసవ్యంగానే తయారవటం, నవ్వేచోట ఏడవటం, ఏడ్చేచోట నవ్వటం, అనవసరమైన భయం, అక్కరమాలిన ఆర్భాటం, అర్థంలేని ఆడంబరం అనూయతో ఏడవటం, చేతగాక ఏడవలేకనవ్వటం, ఏదో తెలుసుననుకోవటం, తెలివి తక్కువతనాన్నే తెలివితేటలని నమ్మి గుడ్డిగా మరీమరీ ముందుకు సాగడం, ఒకరాడుకొనే మాటలు చాటుగా విని ఏడవటం, ఎవరినిగురించో విన్నవన్నీ తనకే అన్వయించుకొనిదుఃఖపడటం, బడాయి కొట్టి మరుక్షణమే బట్టబయలు చేసుకోవటం

వంటి వెన్నో యీరకమైన వికృతిని తారసింపజేసేవిగా ఉంటాయి. హాస్యరచయిత దృష్టి ఎంతసేపూ వికృతినే వెదుకుతూ ఉంటుంది. ప్రతిభావంతుడైన కవికి వికృత పూర్ణమైన ఘటనలు సృష్టించడం ఎడంచేతి పనిగా ఉంటుంది. వికృతిని సహేతుకంగా తటస్థింప జేస్తూ, హేతువులో కూడ వంకర చూపించి, పొరపాటు మరోపొరపాటుకి దారితీయించేలా కల్పించడం అత్యంతమూ ఉన్నతమైన హాస్య ప్రజ్ఞగా పరిగణించబడుతుంది. తిక్కన గారిలో ఈ ప్రజ్ఞ చూడండి.

ఈ క్రిందిది ఉత్తరగోగ్రహణ ఘట్టము. కౌరవసేన గోవుల నాక్రమించిన దన్న వార్త విని, అంతఃపురంలో ఆడవాళ్లముందు, వీరుడైన ఉత్తరుడు.

" ఎత్తిన గొందు గౌరవుల నెల్లను మార్కొని రేని గోవులం
దెత్తు ముహూర్త మాత్రమునఁ దేరికి సారథిలేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ నెందెదు " నని చెప్పి,

బృహన్నలను సారథిగా గొనుమన్న మాటకు 'పేడి సారథ్యమా' అని యీసడించి, గత్యంత రములేక తిరిగి అతనినే సారథిగా గ్రహించి యుద్ధానికి వెళ్తాడు. కాని కనుచూపు మేరలో ఉన్న కౌరవ సైన్యాన్ని చూచి, మొదట బయలుదేరినప్పటి బింకమంతా డిల్ల బోయే సరికి,

" అకృతాస్త్రుడ బాలుఁ డఁ గా
ర్ముక విద్యా ప్రౌఢిమై నిరూఢులయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ
వికర్ణ కర్ణాది యోధవీరుల కెదురే.
ఇట్టు గుఱెఱుఁ గక వచ్చితి
మెట్టొకో మన భంగి వీరలిందరును గడుం
బెట్టిదులు మనకు మార్కొను
నట్టి కొలదిగాదు భీతియడరెడు తోడ్తోన్ "

అని బృహన్నలతో అంటాడు. కాని బృహన్నల ఆ మాటలు సరకుసేయక రథాన్ని ముందుకు తోలుతూ ఉంటే ఉత్తరుడు మరీ కంగారుపడి రథాన్ని వెనక్కి మళ్లించమంటాడు. 'అంతఃపురంలో ఆడవాళ్ల దగ్గర బింకాలు పలికి యిలా బెదిరి పసువుల్ని విడిచి వెనక్కి వెళ్లినట్టయితే నలుగురూ నవ్వుతా'రన్న బృహన్నలమాటకి ప్రత్యుత్తరంగా " పసులదయ్యా

మెఱుఁగుఁ బడఁతుల సంతోషమేల నాకు ననికిఁ జాలనేను" అని తెగించి పల్కి అంతకీ వినకపోయేసరికి శస్త్రాస్త్రాలు రథంమీద విడిచి, నేలకురికి, సిగ్గువిడిచి వెనక్కి పరుగెత్తుతాడు. అది చూసి రథం నిలిపి, బృహన్నల అతనిని వెన్నాడి పట్టుకొని తిరిగి రథం దగ్గరకు తెచ్చినప్పుడు, ఉత్తరుడు,

"వెల వెల బాఱుచు వెగడొందుఁ బెదవుల తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లననంగంబులెల్ల నిండఁ జెమర్పఁ బటములుఁ గరములుఁ గుదియవడగ
హృదయంబు దటదట నదరంగఁ బెలుకుఱు దీనదృష్టులమోముఁ దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని ప్రార్థించు మాటఁ గీడ్పాటు
దోపఁ నిష్కశతశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాష్ట వైడూర్యములుఁ దురఁ గాఢ్యరథముఁ
గరటి దశకంబు నొకయూరు బురము సొచ్చి
నపుడ యిచ్చెద నీకను నార్తుఁడగుచు.
నాతోడి ప్రేముడిం గడునాతురరై యెదురుచూచు నంబకుఁ జేతః
ప్రీతిగఁజని యాయమఁ బొడనూతుంబోనీ గదే విశుద్ధ చరిత్రా."

అని దైన్యంగా బ్రతిమాలుకొంటాడు. కాని బృహన్నల అతనిని విడువడు. ఎలాగో ధైర్యంజెప్పి, కనీసం సారధ్యంచేస్తే చాలుననిన్నీ, యుద్ధం తాను చేస్తాననిన్నీ చెప్పి, ఎట్ట కేలకి ఒప్పించి రథాన్ని శమీవృక్షము దగ్గరకు తీసుకొని పోతాడు. చెట్టుసమీపించాక బృహన్నల ఉత్తరునితో "

ఇన్నగమందున గాండివ
మున్నది యదిగానిమద్భుజోద్రేక విలా
సోన్నతి శౌర్యవు పెద్దయు
నన్నువమీవిండ్లు గుఱుచలలతి బలంబుల్ అని చెప్పి
"ఇమ్మహీరుహంబెక్కి యమ్మహనీయ చాపంబు దెచ్చియిమ్ము ధర్మజ
భీమార్జున నకుల సహదేవులు దమతమ సమస్తాయుధంబులు, గూడం
గట్టి యిందుఁబెట్టినవారు కట్టు విడిచియందు గాండీవంబు పుచ్చుకొని
తక్కటవి యెప్పటి యట్ల బంధింపుమని శవాకారంబుననున్న శస్త్రాస్త్ర
సంచయంబు" చూపెట్టినాడు.

కాని యీ మాటల్లో ఉన్న సత్యం గ్రహించే పాటి తెలివితేటలు ఉత్తరునిలో లేవు. సరిగదా పాండవుల గురించిగాని, మాట్లాడుతూన్న బృహన్నల గురించి గాని ప్రశ్నిద్దామనే కుతూహలమైనా అతనిలో అప్పటికి కలుగలేదు. కాగా, అతనికంటెకింకా అర్జునుడు బృహన్నలగానే కనిపిస్తున్నాడు. కాని బృహన్నల తన కంటె బలాధికుడని మాత్రం స్వానుభవంచేత ఉత్తరుడు గ్రహించాడు. పారిపోవడం పొసగదని స్పష్టపడింది. చెప్పినట్లు చేయకపోతె ఏమో అనే భయముకూడా కలిగింది. గత్యంతరంలేక దైన్యంగా అతడు బృహన్నలతో,

"పీనుగునంటగ జనునే భూనాథతనూజు, డనక, పుయిలోడకన
న్నే నీచపు బని బనుపం గానీకుందగునె పాపకర్మముగాదే". అని

అంటే, దానికతడది శవము కాదనిన్ని, శస్త్రసంచయమనీ చెప్పి ఎట్లో ఒడబరచిచెట్టెక్కిస్తాడు. ఉత్తరుడు చెట్టెక్కి, పాములవలె ఉన్న శస్త్రాస్త్రాలు చూచి భయపడుతూ, తిరిగి బృహన్నల మాటలు విని పేరుకొంటూ "పొదువు ఎరియందట్టి కనుంగొని నిరూపించి సారథీ యని సవ్యసాచింబిలిచి యిట్లనియె" ఇంత అయిన వెనుక తిరిగి 'సారథీ' అని పిలవడంలో ఉన్న తెలివితక్కుతనము, తెలివితక్కువ తనానికి పరాకాష్ఠ అని వేరే చెప్పనక్కరలేదు. ఈ ఘట్టంలో మొదట ఉత్తరునిలో చూపిన బిగువుకీ తరువాత కలిగిన బెదురుకీ గల వైషమ్యంలో ఉన్న వికృతికి తోడు, భయాన్ని పురస్కరించుకొని ఏర్పడిన మాంద్యత కూడ వికృతిగానే చూపబడింది. ఇదంతా ఉత్తరుని స్వభావానికీ, అతడిరుకుకొనిన పరిస్థితికీగల వైషమ్యాన్నిబట్టి ఏర్పడిన వికృతుల దొంతి. ఇదే యిక్కడ హాస్యహేతువు.

హాస్యసృష్టికోసం కవులనుసరించే మార్గాలలో నాల్గవది ఆలంబన వర్ణనము. ఈ ఆలంబన ఒకానొక పాత్రగాని; లేదా ఘటనగాని అయి ఉండవచ్చు. అయితే దానిని అట్టుమట్టు ఆనవాళ్లతో వర్ణించి వికృతిని స్పష్టంగా చూపి నవ్వించుట యీ రకము. హాస్యము ఆలంబన ప్రధానమయిన రసమై ఉండుటచేత, ఆలంబనాన్ని ఎంత సూక్ష్మాతి సూక్ష్మ విషయాలు చూపి వర్ణిస్తే అంత ఎక్కువగా హాస్యం జనిస్తుంది. చిన్నపిల్లల చేష్టలు, అల్లరులు; అనాగరికుల వేషభాషలు, ఆశ్చర్యం; తాగుబోతుల తగువులు, తందనాలు; తాంత్రికుల తతంగాలు, భేషజాలు వగైరాలెన్నో విస్తృతంగా వర్ణించబడి హాస్యాన్ని కలిగించేవిగా మన సాహిత్యంలో వెదకి గ్రహించవచ్చు. ఇంతేకాదు లోభి, వ్యభిచారి, వృద్ధవేశ్య, శ్యాలకుడు, పురోహితుడు, జామాత, జ్యోతిష్కుడు వగైరాలెందరో పరంపరాగతంగా హాస్యానికి ఆలంబనాలుగా గ్రహింపబడి వర్ణింపబడుతూన్నట్టు

కూడ మన సాహిత్యాన్ని చూచి గ్రహించవచ్చు. ఈరకమైన హాస్యంలో వక్రోక్తులు, వ్యంగ్యోక్తులు తక్కువగా ఉంటాయి. ఉన్నచోటగూడ అవి చాతుర్యాన్ని ప్రదర్శించేవిగానే ఉంటాయి గాని ద్వేషాదిభావాల్ని ప్రకటించవు. ఈవర్ణనల్లో ఉన్న మరొక విశేషం, పాత్రానుగుణ్యమైన వాతావరణాన్ని (Setting) సృష్టించడం, పాత్రని తద్గత హావభావచేష్టాసమేతంగా వర్ణించి చిత్రించడం, ఘటనకి విస్తృతి కలిగించడమున్నూ, ఈ క్రిందిపద్యంలో చల్దులారగించు గొల్లపిల్లల ముచ్చట్లు చూడండి.

" మాటిమాటికి వ్రేలుమడిచి యూరించుచు నూరుగాయలు దినుచుండు నొక్క,
డొకనికంచములోని దొడిసి చయ్యనమ్రింగు చూడులేదని నోరు సూపునొక్క
డేగురార్గురి చల్దు లెలమిబన్నిదమాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్క
డిన్నియుండగ బంచియిచ్చుట నెచ్చెలితనమంచు, బంతెనలాడు నొకడు

కృష్ణు, జూడుమనుచు గికురించి పరుమ్రోల
మేలి భక్ష్యరాశి మెక్కునొకడు
నవ్వు నొకడు సఖుల నవ్వించు నొక్కడు
ముచ్చటాడు నొకడు మురియు నొకడు."

(పోతన - భాగ. దశమస్కంధం)

ఈక్రిందిది సంభావన బ్రాహ్మణుల సాములు వర్ణించే చాటుపద్యము.

" లేవరు లెండులెండనిన లేచిన వారయినన్ దటాలునన్
బోవరు పోవుమన్నిలిచి పోదుము పోదుము త్రోయకుండటం
చీవరుసన్ గృహస్థునలయింతురు పెండిలిలో సదస్య సం
భావననాడు చూడవలె బాపనసాముల సాములన్నియున్"

శ్రాద్ధయోగ్యంగా జరిగిన వివాహం యీక్రింది పద్యంలో వర్ణించబడింది.

" వచ్చిపోయెడువారు వక్కలాకులకేడ్వ గుగ్గిళ్ళకై పెండ్లిగుర్రమేడ్వ
పల్లకీబోయీలు భత్యాలకై యేడ్వ బలుపురోహితులు నేబులకు నేడ్వ

పెండ్లిపేరంటాడుని పెనుకానుకలకేడ్వ బాజాభజంత్రీలు పప్పుకేడ్వ
రాజబంధువులంత రంకుముండలకేడ్వ బాజారువెలదులు పసుపుకేడ్వ
హారతియాకల కాడుబిడ్డలు నేడ్వ గుర్రవాండ్రిందరు కూటికేడ్వ
అల్లుడనాథయంచ త్తమామయు నేడ్వ కట్నంబుకై గ్రామ కరణమేడ్వ
పెద్దమగండని పెండ్లి కూతురు నేడ్వ బిల్లచిన్నదటంచు బెనిమిటేడ్వ
చాల్పుగా నిన్నియేడ్పుల సాగపెండ్లి
సరస తాళూకిలోపల విరసముగను
సర్ర పేరయ్యచేసె నీనాటి కహహా
కమ్మకులమున జన్మించి ఘనులునవ్వ." (చాటువు.)

వేర్వేరు ప్రాంతాలలో ఉండే జనుల ఆచారవిచారాలను వర్ణిస్తూ వ్రాసిన చాటువులు సంస్కృతంలోనూ తెలుగులోనూ కూడా అసంఖ్యాకంగా దొరుకుతాయి. ఇలాగే వేర్వేరు జాతులవారినిగురించి, వేర్వేరు వృత్తులవారినిగురించి కూడ వర్ణనలు కనిపిస్తాయి బ్రాహ్మణ శాఖలన్నిటిమీద ప్రత్యేకమైన వర్ణనలు ఉన్నాయి. పట్నవాసులైన వారికిపల్లెటూరివారి మోటుతనం హాస్యప్రదంగా తోచును. అల్లే పల్లెటూరివారికి పట్నవాసపు నాజూకుతనం గాని నీటుగోటులుగాని వేళాకోళంగానే కనిపించును మనమెరుగని కట్టు, బొట్టు, ఆచారం, అలవాటు వగైరాలన్నీ మనకి మొదట వింతగాను చివరకు వినోదంగాను కనిపించి మళ్లామళ్లా తలచిగాని లేదా ఒకరితో చెప్పిగాని నవ్వేందుకు తగిన సామాగ్రిని చేకూరుస్తాయి. కావ్యాల్లోకూడ యీ రకమైన వర్ణనలు అక్కడక్కడ కనిపిస్తాయి. ఈ పరంపర సంస్కృత సాహిత్యములో నుండి సరాసరి తెలుగులోకి దిగింది. తెలుగులోనే కాదు యించుమించు అన్ని భాషల్లోను మనకిట్టి వర్ణనలు దొరుకుతాయి. 'ఎవని వెర్రి వాని కానంద'మన్న సామెత చొప్పున మనకి మనది కానిదల్లా వికృతంగాను, మనదంతా సవ్యంగాను కనిపిస్తుంది. ఈ తత్వమే యీ రకపు వర్ణనలకి హేతువు. అయితే యిందులో కేవలము వినోదమేగాని మరోదుర్గుణ మేమీ ఉండదు. ఈ రకమైన హాస్యంలో ఉండే హేళన ఈర్ష్యాద్వేషాల్తో బయలుదేరి వచ్చేదికాదు. నవ్వి, నవ్వించటమే పరమావధిగా ఉండిచేయబడే హేళన గనుక యిది శుద్ధ హాస్యమునే అనిపించుకొంటుంది. ఈ క్రిందివి శ్రీ నాథుని చాటువులు.

" ఉలిమిరి చెక్కయున్ మిగులనుక్కయిఁ జప్పని రొట్టెముక్కయున్
మలినఁపు గుడ్డలున్ నులక మంచపుఁ గుక్కియుఁ జీకటింటిలోఁ

దలచిన రోతసమ్మనోకనాటి సుఖంబొక యేటి దుఃఖమా
పలిపెల వారకామినుల పంచలకున్ బదివేల దండముల్."

"మేఁత గరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను జెఱుపంగఁ బిల్లిపిల్ల
అంపమునఁ గోతిపిల్ల యీ అరవపిల్ల." – (శ్రీనాథుడు)

హాస్యసృష్టికోసం అనుసరించే మార్గాల్లో అయిదవది రసాభాసాదుల్ని కల్పించటం. వఱోచోట రసభంగాన్ని ఆమోదించలేము కాని హాస్యములో రసభంగం కూడా సరసంగానే ఉంటుంది. ఇతర రసాల్లో ఏర్పడిన రసభంగం కూడా హాస్యాన్ని జనింపజేయవచ్చు. అసభ్యశృంగారం హాస్యాన్ని కలిగించేదిగా పరిగణింపబడడానికి కారణం యిదే. ప్రహసనాదులలో తరుచు కన్పించే శృంగార రసాభాసకు కూడ యిదే కారణం. ఇదేకాక చేతగాని శౌర్యము, పనికిరాని పౌరుషము ఎగిరి బోర్లాపడటం వంటి వెన్నో అన్యత్రాధ్వనించి యీ రకమైన హాస్యాన్ని సృష్టించేవిగా ఉంటాయి. కొన్ని కొన్ని చోట్ల హాస్యం తటస్థరసంగా నిల్చి తొంగిచూస్తూ ఉంటుంది. అలాటిచోట్ల కవి తొణకకుండా బెణకకుండా హాస్యాన్ని ధ్వనిస్తాడు. భారత యుద్ధంలో దుర్యోధనుని పాత్రను తిక్కనగారెన్నో చోట్ల యిట్టి హాస్యానికి గురిచేసి విడిచేరు. దుర్యోధనుడు పైవారి శక్తిని తనకండగా గొని యుద్ధానికి దిగినవాడు. తనకుతనుగా శక్తిగలిగి పాండవుల నెదరించి గెలువగల నమ్మకముగూడ లేనివాడు. కాని దురాశ హెచ్చు. జయము పొందాలనే తమకం గూడ తక్కువకాదు. చేసిన దన్యాయమని తాననకపోయినా లోకమంతా అంటూందనే సంగతి కూడ అతడెరుగును. కాని వల్లమాలిన ఆశ, దురభిమానం, భీష్మద్రోణాదుల బాహుబలంమీద నమ్మకం వగైరాలతనినీ యుద్ధానికి ప్రేరేపించినవి. ఈ గుణాలేవీ భీష్మ ద్రోణులకి నచ్చిన గుణాలుకావు. సమయాసమయాల్లో వారతనిని ఎత్తిపొడిచి ఏడిపించి కొంతతాల్మి బొందుతూ ఉంటారు. ఆయాఘట్టములలో తిక్కన్నగారి వ్యంగ్యహాస్యమెంతైనా చూడదగినదిగా ఉంటుంది. దుర్యోధనుని చేతగానితనాన్ని, మందబుద్ధిని అడియాశని ఎన్ని విధాల చూపించి వెక్కిరించాలో అన్ని విధాలా ఆయన చూపించిగానివిడువడు. అయితే ఇది కేవలం పెదవులు బిగించి 'లోపల స్వయంపాకం'గా నవ్వుతూ చేసే హాస్యము. దుర్యోధనుడేకాదు, తిక్కనగారి సానుభూతికి పాత్రముగాని కౌరవ వీరులందరూ యిట్టి వ్యంగ్యహాస్యానికి గురి అయిన వారే. మచ్చుకి యీ క్రింది ఘట్టము చూడండి.

దలచిన రోతవచ్చునొకనాటి సుఖంబొక యేటి దుఃఖ మా
పలిపెల వారకామినుల పంచలకున్ బదివేల దండముల్. ”

“ మేంత గరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను జెఱుపంగఁ బిల్లిపిల్ల
అంపమునఁ గోతిపిల్ల యీ అరవపిల్ల. ”  – (శ్రీ నాథుడు)

హాస్యసృష్టికోసం అనుసరించే మార్గాల్లో అయిదవది రసాభాసాదుల్ని కల్పించటం. మరోచోట రసభంగాన్ని ఆమోదించలేము కాని హాస్యములో రసభంగం కూడా సరసంగానే ఉంటుంది. ఇతర రసాల్లో ఏర్పడిన రసభంగం కూడా హాస్యాన్ని జనింపజేయవచ్చు. అసభ్యశృంగారం హాస్యాన్ని కలిగించేదిగా పరిగణింపబడడానికి కారణం యిదే. ప్రహసనాదులలో తరుచు కన్పించే శృంగార రసాభాసకు కూడ యిదే కారణం. ఇదేకాక చేతగాని శౌర్యము, పనికిరాని పౌరుషము ఎగిరి బోర్లాపడటం వంటి వెన్నో అన్యత్రా ధ్వనించి యీ రకమైన హాస్యాన్ని సృష్టించేవిగా ఉంటాయి. కొన్ని కొన్ని చోట్ల హాస్యం తటస్థ రసంగా నిల్చి తొంగిచూస్తూ ఉంటుంది. అలాటిచోట్ల కవి తొణకకుండా బెణకకుండా హాస్యాన్ని ధ్వనిస్తాడు. భారత యుద్ధంలో దుర్యోధనుని పాత్రను తిక్కనగారెన్నో చోట్ల యిట్టి హాస్యానికి గురిచేసి విడిచేరు. దుర్యోధనుడు పైవారి శక్తిని తనకండగా గొని యుద్ధానికి దిగినవాడు. తనకుతనుగా శక్తిగలిగి పాండవుల నెదరించి గెలువగల నమ్మకముగూడ లేనివాడు. కాని దురాశ హెచ్చు. జయము పొందాలనే తమకం గూడ తక్కువకాదు. చేసిన దన్యాయమని తాననకపోయినా లోకమంతా అంటూందనే సంగతి కూడ అతడెరుగును. కాని వల్లమాలిన ఆశ, దురభిమానం, భీష్మద్రోణాదుల బాహుబలంమీద నమ్మకం వగైరాలతనినీ యుద్ధానికి ప్రేరేపించినవి. ఈ గుణాలేవీ భీష్మ ద్రోణులకి నచ్చిన గుణాలుకావు. సమయాసమయాల్లో వారతనిని ఎత్తిపొడిచి ఏడిపించి కొంతతాల్మి బొందుతూ ఉంటారు. ఆయాఘట్టములలో తిక్కన్నగారి . వ్యంగ్యహాస్యమెంతైనా చూడదగినదిగా ఉంటుంది. దుర్యోధనుని చేతగానితనాన్ని, మందబుద్ధిని అడియాశని ఎన్ని విధాల చూపించి వెక్కిరించాలో అన్నివిధాలా ఆయన చూపించిగానివిడువడు. అయితే ఇది కేవలం పెదవులు బిగించి ‘లోపల స్వయంపాకం’గా నవ్వుతూ చేసే హాస్యము. దుర్యోధనుడేకాదు, తిక్కనగారి సానుభూతికి పాత్రముగాని కౌరవ వీరులందరూ యిట్టి వ్యంగ్యహాస్యానికి గురి అయినవారే. మచ్చుకి యీ క్రింది ఘట్టము చూడండి,

పద్మవ్యూహము భేదించిన అభిమన్యుని పదుగురు వీరులు చుట్టు ముట్టి, అన్యాయ మనక కనికరముమాని సంహరించుటకు మొత్తపడ్డారు. బయటనుండి సాయమురాకుండ వ్యూహద్వారమున సైంధవుడడ్డు నిల్చి పాండవ బలాన్ని నిలవరించాడు. చివరికి అభిమన్యుడు దిక్కులేని చావుచచ్చెను. సాయంత్రమీవృత్తాంతమంతా విని పుత్రమరణ శోకం కోపంగా మారి, మరునాటి సూర్యాస్తమయాత్పూర్వము సైంధవుని సంహరించటానికి అర్జునుడు ప్రతిజ్ఞ బూనినాడు. చారులవలన యీవార్త సైంధవుని చెవికి సోకినది, అతనికి ఒడలెల్లా తేళ్లు, జెర్రులు పాకినట్టయినది. ఆపాద శిరః పర్యంతమూ ముచ్చెమటలు పోసినవి. పారిపోయి ఎక్కడైనా దాగినట్టయితే బ్రతుక గలనేమో అనే ఆశ, అదికూడా అసంభవమే అనే నిరాశ, ద్రోణాదులడ్డుపడి రక్షింపలేకపోతారా అనే అడియాశ. వారందుకు సమర్థులు కాగలరా అనే సంశయము. అన్నీ అతనికి ఒక్కసారే కలిగాయి. ప్రాణాలు బేజారై అతడు పరుగెత్తివచ్చి దుర్యోధనాదులతో అడిన మాటలివి.

"ఏనొకరుండనే తనకు నెగ్గొనరించితి నేల నాపయిం
బూనినవాఁడు ఫల్గునుఁడు పోరవధింపఁగనట్టి పాడి మీ
కే నెటి సంతసంబు వగ చేటికి నాకటయేని పోయెదన్
వాని పతిజ్ఞ కడ్డు పడువారె సురాసుర సిద్ధ సాధ్యులున్

అనుచుం గొలువు గలయం గనుంగొని.

ద్రోణ కర్ణ శల్య దుర్యోధనులుఁ గృప
బాహ్లికులను జముఁడు వట్టికొన్న
వానినైనఁ గావ వలతురు వలచిన
నొల్లకున్న నెట్టులొకొ యెఱుంగ.

అని వెండియు.

పెదవులు దడుపుచుఁ గాళ్లున్
గుదివడి వడఁకుచు మనంబు గొందల పడఁగా
నిది యేటి మాటలాడెదఁ
దుదిఁబార్థుఁడు గానకుండఁ దొలఁగనవలయున్.

మీ యందఱచేతననుజ్ఞాతుండనకదా పోయి వచ్చెద..."

(తిక్కన-ద్రోణపద్యము)

సైంధవునిపట్ల కవికిగాని, పాఠకులకుగాని సానుభూతిలేదు. అతనిలోని పగలు యుద్ధములో చూపిన బింకమునకు రాత్రి పడుచున్న యీ దైన్యమునకు గలవ్యత్యాసము హాస్యప్రదమైనది. అభిమన్యుని వధ చూసి బరువెక్కి ఉన్న పాఠకుల హృదయము కౌరవ బలంలో కలిగిన విజయోత్సాహాన్ని ఆమోదించలేదు సరిగదా యిప్పుడు ఆ ఉత్సాహంలో ఏర్పడ్డ విఘాతాన్ని చూసి కొంత శాంతి పొందుతుంది. గంభీర భావాలు తేలి గుండె బరువుదిగి 'ఇతనికింతే కావాలనిపించి 'ఇక చూడు వోయి శౌర్యం' అనే ఉత్సాహపూరిత మైన జిజ్ఞాస రేకెత్తి, పాఠకులలో స్మితహాసము వ్యక్తమవుతుంది. ఇంత అయిన పిదప కూడా సైంధవుడు ద్రోణునితో "తనకు నర్జునునకు ధనుర్విద్యా విభవంబు నందలి వాసి యెట్టిదని యడిగిన" చందము చూసిన, అతని అడియాస గుర్తించినా పాఠకులు నవ్వాపుకో లేరు.

ఈ విధమైన హాస్యకల్పన భావవిశ్రాంతి (Relief) కి మిక్కిలి తోడ్పడుతుంది. సంక్లిష్టత్వాన్నో, విశ్లిష్టత్వాన్నో అనుభవిస్తూన్న చిత్తానికి వికాసం కలిగించి కొంత విశ్రాంతి నివ్వటం దీని ఉద్దేశము. కీచక వధ జరిగినదని సంతసించిన మరుక్షణమే ఉపకీచకుల చేత ద్రౌపదికి కలిగిన భంగపాటు చూసి పాఠకులు ఊపిరాడని అవస్థలోపడి, తిరిగి భీముని చేత ఉపకీచకులందరు హతమార్చబడి ద్రౌపది బంధములు, బన్నములు బాసి పోవుచుండుట చూసి కొంత తాలిమిపొందుతారు. పాఠకులలో కలిగిన యీ ప్రసన్నతను హాసోన్ముఖంగా చేయటానికని, ప్రసంగము దిగిచి తిక్కన వర్ణించిన యీ ద్రౌపదీగమన వర్ణనం చూడండి. శ్మశానమునుండి మరలి వస్తూఉన్న ద్రౌపదినిచూసి వీథిలోని పౌరులు పడిన అనవసరమైన కలవరం యిందులో వర్ణింపబడింది.

"మనకీచకుల కెల్ల మారియై పుట్టిన సుదతి వోయెడునని చూచువారు
నద్దిరా నీకు, గ్రొవ్వఱుఁగదే, జూతుగాకని తల నూపక యడఁగువారు
నలవోకఁ గనుఁగొని యంతరంగము ఓట్టు బెదర మాఱుమొగంబుఁ బెట్టువారు
నెదురుగా వచ్చిన నెంతయేనియుఁ దవ్వుఁగలుగ వేఱొక త్రోవఁ బోలఁగువారు

ముట్టఁబడి మేనఁగంపంబు పుట్టనొదిఁగి
యుండువారు, గరంబును నుదర మప్ప
ళించి యమ్మరో రక్కస యంచు నుల్ల
ములుకు వారునై పుర జనంబులు పలంకి.

"పులిఁగనుఁ గొన్న లేడులును బోలె విభీతిఁ గలంగఁ బౌజ్ఞ న
న్నెలతుక యంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై
వెలివిరియంగ నీక చని............ "(తిక్కన—విరాట పర్వం)

ఇలాఎన్నైనా చూపవచ్చును. ఈ హాస్యము కొన్ని చోట్ల గంభీరముగా కూడ ఉంటుంది. పాఠకులు సహా 'అంతరంగమున నిండిన హాస్య రసంబు మోముపై వెలివిరియంగనీక' మెలగుతూ ఉంటారు.

హాస్య సృష్టికై అనుసరించబడే మార్గాలివే అనికాని యింతే ఉంటాయనిగాని చెప్పడానికి వీల్లేదు. ఇవి ఎన్నైనా ఉండొచ్చు. వీటిలో అవాంతర భేదాలు అసంఖ్యాంగా కనిపించవచ్చు. స్థూల దృష్టికి ఎక్కడైనా యీ మాత్రం హాస్య కల్పనలు కనిపించినట్లయితే అక్కడ ఆ కవిని హాస్యకవిగా గాని, అట్టి కృతిని హాస్యకృతిగా గాని గ్రహించడానికి అనువు కలుగుతుంది. ఈ దృష్టితో చూసి, యీ రకమైనా కల్పనలు విరివిగా ఉన్న గ్రంధాలు తెలుగులో ఏవి అని ప్రశ్న వేసుకొంటే పట్టుమని లెక్కపెట్టడానికి పది పది హేను పుస్తకాలకంటె ఎక్కువ దొరకవు. కవులూ అంతే ఆధునిక రచయితలలో కూడా చక్కని హాస్యాన్ని అందించే వారు ఏ ఒక రిద్దరో తప్ప ఎక్కువగా కనపడరు. మన పూర్వులు గభీరులు. లేదా వేదాంతులు. వారికి జీవితం ఆపర్వోన్ముఖం. ఫలితం మనకి ఎక్కువగా హాస్య గ్రంధాలు లేకపోవడం. ఇందుకు మరో కారణం మన సంస్కృతి సానుభూతిమూలకము కావటము. దానికి హాస్యంతో పొత్తు కలియకపోవటమున్నూ మూడో కారణం. లక్షణ గ్రంథాల్లో కూడ లక్ష్యము లేకపోబట్టి, హాస్యము ఉపేక్షణీయమై, విస్తారంగా చర్చించబడక పోవటం. ఏది కారణమైనా ఆఖరికి అంగీకరించవలసే అసలు విషయం మనకి హాస్య గ్రంథాలు తక్కువ అని. అంతమాత్రాన్న మనకి హాస్యంలేదని బెంగపడనక్కర లేదు. హాస్యేతరమైన కృతులలో కావలసినంత హాస్యం దొరుకుతుంది. జానపదసాహిత్యంలో కూడ అపారంగా హాస్యం దొరుకుతుంది. అయితే అందులో హాస్యంచాలామట్టుకు అసభ్యమైనది. ఇలా బూతు హాస్యంగా చెలామణీ కావటంకూడ చాలమంది కవులను హాస్య విముఖులుగా చేసిందేమో!

---

# జానపద హాస్యం

ఒక జాతి ఆచారాలు, విచారాలు, అలవాట్లు, ఆశయాలు అన్నీ ఆ జాతి సాహిత్యంలో ప్రతిఫలిస్తాయి. జాతిలో జీర్ణించిన భావాలే సాహిత్యంలో స్థానం సంపాదించి సమయాసమయాల్లో తిరిగి జాతికి ఉజ్జీవనాన్ని కలిగిస్తూ ఉంటాయి. ఈ సాహిత్యమనేది ఏదేశంలో చూచినా రెండు రకాలుగా కనిపిస్తుంది. ఒకటి పండితామోదం పొంది, గ్రంథస్థమై, మార్పులకి చేర్పులకి అంతగా అవకాశం యివ్వక శిలాశాసనంలా నిలిచి తన జాతివారిచేతనే కాక యితరజాతుల వారిచేత కూడ అధ్యయనం చేయబడటానికి అనువుగా ఉంటుంది. రెండవది జన సామాన్యంలో ప్రచారంపొంది, ఒక తరం వారినుండి మరొక తరం వారికి కర్ణాకర్ణిగా అందజేయబడుతూ, తరుచుగా ముఖప్రచలితమై, వ్యాకరణాది బంధనాలకే మాత్రమూ లొంగక స్వతంత్రంగా నిల్చి, కాలక్రమాన్న మార్పులు చేర్పులు వగైరాలు పొందుతూ, స్త్రీబాల వయో వృద్ధులందరికీ ప్రియమై అజాతి జీవితంలోనే తానొక భాగంగా ఉంటుంది. మొదటిది పండిత సాహిత్యమైతే, రెండవది పామర సాహిత్యము. పండిత సాహిత్యం ఏ కొందరికో ఆనందాన్ని చేకూరుస్తుంది గాని పామర సాహిత్యం ఆ జాతి అంతటికీ ఆనందాన్ని చేకూర్చి జాతిని సజీవంగా నిలుపుతూ ఉంటుంది. పండిత సాహిత్యం ఎప్పుడైనా ఎక్కడైనా లోపించ వచ్చుగాని పామర సాహిత్యం అజాతి ఆ భాష నిలిచినంతకాలం నిలిచి ఉంటుంది. అంతేకాదు పండిత సాహిత్యానికీ పామరసాహిత్యం ప్రాతిపదిక వంటిది కూడ. ఈ రెండు రకాల సాహిత్యాలకీ మధ్య ఉన్న అంతరం ఎంత తక్కువగా ఉంటే అంత ఎక్కువగా ఆ జాతి అభ్యున్నతి పొందుతుంది.

తెలుగు సాహిత్యంలో ఉన్న హాస్యాన్ని సమగ్రంగా తెలుసుకోవాలంటే మనకు యీ పైన చెప్పిన రెండురకాల సాహిత్యాలను చూడవలసి ఉంటుంది. వాస్తవానికి పామరసాహిత్యంలో స్థానము సంపాదించని యే భావమూ పండిత సాహిత్యంలో వన్నెకెక్కదు. భావాన్ని వ్యక్తం చేసే ధోరణిలో మార్పు కనిపిస్తుంది కాని మూలంలో రెంటికీ ఏమీ తేడా ఉండదు. పండిత పామరులలో ఉన్నవచోవైఖరీ విభేదమే యీ తేడాకి కారణం. ఉదాహరణకి.

" వేణికా భారమందున వెదురుటాకు
కలికి కోడల యొబ్బంగిఁ గలిగెఁ జెప్పుమ

పలికి పలికించుకొనుటేమి పార్థివంబో
అత్త నీ వీపు వెలిచిడి యంటె నేమె. » అనే పద్యంలో

అత్తకోడండ్ర సంభాషణలో ఉన్న పరమసత్యం పామరసాహిత్యంలో ఏ రీతిగా ధ్వనింప బడిందో చూడండి.

« కోడలా కోడలా కొడుకు పెళ్లామా
కొడుకుపూరిలో లేదు కోక యెక్కడిదె ?
అత్తా అత్తా ఓ అత్తగారా
మా ఊళ్లో లేదు మట్టెలెక్కడివె !» ఇది చూచిన

పిదప యీ రెండు కృతుల్లోనూ ఏది మూలమో ఏది ప్రతికృతియో తెలుసుకోవటం కష్టం కాదుగదా! మన తెలుగులో యీ పామరసాహిత్యం ఎంతైనా ఉంది. అందులో హాస్యం అపారంగా ఉంది. కాని యీ సాహిత్యం మొదటినుంచీ ఉపేక్షతో చూడబడుతూంది. లిపిబద్ధంకాలేదు. అయినంత మేరకి ఆదరణలేదు. సేకరించే అభిమానిలేడు. నిజానికి యీ సాహిత్యాన్ని చదివినా, వినినా రసోద్రేకం కలుగని తెలుగువాడులేడు. కాని ఆ మాట బాహాటంగా అనడానికి ముందుకొచ్చేవాళ్లు తక్కువ. ఇంకో చిత్రం, ఇతర భాషల్లో ఉన్న యీ రకపు సాహిత్యాన్ని గొంతుచించుకో పొగడడానికి మనవారు వెనుదీయరు, సరిగదా. ఒకరిని చూచిన పిదప కూడా యీ విషయం నేర్చుకోరు. "ఇంటికి జ్యేష్ఠా పొరుగుకి శ్రీ మహాలక్ష్మి." అన్న వాక్యం అక్షరాలా మనపట్ల చరితార్థం అవుతూంది. హిందీ సాహిత్యంలో మహాకవి సూరుదాసు వ్రాసినవన్నీ పాటలే. అతడొక లక్షపాటలు వ్రాసేడనీ, యిప్పటికి పదివేలే దొరికాయనీ, యీ మాత్రమైనా మిగతవారి వ్రాతలు దొరకవనీ, యిప్పటికిదే అహోభాగ్యమనీ హిందీ సాహిత్యజ్ఞులు మెచ్చుకొంటూ ఉంటే, "ముదివిటులు విధవలంజలు పదకవితలు మారుబాస బాపనవర్యాల్" అని మనవారు పాటలన్నిటినీ కట్టగట్టి, కవీశ్వరులతోపాటు గంగలో కలపమని చెప్పే రకము. మనలోలేని ఘనత మనమాపాదించుకో కూడదుగాని, ఉన్నదాన్ని విస్మరించడం దేనికి ? ఈ తత్వం మనల్ని భావదాసులుగానూ, నిర్వీర్యులుగానూ చేసి విడుస్తుంది.

మన పామర సాహిత్యం మన జాతి హృదయానికి ప్రతిబింబం. అందులో ఉన్న హాస్యం మన జాతీయమైన హాస్యం. ఈ హాస్యంలో ఉన్న విశేషం, యిది సంప్రదాయగతంగా నిల్చి మన జీవితంలోనే స్థానము సంపాదించుకోవటం. ఇది నిత్యనైమిత్తిక

వ్యవహారములలో చేయూత యిచ్చి, జీవితాన్ని సరసంగా పిరాయించి, అందులో ఉన్న ఏకరసత (**Monotony**)ని దూరంజేసి, బ్రతుకుబాటని సుగమంచేసే రకమైన హాస్యము. ఈ హాస్యం యింటింటా ఉంది. వ్యవహారంలో ఉంది. వేడుకలో ఉంది. బావమరదుల వికటాలు, వదిన మరదళ్ల వేళాకోళాలు, ఇంట్లో సరాగాలు, నీలాటి రేవుల్లో పరాచకాలు. పండుగల్లోనూ, పబ్బాల్లోను, కావించే హడావిడులు, కల్పించే అపహాస్యాలు, కట్టే కమ్మలు ఊడుపుల రోజుల్లో ఉండే ఉల్లాసాలు, పెళ్లి పేరంటాలలో ఉండే ముచ్చటలు, వగైరా లెన్నిటిలోనో యీ హాస్యం సాంప్రదాయంలో చేరి నడుస్తూ ఉంటుంది. ఆ యీ సందర్భాల కనుగుణంగా పాడే పాటలెన్నో తెలుగులో ఉన్నాయి. ఊడుపుల పాటలు, దంపుళ్లపాటలు, చందమామ పాటలు, చెంచీత పాటలు, నందెన్న పాటలు మొదలైనవి సమయం, సందర్భం, సాంప్రదాయం, సామరస్యం వంటివాటిపై ఆధారపడి అనూచానంగా పాడబడి, వాడబడి, జీవితంలో నిత్యనూతనమైన చైతన్యాన్ని కలిగించే హాస్యాన్ని అందిస్తున్నాయి. అయితే యీ పాటలలో కొన్ని అసభ్య హాస్యాన్ని అందించేవిగా కూడ ఉంటాయి. ఆడామగా విచక్షణలేకుండా తిరునాళ్లలోనూ, జాతర్లలోనూ, సామూహిక కార్యాల్లోనూ పాడే పాటల్లో శృంగార హాస్యాలు విడదీయరానంతగా కలిసిపోయి హద్దుమీరిన అసభ్యతకి జాగా యిచ్చి సరసతకే విరసత చేకూర్చేటంతగా బండ హాస్యాన్ని దిగుమతీ చేయటం అనేది ఒక్క మన తెలుగులోనే కాదు యించు మించు అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది. అసభ్యత ఏ మాత్రమూ లేని హాస్యం ఆడవాళ్ల పాటల్లో దొరుకుతుంది. తెలుగులో ఆడవాళ్ల పాటలు అసంఖ్యాకంగా ఉన్నాయి. నలుగులపాటలు, నాగవల్లి పాటలు, అల్లుడు మీద పాటలు, అత్తగారి మీద పాటలు, అలక పాన్పుదగ్గర పాటలు, తలుపు దగ్గర పాటలు, తగవుల పాటలు, వియ్యపురాలి మీద పాటలు, విందుల పాటలు, వంటివెన్నో హాస్యపు పాటలు ఆడవాళ్లు పాడుతూ ఉంటారు. వీటిలో హాస్యం అతి మృదువుగా ఉండటమే కాదు అత్యంత విశుద్ధమై పండిత హాస్యానికికూడా తెన్నులు దిద్దడానికి తగినదిగా ఉంటుంది. పెద్దవాళ్ల పాటల్లోనే కాదు చిన్నపిల్లలు పాడే పాటల్లోకూడ హాస్యం స్థానం సంపాదించుకొంది. చిన్న పిల్లల పాటల్లో ఉన్న హాస్యం ఎంత ముద్దు ముద్దుగా మృదువుగా ఉండాలో అంత ముద్దుగానూ మృదువుగానూ ఉంటుంది. ఈ హాస్యం తరుచు శబ్దాధారం మీద నడిచేదిగా ఉంటుంది. ఉదాహరణకి యీ క్రింది పాట చూడండి.

" అక్కలక్కర మాక్కలపేట కూర్చో వదినా కూర్చో
వేపచెక్క వెల్లుల్లిగడ్డ పోకతమ్మి వేసుకో
కాకి బొడ్డు గచ్చకాయ మెక్కవిందు తీర్చుకో

అల్లితుట్ట మ్రరికొట్టి, పైటవేసి కట్టుకో
ఉల్లిపూలు నువ్వుచేరు కొప్పునిండా పెట్టుకో
అత్తమాట కొత్తకుండ నవితిపోయ దిద్దుకో
ఆలగోలు బాలగోలు రవ్వ పదినా మాన్పుకో."

ఆఖరి రెండు చరణాల్లోనూ ఉన్న మమత్వపూర్ణమైన పరమోప దేశానికీ మీది చరణాల్లో ఉన్న పరాచకానికీ ఉన్న తేడా చూడండి. పరిహాస వాక్యాలు కేవలం మాటలగుత్తులు, నిరర్థకాలున్నూ, ఉపదేశ వాక్యాలు సత్యస్ఫూర్తి, సారగర్భత, కలిగి మహాకవుల వాక్యాలకి సాటిగా ఉన్నాయి. కాని రెండు తత్వాలకీ శైలి ఒకటే. హాస్యధ్వని ఆశైలోలినే. హాస్యాలంబనమైన వదిన ప్రేమకే పాత్రమైనది గాని ద్వేషానికి కాదు. పసిపిల్లల హృదయమెంత విశుద్ధమో యీ హాస్యము కూడా అంత విశుద్ధంగా ఉంది. ఈ రకమైన హాస్యాన్ని అందించే పాటలెన్నో పిల్లలు పాడుతూ ఉంటారు.

రచ్చపట్టులోనో రంగస్థలం మీదనో పాడబడి రాగతాళ లయాశ్రయమై నడిచే పాటలు పామర సాహిత్యములో ఎన్నో ఉన్నాయి. జంగం కథలు, జక్కుల పాటలు, దాసరి పదాలు, హరిహరి నారాయణ కీర్తనలు, తందాన దరువులు పగైరా లేనాటి నుండో తెలుగు నేలలో వినిపిస్తున్నాయి. వీటిలో పురాణ కథలు, స్థానిక చరిత్రలు, కల్పిత కథలు అన్నీ కనిపిస్తాయి. ఇవి బహుళంగా వీరశాంత రసాల్లోనో, కరుణ శృంగారాల్లోనో ఒప్పుతూ ఉంటాయి. వీటిలో హాస్యం లేక పోలేదు కాని చాలా తక్కువ. అక్కడక్కడ ప్రసంగానుకూలంగా తగుమాత్రం హాస్యం వాడబడింది. ఇటు యీ రకం పాటలకీ, అటు ప్రబంధాలకీ మధ్య రకంగా ఉన్న సాహిత్యం యక్షగాన సాహిత్యం. వీటిలోకొన్ని ప్రౌఢమైన రచనలు. ఇవి కీర్తించబడేటప్పుడు ఏపద్యము, ఏదరువు. ఎవరు చెప్పాలి, ఎవరు పాడాలి, అనే నియమాలు కూడ పాటింపబడుతూ ఉంటాయి. వీటిలో గేయాలు ఛందస్సుకీ కీర్తనలకీ మధ్యరకంగా ఉంటూన్నవి కూడ కొన్ని దొరుకుతాయి. కొన్నిచోట్ల పద్యంలో ఆఖరి చరణాన్ని తిరిగి ఎత్తుకొని, లయాను గుణంగా దరువువేసి పాడటం కనిపిస్తుంది. సువ్వి, ఏల, తుమ్మెద పంటి ఊతపదాలతో పాడే పాటలుకూడా అందుకు తగిన అనువులతో సహా, కొన్నిచోట్ల వినిపిస్తాయి. వీటిలో కథా వస్తువు చాలవరకు పౌరాణికము. భక్తిరసం ప్రధానంగా చాల వాటిలో కనిపిస్తుంది. ఒకవిధంగా నేటి కాలపు హరికథలకివి మాతృకలో లేక పూర్వరూపాలో అయినట్లు కనిపిస్తాయి. వీటిలో హాస్యం అంతగా లేదు. నేటి హరికథల్లోనూ యింతే. కాని

వీటిని గానం చేసేనటుడు మధ్యమధ్య తనకున్న సహజ ప్రజ్ఞని, వాక్చమత్కృతిని ప్రదర్శించి, కొంతహాస్యం కలిగించడం కద్దు. అయితే, యివి కేవలం కట్టు హాస్యమో, వివికటి హాస్యమో అయిఉండటం సహజం. పిట్ట కథలు చెప్పి నవ్వించడమనే సంప్రదాయం చాలామంది హరిదాసుల్లో కనిపిస్తుంది.

రంగస్థలాన్ని ఆశ్రయించిన యీ రకపు రచనల్లో హాస్యానికి ఒక ప్రత్యేకమైన స్థానం ప్రాధాన్యం యిచ్చి పోషించిన రచన భామాకలాపం. కలాపాన్ని చూస్తే యిది అతిపటిష్ఠమైన రచన అని ఒప్పుకోక తప్పదు. కాని ఆ నోటినుండి యీ నోటికి దిగుమతి అవుతూ, సాహిత్య జ్ఞానం లేదు సరిగదా చదువుకూడారాని నటులచే కీర్తింపబడుతూ పాటక జనంలోనే బహుళ ప్రచారం పొంది ఆదరింపబడుతూ ఉన్న కారణాన్ని యీ రచన చాలా వరకు అనూహ్యమైన క్షతికి పాలై అధ్వాన్నమైనది. ఇందులో విదూషకుడు, సంప్రదాయానికైతే సంస్కృత నాటకాల్లో ఉన్న విదూషకుడే కాని, స్వతంత్రత హెచ్చుగా పుచ్చుకొని సర్వే సర్వజ్ఞుడుగా భాసిస్తాడు. ఇతడు ఆడవాళ్లలో ఆడుది; మగవాళ్లలో మగవాడుగా కల్పింపబడ్డాడు. సత్యభామచేత 'ఔనే మాధవీ' అని శ్రీకృష్ణుని చేత 'ఓసీ మాధవా' అని పిలువబడుతూ ఉంటాడు. ఇతని హాస్యం ఆంగిక వాచిక ఆహార్యాది సర్వాంగాలతోనూ దర్శనం యిస్తుంది. అశ్లీలత కూడా అత్యధికంగా ధ్వనిస్తుంది. భమిడిపాటి కామేశ్వర రావు గారి వాక్యాల్లో "ఈ హాస్యనటుడికి అనర్గళ వాగ్ధారా, అనేక విషయాలను గురించిన సంచి కట్టు వాక్యాలూ సభాభిరుచినిబట్టి కొంచెం పచ్చిగా ఉండి బండ జనాన్నికూడా పకాలుమని నవ్వించగల మోటు ముచ్చటలూ, అవగుణాన్ని హేళన చెయ్యగల నేర్పూ, సంఘంలో ఉండే సాంసారిక వ్యత్యాసాల వయనమూ పక్క పాత్ర చెప్పేదాన్ని ఊకొట్టి, బలపరచి, వ్యాఖ్యానించి ఉదహరించి ఆచరించి 'నాకు తెలియదు మొర్రో' అనే మొరక మనిషి నెత్తికైనా చెప్పబడే సంగతి రుద్దిపట్టించగల ఓపికా మొదలైన లక్షణాలు నేటికీ కనిపిస్తాయి." ఈ హాస్యగాని పాత్రకి ఓకాలు కథలోనూ వేరొకాలు బయటనూ ఉన్నట్లు రూపిస్తుంది. కలాపానికి సంబంధించినంతవరకూ యితడు శ్రీ వేషం వద్ద యింటి పెద్దగానూ కన్యాదాతగానూ, సత్యభామ వద్ద ఆంతరంగిక సఖి గానూ, శ్రీకృష్ణుని వద్దకు రాయబారిగా వెళ్లదగిన ప్రాజ్ఞుడుగానూ, సవతుల కయ్యాల్లో తగువు తీర్చే మధ్యవర్తిగానూ రంగులు పిరాయించి, సమయజ్ఞత ప్రాజ్ఞత వ్యవహారదక్షత, ప్రత్యుత్పన్నమతిత్వము పరేంగితగ్రహణ శక్తి అన్నీ చూపుతూ అతడు లేనిదే కథే లేదనిపిస్తాడు. నాందీ ప్రస్తావనలతో ప్రారంభించి, మంగళాంతంవరకు రంగస్థలాన్ని అలంకరించి నిలచి సూత్రధారుడూకూడ తానే అన్నట్లు రూపిస్తాడు. ఆ యీసందర్భాల్లో అతడాడవలసే

మాటలూ, పాడవలసే పాటలూ అన్నీ కలాపానికి సంబంధించినవి. వీటిలో అసభ్యత ఏమాత్రమూలేని హాస్యం కనిపిస్తుంది. కాని అసభ్యత, అశ్లీలత కాకపోయినా అక్కడక్కడ సురుచికి విరుద్ధంగా మాత్రం వినిపిస్తుంది. శ్రీకృష్ణుని గంగిరెద్దు క్రింద జమకట్టి, లేదా అంతకంటె కనిష్టంగాచూచి, స్వాగత వాక్యాలు పలుకుతూ చేసే హాస్యం యిట్టిది. ఇలాటివి ఒకటి రెండు ఘట్టాలు మినహాయిస్తే మిగతచోట్ల, కలాపానికి సంబంధించినంతవరకు యీ హాస్యం సరసంగానూ సభ్యతాపూర్ణంగానూ ఉండి సందర్భశుద్ధి కలిగి ఉండేది. అయితే కాలాంతరాన్ని కలాపం పాత్రాంతరాల పాలబడి భ్రష్టమై హాస్యంలో ఉన్న సందర్భశుద్ధిని చాలవరకు ధ్వంసం చేసి సురుచిని మంటగలిపింది. మచ్చుకి యీ క్రింది కలాప వాక్యాలు కొన్ని చూడండి, ఇవి అప్పగింతలపాట. రాధను (శ్రీ వేషం) శ్రీ కృష్ణుని కప్పగింత పెడుతూ హాస్యగాడు పాడవలసేది.

" అగ్నిసాక్షిగ దీని పెండ్లాడినావు । అవని భారంబు నీ భారమయ్యా
బొమ్మరిళ్లున్నాయి బొమ్మలున్నాయి । యిఘనెవ్వరున్నారు నా తల్లిరాధ
గుజ్జనగూళ్లకి బియ్యమడిగేవు । యిఘనెవ్వరడిగేరె నాచిట్టి తల్లీ
హితవుగా మగడు చనవిచ్చి పిలిచినవేళ । మురిపించగాబోకు ముదిత నా తల్లీ
చీకటికి చిత్రాంగి చెన్నెలకు సిరికి । గావయ్య యీ కన్నె గజకన్న కత్తె
ఇరుగుపొరుగుల్లార ఓయింతులారా । కంచాలు ముంతల్లు కనిపెట్టుకొండి
బాలచిన్నదిగాని సోలమింగింది । సోధించి చూడుడీ ఆచోద్యమంతా

❖ ❖ ❖ ❖ ❖ ❖

బావమరదులు నిన్ను ఎవ్వరేమన్నా । కదురెర్రగా కాల్చి కంట్లోను పెట్టూ
తోటికోడలుబిడ్డ కూటికేడుస్తే । పీటచెక్కాతోను పెణతూడగొట్టూ
ఇరుగుపొరుగులవారు నిన్నేమి యన్నా । యిల్లుతెగలజెట్టి మళ్లి రావమ్మా
బుద్ధెరుగదు బాలముద్దులేకాని । బుద్ధులొచ్చేదాకా దిద్దుకోవయ్యా. "

శ్రీ కృష్ణునే గంగిరెద్దుగా చేసిన కవికి రాధను పై విధంగా వర్ణించడం ఏమంత కష్టంగాదు. ఆమె సౌందర్యాన్ని హాస్యగానిచే వర్ణింపజేసిన పట్టుచూడండి. "అప్పడూ, యీ చిన్నదాని సౌందర్యం ఎలా ఉన్నదో చూస్తినా, ఎలాగున ఉన్నదంటే కందిరీగల వంటికొప్పుకట్ల పీటవంటిముఖం, కవ్వంగుత్తివంటి నాసిక, నూగుబెండకాయవంటి కనుబొమలు, నూతన తింత్రిణీదళములవంటి నేత్రములు, రావిబ్బలవంటి చెక్కిళ్లు, రావన్న గువ్వలవంటి

పలువరుస, ఆరవేసిన నిప్పునంటి అధరోష్ఠం, చొప్పలవంటి చెవులు, సోనెపంటిపీప్పు బానవంటి కడుపూ.................. ..." ఈ విధమైన హాస్యపరిహాసపూనాలు (Laughable Comparisons) యీ కలాపంలో ఎన్నో ఉన్నాయి. అసలి కలాపంలో హాస్యసృష్టి కోసమని చూపిన రచనా చమత్కృతులనేకం కనిపిస్తాయి. ఈ క్రింది ప్రార్థన శ్లోకాలు చూడండి.

" గణానాంగణనాథశ్చ గణపాత్రస్తథైవచ
కాత్రాకాశీ కొంకినక్కా గార్ధభాయనమోనమః "
అక్కలమ్మ మహామారీ మాతంగీ పరమేశ్వరీ
ఎల్లెమ్మాయ నమస్తుభ్యం అంకిరమ్మాయ నమోనమః "
కామినీ చైవ గాంధారీ లంఖిణీ చైవ తాటకీ
భూతప్రేత నివాశించ బ్రాహ్మగంపాయ తేనమః"

కలాపాన్ని విడిచి, కథాగతికి సంబంధం లేకుండా, ముఖ్యపాత్రధారులైన నటులు విశ్రాంతి తీసుకొనే సమయాల్లో ప్రేక్షకులను రంజింపజేయడానికనే, యీ విదూషకుడు కలిగించే హాస్యం 'జాత్యాల' తరగతికి జెందినది. ఈ జాత్యాలు తెలుగునాట చిరకాలం నుండి ప్రచారంలో ఉన్నాయి. వీటిని చెప్పే హాస్యగాడు కేవలము వాచకమైన హాస్యాన్నే కలిగిస్తాడు. గొంతుమార్చి, వేర్వేరు పాత్రలాడే మాటలన్నీ తానే ఆడుతూ, ఆ చివరినుండి యీ చివరిదాకా అంతటా అశ్లీలత ధ్వనిస్తూ, కోమట్లు, గొల్లలు, దేవాంగులు జంగాలు, వైష్ణవులు, వైదికులు, వగైరా జాతులవారిని గూర్చి, వేర్వేరవారి కట్టూ బొట్టూ మాటామంతీ, తీరూ తిన్నదనమూ అన్నీ హేళనగా ఏ కరువు పెడుతూ శ్రోతలను నవ్వించడం యీ జాత్యాలు చెప్పేవారిలో ఒకకళ. ఇది ఎంతసేపూ మాటలతోటే ఉంటుంది గాని యిందులో పాటలూ పద్యాలూ ఆట అభినయం వంటివేమీ ఉండవు. కాని భామాకలాపంలో ఇవే జాత్యాలు పాటా పద్యం, ఆటా అభినయం. ఆహార్యం వంటి వాటితోసహా హాస్యగానిచే ప్రదర్శింపబడతాయి. అంగులన్నీ కుదిరి అవకాశం ఎక్కువగా లభించిన కారణంచేత యీ హాస్యానికి యిందులో క్షేత్రం (Range) కూడా విస్తరించింది. ఇతడు చెప్పేది వినడానికీ, విస్తరించి చెప్పమని అడగడానికీ, తాళగాళ్లలో ఒకడో యిద్దరో మేళంకట్టి, ప్రశ్న వేసి రాబట్టి, పక్కవాంగు చేస్తూ ఉంటారు. ఉడుపుల హాస్యం, దంపుల హాస్యం, నాయుడు హాస్యం, వితంతువుల హాస్యం మొదలైన వెన్నో యీ హాస్యంలో సమయా సమయాల్లో, స్థానం సంపాదిస్తాయి. ఇవన్నీ ఒక విధంగా ఏక

పాత్రాభినయాలు (Mono actions) గా కనిపిస్తాయి. వీటిలో అసభ్యతకి హద్దూ పద్దూ అంటూ ఉండదు. ఈ రకమైన హాస్యాని కనువైన పాటలన్నీ స్వతంత్ర రచనలూ, సంధి కట్టు వాక్యాలున్నూ, సమయోచితంగా వాడుకోనేందుకు పనికివస్తాయి. ఈ తరువాత నాటకాల్లో 'బఫూను' గా పనిచేసే హాస్యగాళ్లకివే ఆధారాలైనవి. నాటకంలో సీనుసీనుకి మధ్య విశ్రాంతి కాలంలో యిట్టి హాస్యంచెప్పి ప్రేక్షకుల కాలయాపనకి తోడ్పడటమే యీ 'బఫూను' హాస్యానికి ముఖ్యోద్దేశం. నాటకకథతో గాని, యితర పాత్రలతో గాని యీ హాస్యగాడికెవ్విధమైన సంబంధమూ ఉండదు. ఈ హాస్యంకూడా సీనుసీనుకీ మారిపోతూ ఉంటుంది. ఒకదానితో మరొకదానికి సంబంధం కూడా ఉండదు. స్కూళ్లలో పిల్లలు చేసే "ఫేన్సీ డ్రెస్సు" (Fancy dress) వేషాల ధోరణిలో యీ హాస్యం నడుస్తుంది. అయితే అందులోలేని అసభ్యత యిందులో గూడు కట్టుకొంటుంది. భామాకలాపంలో హాస్యగాడు యింతకంటె నయమనిపిస్తాడు కొన్ని విషయాల్లో. అంతేగాక కథతోటీ, కలాపంతోటీ, సంబంధం చాలావరకు నిర్వహిస్తూ, సంబంధం తెంపుకోవటంలోనూ తిరగ కలుపుకోవటంలోనూ కూడ నేర్పు చూపడం భామాకలాప హాస్యగానిలో గల విశేషము. అయితే ఉన్న అనాకారితనమల్లా అశ్లీలతలో ఉంది. కాని దాన్ని తొలగించటం అసాధ్యం. అదిలేనినాడు యీ హాస్యం జీవచ్ఛవం.

భామాకలాపంతోపాటు తెలుగు నాటకరంగస్థలాన్ని అలంకరించిన సాహిత్యం మరికొంత ఉంది. గొల్లభామ వేషం, జలక్రీడలు, సారంగధర, ప్రహ్లాద, ఎరుకల కీర్తన, చోడిగాని కలాపము మొదలైన వీ రకమైన కృతులు. వీటిలో కొన్ని విదూషక పాత్రకి స్వస్తి చెప్పి, ఆహాస్యాన్ని మిగత పాత్రలలో సర్ది, సరసతా, ఔచితీ అనేవి నిర్వహిస్తూ ఉంటాయి. కొన్నిటిలో హాస్యం అడుగంటి పోవటంగాని అతుకుల బొంతకి వేసిన మాసికల్లాగ అక్కడక్కడ అసందర్భంగా అవతరించి అశ్లీలంగా తాండవించటంగాని జరిగింది. కొన్నిటిలో కథానాయకుడు హాస్యానికే ఆలంబనగా కనిపిస్తాడు. చోడిగాని కలాపంలో చోడిగాడు హాస్యానికే నాయకుడు. కథలో ఉన్నది శృంగారము. అది చాలచోట్ల రసాభాస అయింది. సరసం చాలా విరసంగా కూడ ఉంటూంది. మచ్చుకి యీ క్రింది పద్యాల్లో చోడిగాడూ సింగీ గావించిన పరస్పరానునయాల్లో ఉన్న విరసత చూడండి.

"చోడిగాడు— మనసు లేకపోతె మును పెరుంగనె శింగి
అనువులంటె నోర ఆగలించి
కన్నె మంటె బిగ్గ కరచియుబట్టితే
కొరడ దెబ్బలనుచు ఎరుగవటవె.

శింగి—

కొరడా దెబ్బలనుచు మరిమరి బలికేవు
తరముగాదు నాదు పరికరాకు
మురువు పరువులేని ప్రయత్నమేల నీ
సరసమేల నాకు చాలు పోర.

చోడిగాడు—

మూల మెరుగనీవు చాలనిబల్కేవు
ఏల శింగి నీకు నోలి గట్టి
పాలివారు నన్ను గేలిపెట్టినగాని
బాల పాపమనుచు బలుకలేడ.
దండిగాను గుడిసె పెండేలన్నియుదీసి
వండి వండి కూడు వార్చలేదా ?
కొండ మీద శింగి దుండునోయని బల్కు
నట్టి శింగి నీకు గుట్టులేదె ?

శింగి—

గుట్టు గాక పోతె నట్టన నడవిలో
కొట్టి పచ్చి నట్టి గుణమునీది
పట్టె మాట లేల వద్దు నిన్నెల్లను
బుట్టు తోడు నమ్మ పొమ్మ శింగా.

చోడిగాడు—

శింగీ నను జూచితేనే
నంగజుడను రూపురేఖలందును మునునా
సంగతి నీ విటులైతె తిరు
గంగను న్యాయంబుగాదు గట్టిగ శింగీ.

శింగి—

చేపవలె నుండు మీసాలు చీపికళ్లు
చింకి తల గుడ్డ గొంగళ్లి చంక బెట్టి
కప్పు పొక్కిడి పాగసిద్ద వొప్పు జూచి
నయమె నిన్నంగజుడ నన్న నవ్వరటరా."

పదాల పొందిక, పద్యపు నడక, గణయతి ప్రాసల లక్షణం. అలంకారాల అందము చూస్తే ఈ రచన యెంత సొంపైనదో సహృదయులకి తెలియక పోదు. చదువురాని నటకుల నోళ్లలో బడినలిగి పోయిన కారణంచేత, వాక్యాలకి శిథిలత్వం, శబ్దాలకి

సాధుత్వం అర్థానిక నర్థం కలిగేయని వేరే చెప్పనక్కరలేదు. ఇట్టి రచనలను సంస్కరిద్దామనే అభిలాషగల సాహితీపరుడు గాని, సంస్కరిస్తే ప్రకటించే దాతగాని లేడు.

సంగీతాన్ని, సాహిత్యాన్ని, అభినయాన్ని శాస్త్రోక్త పద్ధతిలో నడిపించి శాశ్వతమయిన కీర్తి గడించినది కూచిపూడి వారి భాగవతాలు. ఈ భాగవతులు లాస్యం, నృత్తం, నృత్యం, నాట్యం అనే నాలుగురకాల భరత సంప్రదాయలనూ ప్రయోగిస్తూ, కళా కౌశలంలో కూడ విశిష్టత చూపి తెలుగు దేశానికే అఖండ మయిన కీర్తి సంపాదించిపెట్టారు. వీరి నాట్యకలాపాలో ఉన్న విదూషకుడు ఒక విధంగా సూత్రధారుడు. భరత శాస్త్రంలో ఆరితేరినవాడు. కలాపం పాండితీ ప్రపూర్ణం. హాస్యము సభ్యతాయుతమే కాని చాల స్వల్పం. సభాభిరుచిని బట్టి దొర్లే వెకిలిహాస్యంలో ఉన్నదోషం పూర్తిగా వైయక్తికం. అయితే, హాస్యం చాలా వరకు అప్రధానమయిన కారణంచేత యీ దోషం కూడ ఎక్కడో ఎప్పుడోగాని సంభవించదు.

బండహాస్యాన్ని పరాకాష్ఠకు తీసుకొని పోయిన కలాపం తోలుబొమ్మలాటలకు చెందినది. వీటిలో హాస్యం ఒక ప్రత్యేక ఘట్టం. దీనికి మూలం పచ్చిశృంగారం. ఈ హాస్యనాయకుడు గంధోళి (గంధారి) గాడు తెలుగునాట ఉపమాన పురుషుడుగా స్థానం సంపాదించుకొన్న పుణ్యాత్ముడు. పాటక జనం దృష్టిలో తోలు బొమ్మలాట కథకే యితడు నాయకుడు, ఇతడులేనిదే అసలు కథే లేదు. భారత భాగవతరామాయణాదులన్నిటిలోనూ యీ ప్రసిద్ధ పురుషుడు సపరివారంగా దర్శనం యిస్తాడు. ఇతని భార్య గయ్యాళి. అల్లుడు అత్తగారి హృదయాన్ని చూరగొన్న అందగాడు. ఇతని కాపురమూ యీ కథా మూలంలో వ్యంగ్యాలు. కాని ప్రదర్శనంలో విశేషం, చాటు మాటలులేని సరసం. ఈ ఘట్టంలో పాడేపాటలూ, ఆడే మాటలూ అన్నీ బూతుల బుంగలు. ఇదిగాక వేరే ప్రసంగవశాత్తూ ప్రయోగింపబడే హాస్యం కూడ తోలుబొమ్మలాటలో ఉంది. కథాగతిలో అందుకు తగిన అనువులు కూర్చుకొని యీ హాస్యం ప్రయోగిస్తారు. ఇది కొంతవరకు సభ్యమైన హాస్యం. ఇందులో అశ్లీలత అంతగా ఉండదు. కాని ప్రజా హృదయాన్ని చూరగొన్న హాస్యం గంధోళిగానిదే.

తెలుగు దేశంలో పగటివేషాలకొక ప్రత్యేకమైన స్థానమూ ఆదరణా చిరకాలం నుంచి లభిస్తున్నాయి. కాని యిప్పుడిప్పుడివి చాలవరకు మందగించేయి. వీటికి సంబంధించిన సాహిత్యం చాలాఉంది. ఇవి ముప్పది రెండు రకాల వేషాలకి సంబంధించిన రచనలు. కేవల రచనలేగాక కొన్ని కూర్పులుకూడ వీటిలో దొరుకుతాయి. వీటిలో కొన్నింటికి

కథ ఉంటుంది, లేదా జీవితానికి సంబంధించిన ఏదో ఒక ఘట్టము వర్ణించి ప్రదర్శింప బడుతుంది. దాక్షిణీపంతులు వేషం, సతానీసాహేబు వేషం, అర్ధ నారీశ్వర వేషం, సోమయాజులుగారి వేషం వగైరాలు నేటి ఏకాంక నాటకాల తరహాలో ఉంటాయి. కేవలమూ కొన్ని మాటలు, పాటలు, పద్యాలు అన్నీ ఓక్రమంలో చేర్చి గంటసేపో అరగంటసేపో శ్రోతలను రజింపజేయడానికి వేసే బుడబుడకుల వేషం, మందులమారి వేషం, శారదవేషం వగైరాలలో కథ ఏమీ ఉండదు. కల్పనా చమత్కృతి, వచోనైపుణ్యం, అనుకరణ ప్రతిభవంటివి వీటిలో మెచ్చుకోదగిన గుణాలు. ఈ రెండురకాల పగటివేషాలలోనూ హాస్యము అపారంగా ఉంటుంది. అది ఆంగికవాచిక ఆహార్యాది భేదాలన్నిటితోనూ ప్రదర్శింపబడుతుంది. అశ్లీలత అంతగా ఉండదు. వ్యంగ్యం విశేషంగా ఉంటుంది. ఈ వేషాలను అభినయించడానికి ప్రత్యేకంగా రంగస్థలమంటూ ఒకటి ఉండకపోవడమూ, వేషగాళ్లు యింటింటికీపోయి, వీధివాకిలినే రంగస్థలంగా మార్చి అభినయించడమూ, ప్రేక్షకులలో ముఖ్యులు తగుమనుష్యులూ, దాతలూ, స్త్రీలూ అయి ఉండటమూ అనే కారణాలను పురస్కరించుకొని యీహాస్యం చాలవరకు అసభ్యతకీ, అశ్లీలతకీ, స్వస్తి చెపుతుంది. ఈ హాస్యానికి ఆయువుపట్టు అనుకరణ. వేషం, భాష, భావం, అభినయం వగైరాలన్నిటిలోనూ హాస్యానుకరణ ముమ్మరంగా ఉంటుంది. మచ్చుకి సోమయాజులు వేషంలోని కొన్ని శ్లోకాలు చూడండి.

"అంబలి ముఖ్యంత్వలంకారం కంబళి ముఖ్యంతు భోజనం
రాట్నం ముఖ్యంతునారీణాం దుక్కి ముఖ్యంతుబ్రాహ్మణః ॥
బాకీసార్లా సుమనసా సర్వాదాయం యథాక్రమం
తిన్నట్టే తినకున్నట్టె ఉన్నవారికి మాడడం ॥
మాట మాట ప్రసంగేన దబ్బ దిబ్బ స్తథైవచ
పాచరకు ప్రయోగేన శరీరం పీడవర్జయేత్ ॥"

ఇవే శ్లోకాలు మరికొన్ని వేషాల్లోకూడ సందర్భానుసారంగాచదివి, అప్పటికి తగినట్టుగా హంగుచేసి, రక్తికట్టించుటకూడ యీ వేషగాళ్లకి పరిపాటే. ఈ శ్లోకాలు చదివేటప్పుడు, వేదంలోవలె వీటికి ఉదాత్తానుదాత్తాది స్వరాలుకూడ కల్పించి, మంత్రాలు చదివినట్టు చదవడంకూడ మామూలే.

"కాచి కాచీ ములంకాయ కాయవే పొట్టి కాకరీ
కాయానాం వంగపిందానాం కూరానాం గుజ్జుపచ్చడిః ॥"

అనే దాంట్లో యీ స్వరగమనం చూడవచ్చు. వేద మంత్రాలకీ, గృహ్యసూత్రాలకీ, ఆఖరికి అమరశ్లోకాలకీ కూడ యీ కలాపంలో హాస్యానుకృతులు (Parodies) కనిపిస్తాయి. శతాబ్జాల ధోరణిలో పద్యాలు చదవడం. ఓ దొంతి వరసాపెట్టి గుక్కతిప్పకుండా ఎన్నో మాట్లాడడం, చదివిన పద్యానికి సాగదీసి అర్థం చెప్పడం, ప్రశ్నాసమాధానం రెండూ ఒక్కడే వినిపించేయడంవంటి హాస్యకల్పనా చమత్కృతులెన్నో యీ పగటి వేషాలలో కనిపిస్తాయి. కథా వస్తువులేని వేషాలలో కట్టు కథలు కూర్చి చెప్పి నవ్వించడంకూడ ఉంటుంది. ఇట్టి కల్పిత కథలలో లుబ్ధులు పంచకులు అయిన ఊరి పెద్దలను హేళనచేస్తూ నిందా నిర్భితంగా చెప్పే వృత్తాంతాలెన్నో దొర్లుతూ ఉంటాయి. ఇచ్చేదాకా పొగడడం, యివ్వకపోతే తిట్టడం అనేది యీవేషగాళ్లలో ఓసంప్రదాయంలా కనిపిస్తుంది. ఈ రెండింటికీ సరిపోయిన సామగ్రి గద్యపద్యాలు రెంటిలోనూ వీరు సంగ్రహించి ఉంచుకుంటారు. తిట్టినా దీవించినా వినాలనిపించే ధోరణిలో మాట్లాడుతారు. ఈ క్రింది బుడబుడక్కల వేషంలోని ఆశీస్సు చూడండి.

" ఆలినొల్లక యున్నవానమ్మ మగని
అందులో దాగియున్న వానక్క మగని
నమ్మినాతని చెరచు దానమ్మ సవతి
సిరులు దయచేసి మిమ్ము రక్షించుగాక. "

"ఆలినొల్లనివాడు భీష్ముడు, భీష్మునితల్లి గంగ, గంగమగడు సముద్రుడు, సముద్రములోదాగిన వాడు మైనాకుడు, మైనాకుని అక్క పార్వతి, పార్వతి మగడు ఈశ్వరుడు, ఈశ్వరునినమ్మిన వాడు రావణుడు, రావణుని చెరపినది సీత, సీత తల్లి భూదేవి, భూదేవి సవతి లక్ష్మీదేవి, అట్టి లక్ష్మీదేవి మీకష్టైశ్వర్యములు, యిష్టసంపదలు, తుష్టి ప్రతిష్ఠలు, తూర్యారావములు గలిగించి రక్షించుగాక మహా రాజరాజా తేజా, విద్యలభోజా, వితరణకల్పభూజా, అంబా పలుకు, జగదంబా పలుకు...". ఈ ప్రవాహానికి అడ్డుఆపూ అనేవేవిఉండవు. నిందించినా యిదే ధోరణిలో ఉంటుంది.

ఈ వేషాలువేసే వారిప్పుడు తక్కువయ్యారు. వేషాలతోపాటు యీకలా పాలుకూడా మూలబడ్డాయి. వీటిలోకొన్ని సొంపయిన రచనలున్నాయి. ఇవి యిలా ఉపేక్షించబడి నష్టమయితే కొద్దికాలానికి కళపూర్తిగా నశిస్తుందేమోనని లక్షణాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇంకోవిశేషం, ఈ రచనలు కేవలమూ రచనలేకాదు, కూర్పులు కూడాను. సమయానుకూలంగా వాడుకోవడానికనిసంగ్రహించిన చాటుపద్యాలెన్నో వీటిలోకనిపిస్తాయి.

ఇంత వరకు సంగ్రహించి ముద్రించిన చాటుపద్య సంగ్రహాలలో కనపడని కొన్ని
యీకలాపాలలో వినిపిస్తాయి. కాలక్రమేణా యీ కలాపాలతో పాటు ఆపదా
నశిస్తాయనే భయం కలుగుతూంది. తెలుగుసాహిత్యంలో యీ చాటువులికి
స్థానం ఉంది. వీటికి విలువగమనించి కీ॥ శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగా
సాహితీ ప్రియులు, పండిత ప్రకాండులు పరిశ్రమచేసి చాలమట్టుకు వీటిని సం
ప్రకటించేరు. కాని ఈ క్షేత్రంలో చెయ్యాలసేపని యింకా ఉంది. ఈ చ
సంగ్రహించండం ఒకయెత్తు; సంగ్రహించినవాటిని సంస్కరించడం యెత్తుకి రెండెత్త



# తెలుగుసాహిత్యంలో హాస్యం

తెలుగులోగల హాస్యగ్రంథాలు ఏవి అనిగాని, అవి ఎలాగున్నాయనిగాని చూడడానికి ముందు, అసలు తెలుగు కవులు హాస్యాన్ని ఎలా పోషించారో చూడటం కొంత మేలు. వాస్తవానికి, తెలుగులో ఉత్తమకవులని పేరుబడిన కవులెవరూ ఆద్యంతమూ హాస్యాన్ని పోషిస్తూ కావ్యాలు వ్రాయలేదు. అలా వ్రాసిన కవులెవరూ ఉత్తములుగా పరిగణించబడలేదు కూడ. అయితే ఉత్తములనిపించుకొన్న మన కవులెవరూ హాస్యాన్ని ఉపేక్షించలేదు. అతి సరసమైన హాస్యాన్ని అంతో యింతో అందరూ అందించేరు. ఇంతేకాదు, కాలప్రభావాన్నిబట్టి కూడా మన కవుల హాస్యపోషణలో మార్పులెప్పటికప్పుడే కనిపిస్తూ వచ్చేయి. ఒక కాలపు కవుల హాస్యాలంబన యింకో కాలపు కవులకు అట్టే హాస్యప్రదంగా కనిపించినట్టుతోచదు. మరొక విశేషం, మన కవులలో చాల మంది రాజాశ్రితులు. ఆశ్రయదాత అభిరుచికి సరిపోయినట్టుగా హాస్యాన్ని కూర్చి పోషించినట్టు గూడ రూపిస్తుంది. ఇవన్నీ కలిపి చూస్తే హాస్యగ్రంథాలనిపించుకొన్న వాటిలో కంటె హాస్యేతర గ్రంథాలలోనే చాలవరకు శాస్త్రీయము, సరసము, సమీచీనము అయిన హాస్యము మనకు లభిస్తూందని చెప్పక తప్పదు. ఈ ప్రకరణంలో నన్నయ మొదలు నిన్నటివరకు రచనలు సాగించిన వారిలో హాస్యాన్ని పరామర్శించవలసి ఉంది. కాని అందరి కవుల పేర్లూ ఎత్తుకోవడంగాని, అన్ని గ్రంథాల్ని ఎత్తిచూపడంగాని, అనవసరమే కాదు అసాధ్యంకూడ. ముఖ్యులైన వారిని గురించి ముచ్చటించడములో గూడ భ్రమ ప్రమాదములు కొన్ని రావచ్చు. హాస్యమును హెచ్చుగానో, లేక క్రొత్త పద్ధతిలోనో పోషించిన వారినే నేనీ ప్రకరణములో పేర్కొనడానికి తలచేను. ఇంత మాత్రాన్న మిగత వారిలో హాస్యంలేదని కాని, నాకు వారిమీద గౌరవంలేదని కాని తలప వలదని ప్రార్థన. మన తెలుగు సాహిత్యము నన్నయ గారితో ప్రారంభించినట్టు నా నమ్మకము. నన్నయగారినుండి నేటివరకుగల కాలమును నేనీ ప్రకరణంలో నాల్గు భాగాలుగా విభజించి చూసేను. ఈ విభజన ప్రస్తుత వ్యాసానికి అనుకూలంగా ఉండేదే కాని మిగత విషయాలకి సంబంధించదు. సాహిత్యాన్ని పద్యమనీ, గద్యమనీ రెండు భాగాలుగా మాత్రమే చేసి చూపాను. కథ, నాటకం, నవల, ఏకాంకిక, వ్యాసం, విమర్శ వగైరాలన్నీ గద్యలోనే చేర్చాను. అన్ని రకాల రచనలు చేసిన రచయితలను గురించి వ్రాయుటకు నా యీ భాగము చాల అనుకూలించిన కారణాన్ని యిట్లు చేయవలసి వచ్చింది. లెక్కకు మిక్కిలిగా రచనలు సాగించిన వారిని గురించి వ్రాయునప్పుడు, వారు రచించిన పుస్తకాల జాబితాలిచ్చి విసిగించుటకు బదులు, ఉదాహృత రచనల

పేర్లు మాత్రమే విన్నవించదలచాను. ఆయా రచయితలు, పాఠకులు కూడ నా యీ అభి నయాన్ని మన్నిస్తారని ఆశిస్తున్నాను.

తెలుగులో ఉన్న ప్రాచీన సాహిత్యమంతా పద్యమయం. ప్రారంభంలో ఉద యించిన కావ్యాలు ఇతి హాస రచనలు, మరికొన్ని పురాణాలు. అన్నీ సంస్కృతానికి స్వతంత్రాను వాదాలు. వస్తుతః యివి బృహద్గ్రంథాలు. మనజాతి, చరిత్ర, సంస్కృతి సభ్యత, ధర్మం, మతం మొదలైన విషయాలన్నిటికీ సంబంధించిన సకల విజ్ఞానాన్ని సర్వు లకు అందించడాని కని వెలసిన పూజ్య గ్రంథాలు. వీటిలో మూలకథకి తోడు ప్రాసంగి కంగా వచ్చే అవాంతర కథలేకాదు, శ్రుతిస్మృతులలో ఉండే విషయాలు కూడ సార రూపంలో అందించబడ్డాయి. వీటిలో భాష మనదిగాని విషయం యావద్భారత జాతికీ సంబంధించినది. వీటిని గౌరవంగా చూడటం అనాదిగా వస్తూన్న సంప్రదాయం. వ్రాసిన మన కవులు మహా ధార్మికులు. ఉదాత్తంగా జీవించి, ఉజ్జ్వలమైన గ్రంథాలు వ్రాసి ఉత్తములనిపించుకొన్న మహనీయులు. నన్నయభట్టు మొదలు శ్రీ నాథుని వరకు మన కిట్టి ధార్మికులూ, తగు మనుష్యులూ, గంభీరులూ అయిన కవులే దొరుకుతారు.

ఈ కవులెవరూ నోరు విప్పి నవ్వడం ఎరగరు, సరిగదా మనల్ని నవ్వ నివ్వరు. నవ్వ వలసే చోట కూడ పెదవులు బిగించి కళ్లెగరవేసి ఊరు కొంటారు. వీరి నవ్వు నారి కేళ పాకం; లోపల స్వయం పాకం. ముఖ్యంగా వీరు నవ్వేది మానవ స్వభావాన్ని చూచి; అందులో ఉన్న వికృతులు గమనించి, అంతే అదే మనకు వీరు మరిచిపోకుండా చూపిస్తారు. కాని వీరు సానుభూతి పరులు. ఒకరిని నవ్వుల పాలుచేయటం కూడ వీరి కంతగా కిట్టదు. తటస్థులుగా నిలబడి 'యిది యిలా ఉంది, అది అలా ఉంది.' అని చెప్పి, ఆ ఉండటం సబబుగానూ, సవ్యంగానూ, సరసంగానూ, ఉన్నదో, లేక తిరుగుడుగా ఉన్నదో, తెలుసుకొని నవ్వటమా ? ఏడవటమా ? అనే నిర్ణయంచేసుకోవలసే బాధ్యత మన మీదనే విడిచి తాము తప్పుకుంటారు. వీరి యీస్వభావానికి అనుగుణమైనవే వీరికి దొరికిన కావ్యవిష యాలు. పైగా ఊపిరాడని వేగంతో చెప్తేనే గాని ఎన్నటికి తరగనంత విషయజాలం వీరికి తమ గ్రంథాల్లో అందజేయవలసి వచ్చింది. ఒకక్షణం ఓపికగానిలచి, నవ్వి నవ్వించడానికి తగిన తీరుబడికి వీరు నోచుకోలేదు. అదిగాక, చెప్పవచ్చిన విషయం అతిపవిత్రమైనదనిన్నీ, చెప్పిన వారూ కూడ తరస్కారనిన్నీ అటు వారికి, యిటు యీనాటి వరకు మనకి ఒక దృఢ మైన నమ్మకంకాగా యిక వీరి గ్రంథాల్లో నవ్వడానికి మనకి మిగిలేదిగాని, వారం దించేదిగాని ముఖ్యకథలో గల పాత్రల స్వాభావికలోపాలు, నాటిని పురస్కరించు

కొని ఏర్పడిన ఘటనా వికృతులు, అందు కను కూలించిన యితర విషయాలు, అవాంతర కథలలో అందాందంగా ధ్వనించిన వెక్కిరింపులు మాత్రమే. ఇవిగాక కవిగారి స్వంత వ్యాఖ్యానాలు, కథ చెప్పే ధోరణి కూడ మరి కొంత ఎక్కువగా నవ్వడానికి తగిన సామగ్రిని చేకూర్చేవిగా ఉంటాయి. కథ ఉదాత్తమైనదయినందున, ఊకొట్టి ఊకొట్టి ఉద్విగ్నులమైయున్న మనకీ భావాల బరువుదింపి కొంత విశ్రాంతి కలిగించడంకోసమని ఏరికోరి తారసింపజేసే ఘటనలో నవ్వుకి విధిగా జాగా చేయబడుతూ ఉంటుంది. అయితే యీ నవ్వు ఎక్కువగా ప్రసాదించటమా? తక్కువగానా? అనేది కవిగారి వ్యక్తిత్వాన్ని అభిరుచిని బట్టి ఉంటుంది. ఈ కవులలో కొందరు కేవల కవులు, మరికొందరు రాజకీయ నేతలు. ఇంకా కొందరు స్వతః రాజులు. కొందరిలో వైదికం, కొందరిలో లౌక్యం, కొందరిలో బింకం, కొందరిలో రాజసం, వగైరాలు ఎక్కువగా కనిపిస్తాయి. వీరు నవ్వేది, నవ్వించేది, వీటిని బట్టి మారుతూ వుంటాయి.

తెలుగులో మొదటి కవి నన్నయ భట్టు, ఇతడు 'నానృషిః కురుతే కావ్యం' అనే మాట చరితార్థం చేయగల మహాత్ముడు. ఇతనికున్న లోకజ్ఞత అపారం. వ్రాసిన కావ్యం పంచమ వేదమనిపించుకొన్న భారతం. మూలతః వీర కావ్యమే అయినా యిది వస్తుతః శాంతరస ప్రధానమైన పవిత్రగ్రంథము. అయినా నానా రుచి సూక్తినిధి అయిన మన నన్నయ మాత్రం, మడికట్టుకున్నా, మధ్య మధ్య మనల్ని నవ్వించి, తాను నవ్వుతూనే యీ కావ్యాన్ని వ్రాసేడు. ఆ నవ్వు చాల విశుద్ధమైనది. కవి మాయ మర్మము లేని వాడు. హాస్యము శుద్ధ వైదికము. ఎక్కడేనా ఎప్పుడేనా యత్కించిత్ వ్యంగ్య మిశ్రితమైన హాస్యం తొణికిసలాడినా అది అతి మృదువుగా ఉండేరకం. కల్ల కపటాలులేని యితని నవ్వు మానవ జీవితంలో ఉన్న కల్లకపటాలపై ఎంతఉందో అంతకు రెండింతలుగా, మనష్యుల్లో ఉన్న నిండుతనమూ నిజాయితీలపై ఉంటుంది. భవ్యత యితనికి ప్రియమైనది. ఒడ్డూ పొడుగూ ఉన్న విడ్డూరమైన వస్తువు యితనికి సరదా అయినది. ఇతని సానుభూతికి ఎల్లలూ హద్దులూ లేవు. ఉజ్జ్వలమైన విషయమల్లా యితని హర్షానికి పాత్రమే. ఆ హర్షం మందహాసంగా మారి తీరేరకం. నిజాయితీ లేని బ్రతుకుచూస్తే ఇతడు నిస్పృహతో నవ్వేసి సరిపెట్టుకొనేసాధువు. చిన్నపిల్లల మాదిరిగా ఆశ్చర్యకరమైన విషయం చూసి లేదా అందరూ నవ్వుతున్నారు గదా అనేసి, అమాయికంగా యితడు నవ్వుతాడు. తాను నవ్వినపుడు యితరులు నవ్వుతున్నారో? లేదో? అనేదికూడ యితనికి కావాలి.

నన్నయ్య గారికి భీముని పాత్రపై అపారమైన అభిమానము. భీముని పేరెత్తే సరికే కవిగారి ముఖం వికసిస్తుంది. వేరు వేరు విధాల భీమునిలో ఉన్న విశేషాలు చూసి, చూపించి నవ్విగాని యీయనకు తృప్తిలేదు. ఈ పాత్ర రూపురేఖలు, స్వభావం; ఊహా, ఉద్దేశం, అన్నీ నన్నయగారికి ప్రియమైన విషయాలే. అంతటా అద్భుత హర్షాలు ముమ్మరంగా పొంగి యితనిని నవ్వించేయి. ఈ క్రింది ఘట్టం భీముడు జన్మించిన పదియవ నాటి కథకి సంబంధించినది.

"... అటశతశృంగంబున గుంతీదేవి భీమసేను సుపుత్రుంబడ సిడిశమ దివసంబున వేల్పులకు మ్రొక్క గొడుకునెత్తికొని దేవగృహంబునకుంబోవునెడ నతి విషమగిరి గహన గహ్వరంబున నుండి యొక్క పులి వెలువడి యామిషార్థియై వచ్చి పయికి లంఘించిన." పాండురాజు పులిని సంహరించి పత్నీ పుత్రులను కాపాడుకొన్నాడు. కాని యీ లోపుగా,

" ఉరుశార్దూల భయంబునఁ
బరవశయై కుంతియున్న బాలకుఁడు శిలో
త్కరము పయిఁబడియెఁ దద్బా
సురతనుహతిఁ జేసిరాలు చూర్ణంబయ్యెన్. "

భీముని ఈ వజ్రకాయము చూసి నన్నయగారు ముగ్ధులయి మురిసిపోయి మళ్లా మరోసారి యీ విషయాన్ని చెప్పి, చిరునవ్వు నవ్విగాని ఊరుకోలేకపోయారు. బకాసుర వధకై పుత్రుని నియోగించి సమర్థిస్తూన్న కుంతి పలుకులు చూడండి.

" వీఁడు పుట్టిన పదియవనాఁడు పెలుచఁ
బడియె నా చేతినుండి యప్పర్వతమునఁ
బడిన వడిఁ జేసి బాలకు నొడలుదాఁకి
యాక్షణంబ రాలెల్ల నుగ్గయ్యెఁ జూవె. "

ఈ వజ్రకాయమేకాదు, భీముని భోజన ప్రియత కూడ నన్నయ్యగారిని నవ్వించినదే. అశనిగాత్రపు తిండిచూసికాదు, తిని అరిగించుకోగల శక్తికి మెచ్చి, యితడు నవ్వుకొన్నాడు. అంతేకాదు ఆ సందర్భంలో భీముని చాపల్యం కూడ యితనికి కొంత వికారంగా తోచి నవ్వించింది. బకాసురునిపై బోవు

"భీమసేనుండిట్లు భోజనంబునం దృష్టుండయి భ
క్ష్యాన్న పూర్ణంబయిన శకటంబునెక్కి యక్షీణబాహు
బలుండయి బకాసురుండున్న చోటికింజని యార్ద్ర
కుణప కీకస వసామాంస దుర్గంధ సంపేతం బయిన వట
స్థానంబు డాయక యోజనంబుగ యమునా తీరంబున
శకటంబు నిలిపి యారక్కసునం బిలిచి, వాడు వచ్చు
నంతకు మున్న కుడువ నేలయని కాలుసేతులు గడిగి
కొని యాచమనంబుం జేసి యా శకటంబు నందున్న
కూడుగుడుచుచుండె ........"

ఇష్టాన్న పరితృప్తుడయిన వాడు తిరిగి భోజనము చేయుటకుపక్రమించుట కంటె వికృతి మరొకటిలేదు. అయితే యీ చాపల్యమేకాదు. మరికొన్ని స్వభావసిద్ధమైన వికృతులు గూడ యిప్పుడు భీమునిలో కనిపిస్తున్నాయి. రాక్షసునితో కయ్యము నెత్తినబెట్టుకొని చావో రేవో తెలియని అవస్థలో తిండి తిందామనే కుతూహలం పుట్టడమే కాక, ఆ రాక్షసిని రమ్మని పిలిచి 'వాడు వచ్చునంతకు మున్న కుడువ నేలయని' తినబోవుటకుతోడు తీరుబడిగా, కాలుసేతులు గడిగికొని యాచమనంబుజేసి, భోజనానికి ఉపక్రమించడం ఊహాకే అందనంత వికృతి. ఇంతతో సరిగాదు. బకాసురుడు తనని చూసి మండిపడి "డాయవచ్చి యయ్యనిలనందను వీపుఁ బిడికిటఁ బొడిచినఁ బెదరకసురవలనుసూడకొండు పలుకక, యెప్పటియట్ల" 'వేయి గ్రుద్దులైనా ఒక్క బొబ్బట్టుకు సరిగావన్న' నిశ్చయంతో కిమ్మనకుండా భుజించుట కన్న మించివికృతి ఉండబోదు. అయితే నన్నయ్యగారిది చూసి నవ్వినా, యీ తిండికి దృష్టి తగలడం నచ్చరు. మమత్వం, వాత్సల్యం కూడ ఆయనకు భీమునిపై కలవు. ఇది కేవలం అభిమానపూర్వకమైన ఆనందపు నవ్వు. భీమునికి తిండి పెట్టేతీరు బోధిస్తూ కుంతి ద్రౌపదితో ఆడినమాటలు చూడండి.

"వెడఁద యురంబు సన్నపు
కడుపును ధృఢకఠిన తనువుఁగల యీతనికిం
దొడర నొక పాలు వెట్టుము
వడి నాగాయుత బలమ్ము వాఁడతఁడబలా."

'అమ్మా! ఆ వ్యక్తికి ఒక సగము పెట్టు. ఈ వీరందరికీ మిగత సగం సర్దిపెట్టు,' అని చెప్తే సరిపోయేదానికి బదులు 'వెడఁదయురంబు సన్నపు కడుపును దృఢకఠిన తనువుఁగల

యాతనికని విస్తరించి వర్ణించడం కేవలం నన్నయగారి నవ్వుమాత్రమే కాదు, కుంతితోపాటు ఆయనకు గూడ భీమునిపైగల వాత్సల్యాన్ని వెల్లడిస్తుంది. ఉన్నదాంట్లో సగము పెట్టమని చెప్తూ 'అన్నువ కడుపు' వాడని చూపినప్పుడు ద్రౌపది సహజంగా తెల్లబోయిచూసి అంటుంది. చిన్నకడుపు, పెద్దతిండీనా! అనే ఆశ్చర్యం ఆమె ముఖంలో వ్యక్తమై ఉండవచ్చు. ఈ ఆశ్చర్యాన్ని తొలగిస్తేనేకాని ఆమెచేతిపెట్టు భీమునికి జీర్ణంకాదనే భయంతో తిరిగి 'నాగాయుత బలము వాడతడ'ని చెప్పి 'అబలా' అని సంబోధింప జేసేడు. బలవంతుని తిండి అబలకేం తెలుస్తుంది! ఈ మాట విన్నాక ద్రౌపదికి నవ్వు ఆపుకోవలసి వచ్చి ఉంటుంది.

నన్నయ్యగారు తాను నవ్వి ఊరుకోడు. మన మూనవ్వు అందుకోలేకపోతే, అందుకొనేదాకా ఆలంబనాన్ని పెంచివర్ణించడం ఆయనలో ఒక విశేషం. ఈక్రిందిది లాక్షాగృహదహన ఘట్టము. పురోచనుడారాత్రి లక్కయింటికి నిప్పుపెడతాడనే సంగతి పాండవులకి తెలిసింది. ఖనకుని కృపవలన బిలముపూర్తి అయింది. బిలమార్గానబడి ఏచోటికో పోవడానికి నిశ్చయం కూడ జరిగింది. అవసరాన్ని నిరీక్షిస్తూ ఉన్నారు పాండవులు. కాని నిద్రఆపుకోలేక కునుకుజెందారు. భీమునికిది విసువనిపించింది. కాదు, ఉత్సాహం తలెత్తింది.

"అయ్యర్ధరాత్రంబున భీముండు పురోచను కంటెమున్న
తానుత్సహించి వానిశయన గృహద్వారంబున ననలంబు
దరికొలిపి చెచ్చెర నన్నను దల్లినిదమ్ములను నాబిలంబు
లోని కనిచి యాయుధాగారంబుతోడన లాక్షాగారంబు
హుతాశనున కశనంబు సేసి"

చనెనా? కాదు, ఇదిచాలదు, ఎట్లు చనెనో చెప్పవలె. అప్పుడుగాని యీ ఆశ్చర్యం నవ్వు క్రింద మారదు. అందుకని 'చనునప్పుడు' అని యీ క్రింది పద్యం చెప్పి, కొసరి కొసరి వాక్యాన్ని పొడిగించారు నన్నయ్యగారు.

"కడునిద్రఁ గానమి చొడరుచు సడిగొని నడపంగ నేరక తడవు చున్న
నెఱిఁగి చెచ్చెరఁ దల్లి నతుకడనిడి ధర్మసుత విజయుల దనవితతబాహా
యుగళంబు నెక్కించి యములనుత్సంగంబు లెక్కించుకొని
భీముడక్కజముగ

నరిగెడు రయమునఁదనగులు సాల్వడి౹౹మ్రొగ్గఁ బడఘట్ట
నంబులఁజదిసిరాలు

నఱుముగాఁ నిట్లు నెఱయంగ సత్వంబు
మెఱసి రాత్రి యెల్ల నుఱక పవన
తనయుఁడరిగెఁ బవలు సనినట్లు చీకటి
యానక ముండ్లు గండ్లు నవక తెరలి."

భీమునిలో ఉన్న యీ ఉత్సాహమే కాదు మాంద్యము, మత్తు, దుడుకుతనము, చాంచల్యతనముకూడ నన్నయ్యగారి హాస్యమునకు పాత్రమైనవే. ఈ అన్నిచోట్లా ఆయనకు క్రోధాద్భుత హర్షములు ముమ్మరముగా కలిగి నవ్వు వచ్చింది. కాని యితనిలోగల అహంకృతిగాని గర్వము గాని నన్నయగారికి సరిపోవు. అంత కంటె మించిన వాని యెదుట యితనిని నిలువబెట్టి, తారతమ్యము చూపి; గర్వభంగం చేసిగాని నన్నయగారూరుకోరు. ఇట్టిచోట్ల యితని హాస్యం వ్యంగ్యాన్నా శ్రయిస్తుంది; నాటకీయ ధోరణిలో నడుస్తుంది. ఛలమే కాని అమర్షం కనపడదు. చిన్న పిల్లల్ని శిక్షించిన తీరులో ఉంటుంది. యీ హాస్యంలో ఉన్న శిక్ష తన తప్పు తాను తెలుసుకొనే వరకు మూర్ఖునిగా నిలిపి, నవ్వుల పాలుచేసి సంస్కరించే సద్భావ పూరితమైన వ్యంగ్య హాస్యమిది. సౌగంధికాహరణార్థమై పోతూ, దారిలో తారసిల్లిన హనుమంతునితో భీముడాడిన మాట లీ క్రిందివి,

"క్షత్రియ ప్రవరుండ విఖ్యాతబలుఁడఁ
బాండు తన యుండ గొంతి గర్భంబు నందు
వాయు వరమునఁ బుట్టిన వాఁడ నన్ను
భీము, డండ్రు భూజనులు కపి ప్రభుండ."

వింటూన్న వ్యక్తి హనుమంతుడని భీమునికి తెలియదు. తత్ఫలంగా భీము డతనితో

"ఏనిక్కడఁ గార్యార్థినై పోయెద నాకుం దెరువిమ్మనినాడు
దొల్లి శత యోజన విస్తారం బయిన సముద్రంబు లంఘిం
చి లంకకుం బోయిన హనుమంతు నట్ల నిన్ను నీ పర్వ
తంబు లంఘించిపోదు" అని చెప్పి, అంతటితోనరి పెట్టక,
"ఏను హనుమంతు నంతియ బలపరాక్రమంబులు గల
వాఁడ నాపౌరుషంబు, జూపుదునే?"

అని బిగువుగా పలుకుతాడు. కాని చివరికి అతని తోక కూడా కదల్చ లేక చిన్నబోయి "కృత పరిణాముడయి నిన్నెఱుంగక నాపలికిన దురుక్తంబులు సహింప వలయు' నని చెప్పి 'నీవెవరో తెలియ జేయవలసిన'దని ప్రార్థిస్తాడు. ఈ పరాభవం ఎవరికైనా నవ్విస్తుంది; కాని అభిమాన పూర్వకంగానే.

ఒకొక్కొక్క పరిస్థితిలో మనం అనవసరంగా ఏదో ఆరాటపడి, ముందు ఏమవుతుందో తెలియక మూర్ఖుల వత్తుగా చరిస్తాము. కాని పరిణామం శుభాంతమయినప్పుడు మనం మొదట పడిన అక్కరమాలిన ఆరాటాన్ని తిరిగి తలచుకొంటే, మన తెలివితక్కువ తనం మనకే నవ్వుగొల్పేదిగా ఉంటుంది. ఇలాంటి సందర్భం ఎక్కడైనా తటస్థిస్తే నన్నయ్యగారు దాన్ని కాస్తసేపు పొడిగించి సరదా తీర్చుకొంటారు. మత్స్య యంత్రాన్ని కొట్టి అర్జునుడు ద్రౌపదిని తనతో తీసుకుపోయాడు. తక్కిన పాండవులతనితో పాటు యింటికిపోయారు. కాని వీరెవరో; ఎక్కడివారో; ఎవరికీ తెలియదు. హీనజాతులగుదురేమో అనే వ్యర్థ సంశయానికి ద్రుపదుని మనస్సు గురి అయింది. ధృష్టద్యుమ్నుడుపోయి, పొంచిచూచి వచ్చి చెప్పిన మాటలవల్లకూడ పూర్తిగా సంతృప్తిగాని సంశయనివృత్తిగాని కలగలేదు. చివరికి తెగించి కులగోత్ర నామాలన్నీ అడిగి రావలసినదని పురోహితుని పంపినాడు. అతడేమి వర్తమానము తెచ్చునో అని ఉత్కంఠతో ఎదురుచూస్తున్నారు మిగతవారుకూడ. కాని సూటిగా వార్త అందించడం నన్నయగారికి నచ్చలేదు. అతడు ధర్మజుని చేత పురోహితునికి చెప్పించిన మాటలివి.

" ఇవ్వైపోయస లక్ష్యం
బివ్విలు మోపెట్టి నెట్టనేసిన వీరుం
డెవ్వనితకుఁ బతియగునని
నెవ్వగ మీరాజు నులుక నియమముఁ జేసెన్." అని

పూర్వాపరాలు పరామర్శిస్తూ ప్రారంభించి, నోరునొక్కి,

" అతఁడు నియమించినట్టు లయ్యంత్రమేసి
యాతఁ డిక్కన్యఁ బడసె నుర్వీశు లొద్ద
నేలమమ్ము నెఱింగెడు నెఱిఁగి యేమి
సేయువాఁ డింక మీపతి సెప్పుమయ్య." అని

ఎదురు ప్రశ్నించి, చివరికి, ధర్మరాజతనితో, చల్ల చల్లగా ఊరడించినట్లు;

" బలహీనుఁ డైన వానికి
బలవిధియె మోపెట్టి త్రివిధ సకార్ముకమున్
బలహీనుల కక్కృతాస్త్రిన
కలవియె యాలక్ష్యమేయ నక్రమలీలన్
మీ రాజుమనోరథంబు సఫలంబయ్యె నగవనేల" అని

పలుకుతాడు. మూర్ఖతలోఁబడిన వారిని సరికొంతసేపు మూర్ఖతలోనే నిల్పి నవ్వటం ఇది.

ద్రౌపదీ స్వయంవర ఘట్టంలో బ్రాహ్మణుల ఉత్సాహము క్షాత్రము చూసి పిన్న పెద్దలందరితోపాటు నన్నయ్యగారు నవ్వుకొన్నారు. మొదట ధనువు సవరింపిస్తున్న అర్జునుని చూసి "అయుక్త దర్పమ్మున నిట్టు నవ్వు పడుపన్ సమకట్టె నితండు విప్రవంశమ్మున వారికెల్ల" నని పల్కిన బ్రాహ్మణులే అతడు మత్స్యయంత్రాన్ని తెగనేసిన వెనుక అతి తోత్సాహ పూరితులై పట్టరాని ఆనందంతో "పయిపుట్టంబులు విడిచి వీచియార్చిరి." ఇంతతో సరిగాదు, రాజులందరూ కినిసి ద్రుపదుని మీదికెత్తి వచ్చుసరికి ద్రుపదుండును భీతుండై బ్రాహ్మణుల మరువుసొచ్చె. నిట్లు శరణాగతుండయిన ద్రుపదునోడ కుండుమని బ్రాహ్మణులు దమతమ దండాజినంబులెత్తి ప్రతిబలంబులపై" వీవసాగిరట !

సానుభూతిలేనిచోట మాత్రము నన్నయ్యగారి నవ్వు నిట్టూర్చినట్టు ఉంటుంది. కౌరవబలం వారి కుత్సితత్వం చూసి 'వీరి బ్రతుకింతే కదా' అనే నిస్పృహతో ఓ చిరునవ్వు నవ్వేసి యూరకుంటాడు. నవ్వులపాలుచేసి ఏడిపించడానికని ఎప్పుడేనా పూనుకున్నా, క్షణంలో ఆ ఉద్దేశాన్ని విరమించుకొని బుద్ధిచెప్పి లజ్జింపజేసి సంస్కరిద్దామన్న తాపత్రయానికి దిగుతాడు. మాయ సభలో దుర్యోధనుని ఏడిపించి, చివరికి ధర్మరాజునిచేత నతనిని సత్కరింపజేసి లజ్జింపజేసి విడిచినగాని ఆయనకు తృప్తిలేకపోయింది. ఏదికోరి పరాభవించిన ద్రుపదుని అపహాసంచేయబూనిన ద్రోణుడు మరుక్షణంలోనే అతనిని విడిచిపుచ్చేడని చెప్పడమేకాక "విప్రులయలుకయుఁ దృణహుతాశనంబు దీర్ఘమగునె" అని పరబోసి తేర్చిన పరమ సత్యాన్ని బయటపెట్టి, మొదట చూపిన వ్యంగ్యాన్ని నీరసంచేయడం నన్నయ్యగారి ఉదాత్తతకి ఉదాహరణంగా తీసుకోవచ్చును. అనుదాత్తమైన విషయం సత్యమైనా యీతని వ్యంగ్యానికి పాలుగాక తప్పదు. కాని ఆవ్యంగ్యం అతి సూక్ష్మంగానూ, అతి మృదువుగానూకూడ ఉంటుంది. బాహుకుని వర్ణిస్తూ,

" అతి పొడువు గులుచ చేతులు
నొటివ శరీరంబు గలిగి యొరులకుఁ జాడ్యం

గొఱగాకుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతీ ప్రియుఁడై."

అని చెప్పినచోట సత్యమూ, వైషమ్యమూ రెండూ ఒకే చోట కనిపించి వ్యంగ్య హాస్యమున కిరవని ప్రోత్సహించేయి. కాని యీనవ్వు యితనికి ప్రియమైన నవ్వు కాదు. ఏదో నవ్వి, చూసీచూడనట్టు దాటి పోవడమో, లేక నిగూఢమైన సత్యాన్ని నిర్ణయించిన తత్వాన్ని విప్పిచెప్పి వ్యాఖ్యానించి నవ్వుని వెంటనే చల్లార్చివేయడమో నన్నయగారి వ్యంగ్య హాస్యంలో తరుచు కన్పించే విశేషం. చాటుగా నిల్చి నవ్వుకోటం యీయన కంటె గొట్టడు.

కవి బ్రహ్మ తిక్కన పారంగతుడైన రాజకీయ వేత్త. తాను స్వయంగా రాజకీయాలు నడిపిన వ్యక్తి. రాజుల మర్యాదలు, రణరంగపు యెత్తులు, రాచకీయపు పేచీలు, రాయబారాల సొంపులు అన్నీ ఎరిగిన వాడే కాదు స్వయంగా అనుభవించినవాడు. తాను కవియై, కవులనాదరించి కావ్యాలు అంకితం పుచ్చుకొన్న మహనీయుడు. యజ్ఞం చేసిన సోమయాజి. కవి ప్రతిభలో కాని లౌకికజ్ఞానంలోగాని అంతవాడు మరొకడు "నభూతో నభవిష్యతి" అనిపించుకొన్న మహనీయుడు. ప్రారబ్ధం చాలక తెలుగువాడై పుట్టేడు కాని లేకపోతే 'విశ్వకవి' అని ఏనాడో అనిపించుకొని ఉండును. మూడుకోట్ల తెలుగువాళ్లలోనూ ముగ్గురు నలుగురు కంటె ఎక్కువగా సొంతంగా సంస్కృత భారతాన్ని చదివిన వాళ్లు ఉండరని అంటే అది యితని ప్రభావమే కాని వేరు కాదు. ఇతని అనువాదం మూలానికి సొంపులు కూర్చిందని చెప్పేకంటె మూలాన్ని మూల పెట్టించిందంటే అతిశయోక్తి కాదు. అస్తు. మనకి కావలసినది హాస్యం. ఇతడు వ్రాసినది బ్రహ్మాండమైన వీర కావ్యం. అందులోనూ అయిదు పర్వాలు కేవలం యుద్ధానికి సంబంధించినవి. మిగత వాట్లో చివరి ఎనిమిది పర్వాలు ఏడుపులు, మొర్రలు, వేదాంతాలు, నీతులు, నియమాలు మొదలైన వాటితో నిండినవి. కాగా మిగిలిన విరాటోద్యోగ పర్వాలు రెండు మాత్రమే 'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' అనే సామెతకు అక్షరాలా సరిపోయినవి. అయితే మిగిలిన ఆ రెండు కూడా సరసంగా సంతరించి అందించిన నేర్పు తిక్కనగారిది. నవరసాల్లోనూ ని పి యీకావ్యంలో యీయన మనకు కావలసినంత హాస్యం కూడ అందించేడు. ఈ కృతిలో హాస్యం మూలకథకి సంబంధించినంతవరకు వీర రసాంగంగా నిర్వహింపబడింది. కథాగతిలో అక్కడక్కడ గంభీరమైన భావాలనుండి విశ్రాంతి కొంచె.

కలిగించేందుకుగాను హాస్యం అందుకు తగిన అవకాశాలు కల్పించి నిర్వహింపబడింది. ఇక మానవ జీవితంలో అనుక్షణమూ కనిపించే, అనవసరమైన కోలాహలం, అపారమైన ఆర్భాటం అందుకోలేని పరుగులు, అనుకొన్నట్టుగా అయిందికాదనే ఏడుపులు వగైరాలపైచూపే వ్యంగ్య పూర్ణమైన హాస్యము కావ్యంలో యీచివరినుండి ఆచివరిదాకా కనిపిస్తుంది. నిజానికి తిక్కనగారికి వచ్చిన హాస్యం యిదే అని చెప్పినా చెప్పవచ్చు. వ్యంగ్యము యితని సొమ్ము. అతి మృదువైన రకంతో ప్రారంభించి, అత్యంత తీక్ష్ణమైన రకం వరకుగల వ్యంగ్య వాక్యాలన్నీ యితడు నేర్చినవే. అయితే సూటిగాపోయి హృదయంలో గ్రుచ్చుకొనేటంత కటువైన వ్యంగ్యాన్ని ప్రయోగించినా, వినగానే తటాలున అర్థంకాని ధోరణిలో, దాన్ని కప్పిపుచ్చి, అణుమాత్రమైనా తొణకకుండా అందించే నేర్పు యితనిలోగల ప్రత్యేక ప్రతిభ. నవ్వవలసేచోటనైనా తాను నవ్వడు. అలాగనే మనల్ని నవ్వించకమానడు. ఆనవ్వించేదైనా కొంచెముకాదు, మరీ మరీ నవ్వించి, కితకితలుపెట్టినట్టుచేసి ఊరుకోనివ్వకుండా నవ్వించి, మళ్లా మళ్లా తలుచుకో నవ్వేటంతగా నవ్వించటం. ఏడిపించినా యిదే వరస; తలచినకొద్దీ హృదయం తరుక్కుపోయేటంత తీవ్రంగా వ్యంగ్య బాణాలు విసిరి, ఏమీ ఎరుగనట్టు మూతిబిగించుకొని కూర్చోవటం. ఒక్కొక్కచోట ఎవరినో ఆగడాల పాలుచేసి, అల్లరిబెట్టి, చూసినవాళ్లనీ విన్న వాళ్లనీకూడ నవ్వించటం కనిపిస్తుంది. మరోచోట సవ్యంగా మాట్లాడుతూన్నట్టే మాటాడుతూ వెక్కిరించి, వికృతిని కళ్లముందు కట్టినట్టు చూపి నవ్వించటం కనిపిస్తుంది. ఇంకోచోట పాత్రలనూ, వాటిలో ఉండే వికృతులనూ చెప్పక చెప్పినట్లు వర్ణించి, మూర్తులు ముఖం ఎదుటికి తెచ్చి చూపించి, నవ్వించటం కనిపిస్తుంది. మొత్తం మీద యితడు హాస్య ప్రియుడైన కవి. కాని ఆ హాస్యం అతి గంభీరమయినది. వెకిలిగా నవ్వడం యితడెరుగడు. నవ్వినంత సేపూ హేళనగానే నవ్వుతాడు. కాని ఆ హేళన ఓ అంతటకు గాని అర్థం కానివ్వడు. "అంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై వెలివిరియంగనీక" మెలగడంలో యితనికితడే సాటి. హాస్యమెంతలోతుగా ఉంటుందో మాట అంతలోతుగా ఉంటుంది. అసలులోతిచ్చి మాటాడడు. ఎదుటి వారిలోతు క్షణంలో గ్రహించి, ఏ మాత్రం లోపం కనిపించినా, అతి గడుస్తనంగా దాన్ని బయటపెట్టి అవహేళన చేయడానికి పిడుగు. ఇది యితనికి లౌకిక విద్యతో పాటుగా అబ్బిన మాట నేర్పు. అజ్ఞాత వాసం నిర్వహించి, వచ్చి ఉపప్లావ్యంలో ఉన్న పాండవులను చూచి రమ్మని ధృతరాష్ట్రుడు పంపగా వస్తాడు సంజయుడు. "మీ తండ్రి మీ క్షేమ సమాచారాలు తెలుసుకొని రమ్మని నన్ను పంపినాడ"నే సంజయుని మాటకు ధర్మజుడిచ్చిన జవాబులో గల ధ్వని చూడండి.

"ఆ రాజు మాదెసం గల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన
గారవమున నాదుమది వికాసము, బొందెన్."

ఇదే తీరున మాటకు మాట మర్యాదగా, లోకసాటిగా ఉండేట్టు మాటాడిస్తూనే, గుండెలు కుళ్ల బొడిచినంతగా ఎత్తి పొడిచి ఏడిపించే శక్తి తిక్కనగారి వాక్కులలో మూర్తీభవించి నిలిచింది. వాస్తవానికి సంజయ రాయబారమే ఒక అపహాస్య భాజనమయిన ఘట్టము. ఇందులో మూలతః ఉన్న వికృతి ధర్మజుని మాటల్లో తిక్కనగారెట్లు బయట పెట్టారో చూడండి.

"తానైన నపుడు పక్షిం
డైనీతి పథంబు విడిచె నక్కట పటిమ
మ్మైనను జక్కని తెరువునఁ
బూనినడువుఁ డనుచునిపుడు బుద్ధులు సెప్పెన్."

రాయబారంలోని విషయం కేవలమూ శుష్క ప్రియాలూ శూన్య హస్తాలున్నూ. ఇలాంటి ఘట్టాల్లో ఎంతసేపూ మాటలు మాత్రం తీపిగా ఉంటాయి. క్రియ శూన్యం, స్వప్రయోజనాన్ని ఆశించి పొగడే పొగడ్తలకి అంతూ పొంతూ ఉండదు.

"పాలిక కౌరవులు దుశ్శీలతఁ జెడ దలచిరేని చెప్పెద రుధిరా
భీలాన్నంబున కంటెను మేలగు భిక్షాన్నమైన మానదవడికిన్."

అని అంతతో ఆగక,

"అల్పులకు మ్రింగఁ జేఁదైన హాలహలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగి కొనఁగ
నీలగళు నెన్న నిన్నెన్నఁబోలు నట్టి
నీవు సాలిన గాకేమి నెగడుఁ బేరు."

అని సంజయుడు యుధిష్ఠిరుని పొగడే పొగడ్తలలో ఉన్న పోలుపుచూస్తే, వస్తూన్న ఏడుపు కూడా నవ్వు క్రిందనే మారుతుంది. ఈ విధమైన వాక్చాతుర్యం తిక్కనగారి హాస్యానికి ముఖ్యమైన అంగం.

ఊరకనే కోరి కోరి ఎవరినైనా అల్లరి చిల్లరగా ఉడికించినట్టు మాట్లాడి చూపరులను నవ్వించటంకూడ తిక్కనగారిలో ఒక విలాసం. భీష్ముని మాటలకు కోపించి, అతడు యుద్ధము చేస్తూ నిలిచినంతకాలం, తాను యుద్ధం చేయబోనని చెప్పి ఒట్టు పెట్టుకొన్న కర్ణుడు, ఊరకే యింట్లో కూర్చోలేక 'మొనల వినోదంబునకుం గనుగొన' వలచి యుద్ధరంగానికి వస్తే శ్రీకృష్ణుడతనిని సమీపించి ఆడిన మాటలు వినండి.

" అహిత కటకినీ తనూజుపై నలుకఁజేసి
యనికిఁజోరవటె యట్లైన నతఁడు నచ్చు
నంత దాకఁ బాండవులకై కొంత సమర
కేలి వేడుకఁ జలుపుట పోల దొక్కొ."

ఈ మాటలువిని కర్ణుడు లోలోపల ఏడ్చుకున్నా, బయటకు మాత్రం నవ్వవలసిందే. అసలు తిక్కనగారు రాజసంగా బ్రతికిన వ్యక్తి. అందుకు విరుద్ధంగా గాని, అంతలబొంతలగా గాని, ఉన్న విషయమల్లా ఆయనకు అపహాస్యభాజనంగానే తోచినట్టు కనిపిస్తుంది. అయితే సానుభూతి గలచోట్ల యీ అపహాస్యం ఏదో సరదాకి వికటమాడినట్టుంటుంది, లేనిచోట వెక్కిరించి నట్టుంటుంది.

ఈ క్రింది ఘట్టము పాండవులు విరాట నగరానికి పోతూవున్న సందర్భములోనిది. త్రోవలో వారుపడే అవస్థలు యిందులో వర్ణ్యము, వారు కాలి నడకని పోతున్నారు, ద్రౌపది సుకుమారి గాబట్టి నడువలేక పోయింది. ధర్మరాజు హృదయం ద్రవించింది, కాని తాను స్వయంగా సాయపడడానికి తగడు, వాస్తవానికిది ఏడవ వలసేపట్టు, కాని తిక్కన్న గారికి ఏడుపు విసుపనిపించింది.

" తనమదిఁ గరుణాయు ఖేదం
బును బెరిగొనుచుండ ధర్మపుత్రుఁడు నకులుం
గనుఁగొని ద్రుపద నృపతినం
దనదెస యాతనికిఁజూపి తగనిట్లనియెన్.
ఇకట మనము వచ్చినది నడుచవ్వునేఁ
విప్పురంబు సోత్తమని తలంచి
తిమ నడిచితిమి లతాతన్వియిది వడ
గనియె మోచి తెమ్ము కొంతదవ్వు."

అని చెప్పి, అంతలో ఊరుకోక, నవ్విద్దామన్నట్టుగా, తిక్కనగారి ఘట్టాన్ని పొడిగించ దలచారు.

" అనిన విని పూని గ్రక్కున
జనుదేరమి నతఁడు దన్నుఁ జాలండని యె
మ్మనమున నెఱింగి యాతని
యను జన్మునిఁబనిచె నతఁడు నలసుండయినన్.

సవ్యసాచింజూచి,

ఇమ్మదిరాక్షి దన్నె ఘనకీ నడుమన్ విడియంగ నొందు చో
టిమ్మనుగాదు నిక్కమునకేమును దన్నితి మట్లుగాన నీ
వెమ్మయినైన దీని భరియించిపురంబు సమీప భూమికిం
దెమ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁబ్రియంబునఁ బుష్పకోమలిన్."

ఈ పుష్పకోమలి నిలా ముగ్గురిచేత మోయించి, సత్తువలు పరీక్షించిన కంటే మొదటే మోయదగిన బలవంతుని పురమాయించరాదా! కాని విశేషమేమంటే యీ ఘట్టం చదివి చటాలున నవ్వలేము. అలాగని మానలేము. నవ్వు రాకమానదు; నవ్వితే బాగుండదు. ఈ నవ్వుపాఠకులకే ఒక పరీక్ష. మహాగంభీరులై నవ్వకుండా కూర్చున్న వారుకూడ ముసి ముసిగా నవ్వవలసినవారే. పైగా, యీ క్రింది వాక్యాలు మన పట్టుదలను భంజించి నవ్విస్తాయి.

" మోచుకొని వాస వాత్మజుఁ
డాచెలువం దేర నిట్టులరిగి పురముదృ
గ్గోచరమగుటయుఁ దమ్ములఁ
జూచుచు వారలకు ధర్మసుతుఁ డిట్లనియెన్,
చక్కని చిక్కని మేనులు
నిక్కోదండములునైన నెఱుఁగరె వన మీ
చక్కటి నిలుతమె శస్త్రము
లొక్కెడ దాఁచుటకు వేష యోజనములకున్."

అన్నగారినోట యీమాటలు రావడం తడవుగా, పాపం! ఎంతగా నడుమునొప్పి పెట్టించిందో గాని ఔనూ కాదూ అనే తర్కాలకి ఎడమివ్వకుండా, "అనిన నిది కార్యంబని పాండవ మధ్య

ముండాసుమధ్య నొక్క శితలపికతాకాలంబున డించె." నటు! అతని అవస్థ గ్రహించి ఇక కాపని మళ్లా మోయించటం యిష్టంలేక కాబోలు, "తిక్కనవారు నట్లచేయుదమని నిలిచిరి." కాకపోతే, యీసారి యీ తిట్టు ఎవరి తలకెక్కునో !

తిక్కనగారి ఉత్తరుడు ప్రగల్భాలకీ, పిరికితనానికీ, శాశ్వతమైన కీర్తి గడించు కొన్నాడు. మొదట అంతఃపురంలో ఆడవాళ్లదగ్గర కొట్టిన బడాయిలూ, బృహన్నలవంటి పేడినాయ సారథా, అని విసుక్కొన్న వన్నెలూ, రణస్థలం సమీపించక ముందే, కనుచూపు మేరలో ఉన్న కౌరవ సైన్యాన్ని చూసేసరికి పొందిన చిన్నెలూ, అంతకంతకీ గుండెదిగులు జాస్తియై ప్రాణం బేజారెత్తి తీసిన పరుగులూ, వస్త్రైరాలువిని నవ్వనివారుండరు. ఈ పిరికి తనానికితోడు అతనిలో చూపిన మితిమీరిన మూఢమతిత్వం. ఎంతచెప్పినా గ్రహించలేక పోవడం, ఏడుస్తూ కూడా తాను రాజుననే వ్యర్థాభిమానంతో మాట్లాడడం, వస్త్రైరాలన్నీ కనికరించి నవ్వించే విషయాలు. ఈ పాత్రని హాస్యానికి వినియోగించి తిక్కనగారీ యుద్ధ ఘట్టంలో కలిగే ఏకరసత్వాన్ని (Monotony) తొలగించే నేర్పుచూపెట్టేరు. అర్జునుడు రణోత్సాహంతో దేవదత్తం పూరించాడు. ఫలితం,

" అపుడు నిశ్చేష్టితంబులై హయములవనిఁ
జాపకట్లుగఁ బడియె మత్స్యక్షితీశ
నందనుండును నొగలపై మ్రగ్గిందినట్లు
ప్రొమ్ముగిలఁ జాఁగి పలితంపు మూర్ఛఁ బొందె. "

ఈరకమైన సారధిని బెట్టుకొని ఆయుద్ధం ఎలాచెయ్యడమో అది అర్జునునికే చెల్లింది. ఏదో అవస్థపడి గుర్రాలను, ఉత్తరుణ్ణిలేవనెత్తి, తిరిగి పడిపోతూఉంటే " ఊఁది పట్టి వికృతంబగు రూపము చక్కఁజేసి నెమ్మన మొక భంగితేర్చి" కౌగలించి ధైర్యం చెప్పు కున్నాడు. మళ్లా మళ్లా శంఖాన్ని ఊదే నప్పుడల్లా ముందుగా చెప్పి హెచ్చరికచేస్తూ, ఎల్లాగో అతణ్ణి ధీరుణ్ణి చేసుకొని కౌరవసేన నెదుర్కొన్నాడు. అది ముమ్మరమైన యుద్ధము. మహావీరులతో పోరు, ఎడతెరిపిలేనిపని. అంత కంతకీ ఎక్కువైన వీరా వేశంతో యుద్ధం చేస్తున్నాడు అర్జునుడు. అలాటి సమయంలో ఉత్తరుడతనితో అనిన మాటలివి.

" ఉడుకువ లేని కయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు దప్పివు
ట్టెడు నొకమాటు నాగ్రహము డింపవు నీవును జక్కసేసి ఫ

ఛ్ఛవి గలపంగ వెండియును జండితనంబున వచ్చి వచ్చి పో
రెడు మోన బింకఁజాల నోవరింప సమద్రభుమూకకృత్యముల్. "

ఇలా రాజీనామా పెట్టే సారథిని, అతనిని నమ్ముకొన్న రథికుని, చూస్తే దెబ్బలు తిని ఏడుస్తున్న ప్రతిబలం లోని వారు కూడ, ఏడుపులు మరిచిపోయి, అధమం ఓసారైనా నవ్వకుండా ఉండలేరు.

ఈఉత్తర గోగ్రహణ ఘట్టంలో తిక్కనగారు హాస్యానికి చేసిన జాగా ఎంతైనా ఉంది, మొదట ఉత్తరునిపాటు, బృహన్నల రూపు మాసి కౌరవబలంలో కలిగిన కలకలమూ, తరువాత అర్జునుడని అనుమానించి నప్పుడు పొందిన కలవరమూ, అజ్ఞాత వాసమితి పూర్తి అయిందా? లేదా? అని పడిన సంశయమూ, సంశయవిచ్ఛేదమైనాక సంబరాలన్ని అడగిపోయి సర్దుకోవడములో 'నువ్వంటేనువ్వూ' అని ఒకరినొకరు నిందించుకొని పొందిన అలకలూ, వగైరాలన్ని సాముదాయకంగా నవ్వు గొల్పేవిగానే ఉన్నాయి ఇక యుద్ధంలో సిగ్గువిడిచి పారిపోయిన వీరు లెప్పుడూ నవ్వుల పాలే అవుతారు.

"వెఱచితిరేని నిల్వుఁడొక వీరునకొక్కఁడ చాలుఁగాక యొం
డెఱుఁ వలయుం గపిధ్వజము దవ్వుల వ్రేల్మిడి, ద్రుంచివై చెదన్
బఱపెదఁ దత్పిశాచముల భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నెఱఁకులు నొంచెదం బొదులు నించెద నర్జునగాత్ర శాలలోన్."

అని ఎంతో బింకంగా పలికిన కర్ణుడు, చివరికి యుద్ధంలో అర్జునుని ధాటికి తట్టుకోలేక బీరాలన్ని విడిచి 'వెఱచఱచి' 'పుడమియద్రువ, మత్స్యపతి సుతుఁడార్వ'గా పరిగెత్తినాడనివిన్నప్పుడు, యింత కంటె, చిన్నవాడు గాబట్టి, ఉత్తరుడే మేలనిపిస్తాడు. ఇదియిలా ఉంచి, యీ సందర్భంలో, అదునుకనిపెట్టి, యుద్ధానికి పురిగొల్పుతూన్నట్లుగా కర్ణునితో అశ్వత్థామ ఆడిన మాటలు వింటే యింకా నవ్వు వస్తుంది. అందులో తిక్కనగారి అవహేళనా చాతుర్యం మూర్తీభవించింది.

"వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన
మేమి సేయు వార మీవు దక్క
నొరులు నిలువరింప నోపెడు వారలే
గోటు లేక తాఁకి యోర్వ వలయు, "

ప్రతిపక్షము వారిభంగపాటు సర్వసాధారణంగా హాస్యాన్ని గొల్పేదిగానే వర్ణింపబడుతుంది. కాని తిక్కన గారు కేవలము భంగపాటు మాత్రమేచూపి ఊరుకోరు. అల్లరిచేసి, కేరింతాలుకొట్టి, చప్పట్లు చరిచి, గేలిచేసి విడిచిగాని ఆయనకు సరదాతీరదు. అర్జునుని ధాక కాగలేక, వెన్నిచ్చి వచ్చిన త్రోవనే పట్టి వెనుకకు మళ్లుతూన్న కౌరవ సేనకుచేసిన పరాభవం చూడండి.

" వెనుకొని కర్ణుని వెసఁగలయును దుశ్శాసనుని వీఁపు నొక్కొక్కశరం
బున నేసె. "

ఇది అర్జునుని సాహసం, దీనికి మారుచేతామని చెప్పే కర్ణుని మాటలెవరూవినరు. అది చూచి దైన్యంగా రాజరాజు భీష్మాదులతో,

" లోకంబుతోడివారుగ
మీకుం జనునయ్య మగఁటిమికి గుటిగాదే
నాకెడకైన యెడం దగఁ
జేకొని యాది మీరు చక్కఁజేయుట యరయన్. "

అని వాపోయినా ప్రయోజనం శూన్యమే అయింది. అతనికి మిగిలినవి వారి ఆశ్వాస వచనాలు మాత్రమే. దీనికితోడు వెనుకనుండి అర్జునుడు, పేరెత్తిపిలచి "వేడ్కలు సలుపఁగలదె, కయ్యమునకోడిపోయినఁ గౌరవేంద్ర" అని ఆడిపోస్తూ " వినుము నాబుద్ధి " "తొల్లింటి చూడఁగలదె, జూదమిచ్చట నాడంగరాదు" కనుక "యీ తనువు విడిచి సుగతి వడయుము" అని ఉపదేశిస్తాడు. దుఃఖపడి తిరిగి తలపడితే సమ్మోహనాస్త్ర ప్రయోగంతో చావు మూర్ఛకు గురిచేసి, తలచీరలు కోయించి. ఎడంగానిలబడ్డాడు అర్జునుడు. మూర్ఛ తెలిసి తిరిగి మార్కొందామనే ఉబలాటం చూపుతూ ఉన్నవారి మూర్ఖత వారికే వెగటు గొలిపేలాగున భీష్ముడాడిన మాటలివి.

" మోహనబాణ పాతమున ముం దలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతోఁ గడగిపార్థునిఁ దాకెదు బుద్ధిఁద్రిమ్మరన్
సాహసవృత్తిఁజేసి యవిచారతఁబోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనలనందఱ నొక్కట మార్గణాగ్నికిన్. "

ఈ మాటలు విని ముందుకెత్తిన కాలు వెనక్కి దింపి, తల చీరలు తడవి చూసుకొంటూ ఉన్న వారిని చూసి ఉత్తరుడెంతైనా నవ్వి ఉంటాడు.

కుత్సితుల ఊహలు, ఉద్దేశాలు, ఎత్తులు, ఏడుపులు వగైరాలేవీ మనకు నచ్చవు.
వాటితో పాటుగా ఆయావ్యక్తులుకూడా నశించాలనే భావం అందరూ ప్రకటిస్తారు. కాని
యీ విధమైన అమర్షంకూడా వారి అవమానంగాని, ఆశాభంగంగాని చూసినప్పుడు హర్షంగా
మారి నవ్వుకి తోవ ఏర్పరుస్తుంది. మరోలా ప్రతీకారం చెయ్యలేనప్పుడు, అపహాసాన్ని
ప్రయోగించి, నవ్వి కొంత గుండెబరువు దింపుకొని తుష్టిజెందడం మనకి పరిపాటి.
అయితే యిలా నవ్వడానికి అన్నిచోట్లా అవకాశం యిస్తూ దుర్జనులకి
అవమానాదులు జరగవు. ఎదుటబడి అపహాసంకూడ చెయ్యలేము. అలాంటి సందర్భాల్లో
మరొకరెవరైనా వారిని హేళన చేస్తేచాలు మనకిప్రసన్నత కలుగుతుంది. ఆ హేళన
చేయటంకూడా విస్పష్టంగా ఉండనక్కరలేదు, అణుమాత్రమైననాచాలు, హేళన చేసేవాం
హృదయం మన కవగతమై వారితో మనకి భావసామ్యం కుదిరి, మనచిత్తం వికసిస్తుంది.
ఈ తత్వాన్ని తిక్కన్నగారెన్నో చోట్ల వినియోగించి పాఠకుల్ని నవ్వించేరు. ధృత
రాష్ట్రుని కుత్సితపు ప్రవృత్తికి తగిన మందు విదురసంజయాదుల ఎత్తిపొడుపు మాటల్లోనే
అందించారు. పైగా తలవాచినట్లు చీవాట్లు తింటూన్న ఆ వ్యక్తిమూర్తి విశేషంకూడా
మనకళ్లముందుపెట్టి నవ్వించటం తిక్కన్నగారు ఎన్నడూ మానరు. ఇదే విధంగా దుర్యోధ
నాదుల అడియాసలు, అందుకోలేని పరుగులు, అందక పడినపాట్లు, ఇంకొరితో చెప్పుకొని
ఏడ్చినఏడ్పులు, ఎడాపెడా దెబ్బలు లగిలినా విడవని మొండిపట్లు మొదలైనవి వర్ణిస్తూ
న్నప్పుడు ఆ యావ్యక్తుల ఆకృతి విశేషాలుకూడ, అప్పటికేర్పడిన అంగభంగిమాలతో సహా,
మూర్తికట్టి ముందుకుతెచ్చి చూపి నవ్వించటం, యీ కవిలో ఉన్న విశేషం మరొక
చిత్రం, యీ విధంగా నవ్వించటం అటు కౌరవబలంలోని వారిని చూపి మాత్రమే కాదు.
పాండవబలంలోని వారు కూడా యిట్టి అపహాస్యానికి పాలయినవారే. ముందువెనుకలు
చూడని దుస్సాహసం, చేతగాని శౌర్యం, వేరొకరిని నమ్ముకొని చూపిన బింకం, అది వికటిం
చిననాడు పొందిన దైన్యం, ఎంతచెప్పినా విడువని మూర్ఖత్వం వంటివి ఎక్కడ కనపించినా
తిక్కనగారు హేళనచేయడానికే చూస్తారు. కొన్నిచోట్ల యీ వెక్కిరింపుగాని,
వేళాకోళంగాని మాటలలో ఉండును. ఆ యా సన్నివేశాల్లో ఉన్న తత్తత్పాత్రలను
ఆంగిక వాచికాది ముద్రలలో సహా వర్ణించి, వికృతి మనకు స్పష్టపడేదాకా తెరదింపకుండా
చిత్రాన్ని మనకళ్లముందు నిలబెట్టి, వర్ణన పొడిగించి, హేళన చేయవలసేపని మనకు విడిచి
పెట్టి, తాను తప్పుకోవడం తిక్కన్నగారిలో ఉన్నమర్యాద. ధర్మరాజు పట్టాభిషేకం
పొందవలసినవాడు, ఏడుపులుడిగి నవ్వవలసే సమయం వచ్చింది. కాని ఆయన ఏడుపు
మానడు, పశ్చాత్తాపం అంతా వెళ్లబోసుకుంటూ రాజ్యానికి విముఖుడై కూర్చున్నాడు.

ఎవరేంత చెప్పినా వినడు, శ్రీకృష్ణుడు బోధించాడు. అర్జునుడు మనవి చేసేడు. భీముడు మందలించేడు, నకుల సహదేవులు ప్రార్థించేరు. కాని ప్రయోజనం సున్న, తిరిగి అర్జునుడు సుదీర్ఘంగా ఉపన్యసిస్తూ, లోకధర్మం, రాజధర్మం వగైరాలు బోధించి, కృష్ణాదుల పలుకు లుగ్గడించి, మనసు మార్చుకోవలసిందని ప్రతిమాలేడు. అతడు మాటాడు తూన్నంతసేపు ధర్మరాజు తలవంచి కూర్చొని, చెప్పతూన్నది వెడవెడగాని, ఏదో ఆలోచిస్తూ అంతాఅయిన పిదప " సేమపు దెరువొక్కటిగలదే మెచ్చితి, దాని నడుసు మెయ్యది యని సుత్రామసుత! అవి ప్రారంభించి, "అడుగకున్నను నేమి వినుము చెప్పెదను మునీంద్రుల కెక్కన్" అని సునిశ్చయుడై చెప్పిన మాట తా నడవికి పోతానని, ఈ మూర్ఖపు పట్టుచూసి నవ్వటమో; ఏడ్వటమో భగవంతునికే ఎరుక ! ఈ 'సేమపు దెరువు' మొదటే చెప్తే బంధువర్గమంతా క్షేమంగా ఉందురే, అంతా అయిన వెనుక యిప్పుడీయేడుపు ఎవరిని సంతోషపెట్ట డానికి? విసుపు, చికాకు, అన్నీ కల్గి నిట్టూర్చి భీముడతనితో.

" నీవడవి కరుగనోడబడీ
నీ వెనుకన వచ్చునపుడు నిందింతురు మ
మ్మీ శ్రెరులితని మాన్పం
గావలతులుగారయని జగజ్జనులధిపా." అని చెప్పి,

మునుపటికీయన, అతనితోపాటు అడవికి పోవటం కూడ 'సేమపు దెరువు' కాదేమో అని సూచించాడు. వారతనిని విడువలేరు విడువక మానలేరు. ఆ విషమ పరిస్థితిలో ఉన్న తమ్ములనూ, వారినందులోనికి దింపిన అన్ననూ చూస్తే నవ్వు, కోపం, ఏడుపూ, అన్నీ ఒకేసారి వస్తాయి. ఇంత సూక్ష్మమైన హాస్యం అన్యత్రా దొరకడం కష్టం అస్తు. వెనుక కొన్నిచోట్ల తిక్కనగారి హాస్య ప్రసంగాలుదహరించాను. వాటిలోనూ, యీపైన చూపిన వాటిలోనూ కూడ తిక్కనగారు హాస్యాన్ని ఏట్లు పోషించినదీ సహృదయులు గమనింపక పోరు. ఆలంబనాన్ని వర్ణించేతీరు, వికృతిని ధ్వనించే నేర్పు, హాస్యప్రదమైన సన్నివేశాన్ని సమకూర్చే చాతురి, వ్యంగ్యపూర్ణమైన వాక్చమత్కృతి, వగైరాలితని హాస్యాని కెంతైనా వన్నె బెట్టేయి.

ఎర్రాప్రెగడ కవితాశక్తిలో నన్నయ తిక్కనలకెంత సన్నిహితుడో హాస్యంలో కూడ అంతే సన్నిహితుడు. ఇతనిది చాల ముక్తసరి అయిన పద్ధతిలో చాల సరసమైన హాస్యము. ఘోషయాత్రకు బయలుదేరి, తాము తీసిన గోతిలో తామే పడిన కౌరవుల నుద్దేశించి భీముడాడిన మాటలు విని తీరవలసినవి. పరాభూతుడైన రాజరాజు యింటికి

పోయి పశ్చాత్తప్తుడై ఉన్న సమయంలో, అతడు పాండవులచేత విడిపించబడి యింటికి తిరిగి కుశలంగా రాగలిగినాడనే విషయం తెలియక, కర్ణుడు అతనిని చూసి, గంధర్వులను జయించి వచ్చాడనే భావంతో ఆశ్చర్యానందాలు పొంది, పొగడ నారంభించినపుడుగాని, ఆ పొగడ్తలు విని ఏడవలేక, నవ్వలేక ముఖం దించుకొని కూర్చున్న దుర్యోధనుని అవస్థ చిత్రగించినప్పుడుగాని మనకు నవ్వు ఆగదు. ఈ కవి వ్రాసిన హరివంశంలో కూడ చక్కని హాస్యం దొరుకుతుంది. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు వర్ణించినపట్ల వాత్సల్య రసాంగమైన హాస్యం ఎంతో చక్కగా ధ్వనించబడింది.

> " కలయఁగ పాలుపిండి పులకండము వెన్నయు జెట్టి యట్టులై
> యలరడ వండితిన్ బతియు నాత్మజులున్ బ్రియపడ్డ నాలుగే
> నలుగుల దొంతిడించి యవియన్నియు నుగ్మలి, నీ తనూజుఁడో
> ప్పులు వడ్రమింగెఁ జోద్యమిది బూతములున్నవి గాక కద్దునన్,
> మగఁడింక నన్ను సైచునె
> దిగవిడుచుం జంపుఁ గాక తెల్లము మది న
> మ్మఁగ పుట్టునె యిది చెప్పిన
> మెంగమాటన మనపుచుండి మూసితి పబలా. " అని

ఈ మొదలుగా గల గోపకాంతల ఫిర్యాదులు విన్నప్పుడు యశోద కూడ వారి వీపువెనుక నవ్వుకొనే ఉంటుంది.

వాక్చమత్కృతి చూపి హాస్యం ధ్వనించడంకూడ యీ కవిలో తరుచు కనిపిస్తుంది. ఈ క్రిందవి శ్రీకృష్ణుడు కుబ్జతో ఆడిన మాటలు.

> " నిన్ను నీవ పొగడుకొంటె మాకు మెచ్చు వచ్చునే నీచేతి
> గంధంబిచ్చినం బుచ్చుకొని మరి బూసెదము మెచ్చిపో
> యి రాజరంగంబున మెరసి నీవారమై యుండుటయెప్పుడె. "

లోభత్వం, పిరికితనం, చాపల్యం, వగైరా మానవ సహజమైన లోపాలను చూపినవ్వించుట కూడ ఎర్రనగారికి ప్రియమైనదే. భరద్వాజ వామదేవులు కృష్ణ దర్శనార్థమై వచ్చి యమునానదిలో దిగుటకు భయపడి, అక్కడ ఉన్న గోపబాలురతో, " ఈ యుత్తమ తీర్థంబునకుఁ డిగ్గు తెరువేది ? నాగనక్రవర్జితంబగు రేవు గావలయునాకు తెలుపు " డని అడిగినప్పుడు ముముక్షువులైన వీరికిగూడ మృత్యు భయమేనా? అనే ఉద్దేశంతో ఆ పిల్లలు

అల్లరికి దిగి "నేనెఱుగ కీని నడుగుడం చెల్లవారు నొండొరులఁజూపి యొండొండనరిగి" కొంతసేపు క్రూర వినోదంచేసి నవ్వుకుంటారు. అ క్రూరుడు బయలుపెట్టిన శ్యమంతకమణికై లోభించి లోలోన ఉవ్విళ్లూరుతూ, లోని ఊహ బయటకు వ్యక్తంగానీయకుండా మెలిగిన కృష్ణాదులుకూడ కవిగారికి హాస్య భాజనులుగానే కనిపించేరు.

"ఎల దేవుఁడేది నాకుఁ బద్మనాభునకును బొత్తుల సొమ్మను బుద్ధిసేసె
సత్యభామ మఱియు జనకుని పడసిన యర్థంబునను జేరునని తలంచె
నగ్రజుఁ బ్రియురాలి నాస్మఁ జూపకె కృష్ణుఁ డొక్కింత వడి కోర్కె
నుదిలకొనియె
సకల యాదవులును సస్పృహాలోకన స్మేర విస్మిత రసస్తిమితులైరి."

అని చెప్పి వేరువేరు వరుసల అందరినీ చూపి నవ్వుకొన్నాడు కవి. కాని యీయనలోగల విశేషమేమంటే, హాస్యంకోసమని యితడు ప్రత్యేకించి ప్రయత్నం చేయడు. సందర్భము వచ్చినప్పుడు మాత్రం హాస్యాన్ని జారవిడుపడు. ఆ హాస్యమైనా అతి నిర్మలమైనది. వ్యంగ్య హాస్యంకూడ మృదులాతి మృదులంగా ఉంటుంది. చిరునవ్వును మించి వెళ్లటం యితనికి కిట్టదు.

భారత కవుల తరువాత ఒక్కని హాస్యాన్ని తగు మాత్రమైనా అందించిన కవి నన్నెచోడుడు. భాషలోనూ భావంలోనూకూడ యితని శైలి ఒక ప్రత్యేక మార్గాన్ని పట్టి నడిచింది. హాస్యము సైతము అట్లే ప్రత్యేకత గడించుకొంది. ఇతడు రాజు, లోకజ్ఞత విశేషముగా కలవాడు. రాజసమున్నా హృదయంకూడ ఉన్న వ్యక్తి. మతావేశంతో వ్రాసిన కావ్యమే అయినా, యితని కుమార సంభవము మడిగట్టుకొని కూర్చొని వ్రాసినది కాదు. అందుకే మనకు ఆమాత్రమైనా హాస్యం లభిస్తూంది. ఇతని హాస్యములోగల విశేషం, మనమనుకోని చోటమనల్ని నవ్వించటం. శంకరుని మీద దండెత్తిపోవటం తగదనిన్నీ, బలవద్విరోధము ప్రాణాంతకమనిన్నీ, తన మనస్సు పరి పరి విధాల కీడు శంకిస్తున్నాదనిన్నీ చెప్పి రతీ దేవి తన మగనితో, శివుని తపస్సు భంగంచేయ టానికి పోవద్దని బ్రతిమాలి బహుమాలి చెప్పే మాటలో నవ్వుకి న్యాయతః యితర కవులెవరూ జాగా చెయ్యరు. కాని నన్నెచోడునికి యీ ఆడవాళ్ల ఉపదేశం, రాజసానికీ, తీవికీ, విరుద్ధంగా కన్పించింది కాబోలు! అతడు రతిచేత పలికించిన పలుకులలో మన్మధుని బ్రతుకెంతైనా హాస్యభాజనంగా చూపబడింది. పైగా ఆమె మాటలత్యంత స్వాభావికంగా ఉండి నవ్విస్తున్నాయి.

" ఆ నాకంబున గలయ
మ్మానినులందఱును నీకు మనమిడి యున్నం
దానిసహింపక సురవిభుఁ
డీనెపమునఁ జంపఁదలఁచి యీపనిఁబంచెన్.
నినుఁజూచిన కన్నుల సుర
వనితలు దనుఁ జూడ కున్న వాసవుఁ డలుకం
జని చావన్ బంచినఁ జాఁ
జనునే యాతని చలం బసాధ్యముగాఁగన్."

అని ఆమె అటు దేవాంగనలనూ, దేవేంద్రునీ కూడ స్త్రీ సహజంగా నిందిస్తుంది. కాని యీ మాటలకు మన్మథుడు లొంగక పోయేసరికి, నిర్మొహమాటంగా

" అతనిశరాసనంబు గనకాచల మిక్షుశరాసనంబు నీ
కతనికి నమ్ము పాశుపత మంటిన గందెడు పువ్వులమ్ము నీ
కతఁడు పురాపహారి విరహాతుర పాంథజనాపహారి వీ
వతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయి నెన్ని చూచినన్."

అనిపలికి అంతతో ఊరుకోక

" ఆఁడుదాన నబలనైన నేనించుక
యలిగి చూచుడును భయమునఁదలరు
దుగ్రు నుగ్రలోచనోద్భూత వహ్నికి
నెదిరి నిలుపనీకు నెంతకోలది."

అని సాపహాసంగా బెదిరించి, చాలదని యింకా యీసడించబోయి,

" కొని బాలురైనను దిని పిప్పి యుమిసెడు చెఱుకు విల్లని నమ్మి చేతబట్టి
మొలతల తల నెండ్రుకలఁ బొంది కందెడు నలరు పుష్పములమ్ములని తలంచి
తలిరాకులైనఁ గదల్పనోపని మంద పవనుండు నొకపెను ప్రాపుగాఁగ
నబలలు సోపిన నాకాశమునఁ బాఱు నవిశుకములు మూల బలముగాఁగ

నెంత వేసవి ముట్టిన నెండఁ గమరు
నను వసంతుఁడు పగు సహాయంబుగాఁగఁ
గాకిపిల్లల కోడుకేకలుఁ బోటు
మగలుగానుగ్రుపైఁబోవఁ దగునె మదన.”

అని అంటుంది. ఇదే విధంగా ఋతువర్ణనలో నవ్వుకి జాగా చేయటం కూడ, హాస్యాన్ని అప్రత్యాసితంగా అందించడమే అవుతుంది. ఋతువర్ణన చేస్తూన్న సందర్భంలో అతిశయోక్తులు కూర్చటం మన కవులందరిలోనూ కనిపిస్తుంది. అసలు అతిశయోక్తి కవిత్వానికి ఒక అంగమూ, అందమూ కూడాను. భావాన్ని స్ఫుటంగా మనస్సుకి పట్టేలా అందించడానికి అతిశయించి వర్ణించటం చాలా అవసరం. అయితే అది మోతాదు మించివెళ్లినట్టయితే హాస్యాస్పదమై కావ్యాన్ని నీరసం చేస్తుంది. నన్నెచోడుని గ్రీష్మర్తు వర్ణనలో అతిశయోక్తులు యిలా హాస్యాన్ని గొల్పేవి గానే ఉన్నాయి. కాని విశేషమేమంటే కవి స్వతః వాటిని హాస్యం కోసమనే అలా వ్రాసినట్టు కనిపిస్తూంది. ఆ కారణంచేత అవి సరసంగా ఉంటున్నాయి.

“ తలచిన డెందము గందును
బలికిన నోరల్లఁ బొక్కుఁ బ్రభనూచిన రె
ప్పలు గమరుననఁగఁబటుతర
విలయానలభాతి నెండ వేసవిఁ గాచెన్.
హరి శరధిఁ గ్రుంకె నభవుడు
సురనిధిఁ దలఁదాల్చె నబ్జజుఁడు గ్రిమ్మఱ నం
బురుహంబు సొచ్చె నతిదు
స్తర దుస్సహ తీవ్రతర నిదాఘ భయమునన్. ”

పరాజితులైన వారు రణరంగాన్ని విడిచి పారిపోవటంలో పడే తత్తరపాటు, పోతూ పోతూ పడే ఉలికిపాటు వంటివి హాస్యానికి పరంపరాగతంగా వస్తూన్న ఆలంబనలు. కాని స్వయంగా తాను రాజై, పరరాజులను పారద్రోలడంలో ఎంతైనా ఆనందించగల వ్యక్తి కాబట్టి నన్నెచోడుడు దక్షాధ్వర ధ్వంస వేళలో ప్రాణాలరచేత బెట్టుకొని పారిపోతూన్న దేవతల సొంపుచూచి మనస్సారా నవ్వుకొన్నాడు.

“ ఇక్కుముట్టి చక్కి నెక్కంగ మఱలి సం
భ్రమముఁ బొంది పిఱుదఁ బ్రమథగణము

లార్వఁ బోతుమీద నడ్డంబుపడి యుప్పు
పిటికి వోలె వెఱచి పఱచె జముఁడు.
తన యెక్కిన మానిసిదా,
ననయము నెక్కింగి మఱచి యూతనిఁ చనమూ
పునవిడికొని పఱచె భయంబున
ధనపతి తన్నుఁబొఱుడ భూతము లార్వఁగ. "

ముందు వెనుకలుచూడకుండా, కోపంతో మొదట మన్మథుని దహించి, పిదప శంకరుడు పడిన పశ్చాత్తాపము కూడ యీ కవికి వెక్కిరింపుగానే వర్ణించాలనిపించింది.

" హిమవంతుఁ డింతి నా కీఁ దెమ్ముఁ డెఱిఁగియు నా మాటలే నేల
యాడనైతి
నతఁ డొండునానోడి యూవ నా కడనుంచి యేఁగిన కన్నెల
యెఱుఁగనైతి
నాబాల ననుగూడ నాసించుచున్నచో మిన్నక తపమేల పన్నికొంటి
వెలనాగనామీద నెలయింపవచ్చిన భావజుతో నేల పగయుఁగొంటిఁ
దరుణి వలరసంబు దఱిమిపైఁ బడనున్న
నెఱనెఱింగి కూడ నేరకేల
బేలనైతిననుచు బాలేందు ధరుఁడాత్మ
చింతమాని విరహచింతఁ దగిలె. "

పార్వతిని పరీక్షించి పరిణయమాడగోరి వచ్చిన శంకరుడు, వటువుగా నటిస్తూ తనను తానప హాసించుకొంటూ ఆడినమాటలీ క్రిందివి.

" తోడవులు చివికిన యెమ్ములు
గుడిముట్టు గపాల మిల్లు గుడి ముడి యెద్దె
క్కుడు గట్టు వలువు దోలగు
బడదునకైనవయ నేమి ప్రళయము వచ్చెఁగా. "

"ఏమి ప్రళయము వచ్చెఁగా" వంటి జాతీయ ప్రయోగాలు యీకవి హాస్యానికి ఎంతగానో వన్నె తెచ్చేవిగా వాడబడ్డాయి. తపస్సు చేయబూనిన పార్వతిని వారిస్తూ పలికిన బంధుజనుల మాటలలో యీవిధమైన జాతీయాలెన్నో నవ్వు పుట్టించేవిగా ప్రయోగించబడ్డాయి.

ఆటవికుల రూపాదులు నాగరికులకు నవ్వు గొల్పే విధంగా వర్ణించటం, వధువుకోసం వరులు పడేపాట్లు పూస గ్రుచ్చినట్లు వర్ణించి హేళన చేయటం, నారదుని కలహాశనత్వాన్ని హాస్యాస్పదంగా విస్తరించి వర్ణించటం, వగైరాలెన్నో యీకవి హాస్యప్రియతకి ఉదాహరణాలు చూపవచ్చును. భక్త్యావేశంతో వ్రాసిన కావ్యాలు, యీమాత్రమైనా హాస్యాన్ని అందించిన కవి మరొకడు కనపడడంటే అతిశయోక్తి కాదు.

రామాయణ కవులైన భాస్కరాదులలో హాస్యంకోసం ప్రత్యేకంగా చేసిన ప్రయత్నంగానీ, అందుకైన వాగ్విలాసంగాని కనపడదు. అయితే వానరులను వర్ణించే పట్లు కొన్ని సహజంగా హాస్యాన్ని గొల్పేవి కథలో తటస్థించేయి. ఆయాపట్ల వీరు విస్తరించి వర్ణించి చక్కని హాస్యాన్ని అందించేరు. మధువనంలో చేసిన అల్లరులు, దధిముఖుని పరాభవించడంలో చూపిన హర్షామర్షాలు, వారధిబంధనంలో ఒకరినిమించి ఒకరు పంతగించి ప్రదర్శించిన పౌరుషాలు, తీరుబడి సమయాల్లో కావించిన స్వాభావిక చేష్టలు వగైరాలెన్నో వానరులలో హాస్యానికి ఆలంబనంగా తీసుకొని వర్ణించబడ్డాయి. అంగదరాయబారం వంటివి లోకంలో హాస్యోపమానాలుగా వాడబడుతున్నాయి. కుంభకర్ణుని ఆకారాన్ని గాని, అలవాట్లనిగాని వర్ణించేపట్లుకొన్ని నవ్వు గొల్పేవేకాని ఆనవ్వు ఆశ్చర్యంలో అణగిపోతూంది. శూర్పణఖ తీరుకూడ యిదే చందంగా తయారైనది. మారీచుడు రావణునికిచ్చే ఉపదేశంలో స్వల్పంగా హాస్యం ధ్వనిస్తూంది కాని అక్కడకూడ గాంభీర్యం హెచ్చుగా ఉండి నవ్వుని తలెత్తనివ్వకుండా ఉంది. మారీచుడు రావణునితో తన స్వానుభవం చెప్పి రాముని పరాక్రమాదులుగ్గడించిప్పుడు మనలో ఉదాత్తభావాలులేచి, ఆతరువాత మాటలలో "రణరథముఖరేఫాదిక ఘణితి ప్రారంభణమున పరహృదయభిదాచణ మగు రామాఖ్యోచ్చారణ" మని బెగడుతున్నానని చెప్పినప్పుడు న్యాయంగా మేల్కొవలసే హాస్యానికి అవకాశం కలిగించకుండా ఉంటున్నాయి. సుగ్రీవుని మూర్ఛలో మునుగునంతగా చావు గ్రుద్దుగుద్ది, మూపునవేసుకొనిపోతూఉన్న కుంభకర్ణుని చూసి బెంబేలు పడిన మన హృదయం, మరుక్షణంలోనే సుగ్రీవుడు తెలివొంది, కుంభకర్ణుని ముక్కుచెవులు కొరికి దాటి రావటం చూసి ప్రసన్నతజెందుతుంది. దీనికి తోడుగా ఆ పరిస్థితిలో ఉన్న కుంభకర్ణుని చూసి, అతడు వెనుకకు పోలేక ముందుకు రాలేక, ఏమిచేయడానికి పాలుపోక నిశ్చేష్టుడై నిలబడటం వల్లనైతేనేం, చెల్లెలిముక్కు పోయినదని ఏడ్చి యింతగా రంగిడీ తెచ్చిపెట్టుకున్న అన్నగారికి యీ తన ముక్కిడి మొగాన్ని ఏమొగంబెట్టుకొ చూపడమని తర్కించుకుంటూ ఉండగా వినిఅయితేనేం, మన ప్రసన్నత హాస్యంగా మారుతూంది. ఇలాటి ఘట్టాలు అక్కడక్కడ ఒకటిరెండు ఉన్నా మొత్తంమీద చెప్పవలసివస్తే భాస్కరునిలోగాని

రంగనాథునిలోగాని చెప్పదగినంతగా హాస్యం లేదనే అనాలి. అయితే ఉన్నంతమట్టుకు చక్కని హాస్యమే ఉంది.

పాల్కురికి సోమనాథుని బసవ పురాణంగాని, పండితారాధ్య చరిత్రగాని హాస్యానికి అవకాశం యిచ్చే గ్రంథాలుకావు. అక్కడక్కడ ఆలంబన వర్ణనంలో వికృతులు చూపే ప్రయత్నం కనిపిస్తూందిగాని ఆయాచోట్ల హాస్యానికి బదులు అద్భుతమో బీభత్సమో తారసపడుతూంది. సూరసానమ్మ కథలో శివుడు ఘండాలవేషంతో రావటం, అతనిని సూరసానమ్మ ఆదరించటం, అది బ్రాహ్మణులకు నచ్చకపోవటం, వారు ఎక్కడలేని వెర్రిమొర్రి ఆవేశాలకి, అభిప్రాయాలకి గురియై ఆర్భటంగా బయలుదేరి మొత్తపడిరావటం, రాజుకామెను మాలవానితోసహా పట్టి అప్పగించడానికని సర్వసన్నాహాలు చేసి తుదకా ప్రయత్నాలన్నీ భగ్నమయ్యేసరికి తెల్లబోవడం వగైరా ఘట్టాలు సహజంగ నవ్వుక జాగా యిచ్చేవే అయినా కవి వాటిని సరిగా వినియోగించలేదు. భక్త్యావేశంలోపడి వీరాద్భుత బీభత్సరసాలకి ప్రాధాన్యమిచ్చి హాస్యాన్ని దిగవిడిచేడు. మిండజంగాలను వర్ణించినచోట కొంచెము హాస్యం ధ్వనించబడింది కాని అది అంత సరసంగాలేదు. పైగా, ఏదో ఆవేశంతో వర్ణించినట్టుంటుంది.

" చందనకావులు సరిసాటికావు
లందంబులగు కటికెంపు కావులును
పలిపొత్తి పచ్చడంబులును గాపీన
ములు మీద గూడ కట్టులుగానుపింప..........
రారోరి బగుత తేరా లంజకనుచు
బసవన్న కరుణరా బగుత నీ కనును."

వగైరా పంక్తులు చూస్తే కవిగారికి యీ మిండజంగాలు కేవలం హాస్యానికే గాక హర్షాద్భుతాలకి కూడ ఆలంబనగానే రూపించినట్టు తోస్తూంది.

మారనగారి మార్కండేయ పురాణంలోగాని కేతనగారి దశకుమార చరిత్రలోగాని హాస్యంకోసం వెదకడం వ్యర్థశ్రమ. మార్కండేయ పురాణంలో విడి విడిగా తీసుకొని కొన్ని కథలు చూసినట్టయితే కొంత వ్యంగ్య హాస్యం దొరుకుతుందిగాని అది నీతిలాంటిది. పంచతంత్ర హితోపదేశాల్లో కథలుకూడా యిలా నీతిని వ్యంగ్యంగా అందించేవే. ఇంకా వాటిలో పశుపక్ష్యాదులు మానవులకి బదులుగా పాత్రలుగా గ్రహింపబడనందున, హాపకాన్ని

తొలగించి చూస్తేనా కొంత ఆనందించవచ్చు. కాని యివేవీ హాస్యమనిపించుకోవు. కేతన గారి దశకుమార చరిత్ర పద్యంలో వ్రాయడమే హాస్యప్రదమైన సంగతి. ఈ కథలలో ఉన్నదల్లా యుక్తిచాతుర్యం మాత్రమే. కథాకల్పనలో ఉన్న నేర్పు, ప్రపంచాన్నంతటినీ కథలోకి దింపినట్లు ప్రసంగ ప్రాప్తమైన విటకితవ వేశ్యాకంచుకి ద్యూతకార చోరాదుల స్వభావాలన్నీ అత్యంత సహజంగా, అద్దంలో చూపినట్లు వర్ణించిన ప్రతిభ చూసి మెచ్చుకో వలసినదే కాని నవ్వడం మాత్రం కల్ల. ఆ యీ వర్ణనలు హాస్యాన్ని గొల్పవలసేవే కాని నవ్వటంగాని నవ్వించటంగాని యీకవి ఎరుగడు. మహాగంభీరంగా కూర్చొని ఊపిరాడని వేగంతో కథని ఏకరువు పెడతాడు. అయితే పాశ్చాత్య సాహిత్యజ్ఞుల దృష్టితో చూస్తే యీకథలలో ఉన్న యుక్తి చాతుర్యంకూడ వికట ప్రజ్ఞ (Wit) అనిపించుకొంటుంది. సింధుబాదు నావికుని కథలో వారికి యిదే విధమైన ప్రజ్ఞ గోచరించింది. వేర్వేరు వర్గాల వ్యక్తులను, వారి ఊహాపోహాలు, బ్రతుకుతెరువులు, బాధ్యతలు, భయాలు, ఆశలు, అభిమానాలు, అన్యాయాలు మొదలైన వాటితో సహా విస్తరించి వర్ణించినట్టయితే అది వ్యంగ్యంగా హేళనచేసి పాఠం చెప్పడం వంటిదవుతుందని పాశ్చాత్య విమర్శకులలో కొందరివాదము. కాని యీ తత్వం మన వారి హాస్య తత్వానికి చాలా దూరము. ఈ తరగతి రచనల్లో కనిపించే చమత్కృతి కేవలము మనః ప్రసన్నతను మాత్రం కలిగించి శెలవు పుచ్చుకుంటుంది. దీన్ని తిరిగి హాస్యంగా పిరాయించగలశక్తి వీటికిలేదు. వీటివల్ల జనించే హర్షం ఏ అద్భుత రసానికో, వీరరసానికో సంచారిగా వచ్చేదిగాని హాస్యానికిగాదు. అసలీ కథలలో హాస్యంలేదు. కథకుని ఉద్దేశం కూడ హాస్యం కలిగించడంగాదు. ఉన్న దల్లా అద్భుతం, అదే కథకుడు మనకిచ్చేది. "రసేసారశ్చమత్కారః" అనే వాక్యాన్ని అనుసరించిచూస్తే "సర్వత్రాప్యద్భుతోరసః" అనే నిర్ణయానికి విధిగా దిగవలసి వస్తుంది.

శ్రీనాథుని మొదలు కృష్ణదేవరాయుని కాలమువరకూ మన తెలుగు సాహిత్యంలో హాస్యానికి కొంతలో కొంత ఎక్కువగా ఆశ్రయం లభించినట్టు కనిపిస్తుంది. ఈ కాలంలో మన సాహిత్యపు పోకడకూడ కొంత మారింది. కవులు విలాసంగా నవ్వి నవ్వించే వ్యక్తులవటంవల్ల, కావ్యంలో చూపిన కొత్త క్రొత్త పోకడల్తోపాటు హాస్యాన్నికూడ అందించడంలో కొత్తదనం చూపేరు. ఈ కాలంలో కూడ పురాణగ్రంథాలు, పూర్తిగాగాని, ఖండాలుగా గ్రహించిగాని వ్రాయబడ్డాయి. పౌరాణికమైన కథనొక దానిని తీసుకొని, దానిని విస్తరించి పెంచి, ప్రత్యేక కావ్యంగా వ్రాయడమనే సాంప్రదాయానికి నాంది నిర్వహింపబడింది. కాళిదాసాదుల కావ్యాలు తెలుగులోకి అనువదింపబడ నారంభించేయి, కొన్ని సంస్కృత నాటకాలు కూడ తెలుగులోకి పద్యరూపంలో ప్రబంధాలుగా మారి

అవతరించేయి. ఫలితంగా కావ్యంలో కథకి ఏక దేశీయత, ఘటనలకి ఐక్యత, పాత్రలకి ఓ నిశ్చితమైన కార్యంలో తత్పరత వగైరాలు చక్కగా నిర్వహించి ప్రదర్శించడానికి వీలు చిక్కింది. కథచిన్నదైనా పెంచి పెద్దజేయవలసే బాధ్యత వస్తు వర్ణనకి దోహదమిచ్చింది. పాత్రల ఆంతరంగిక సౌందర్యోద్ఘాటనతో పాటు బాహ్య సౌందర్య వర్ణనకూడ విస్తారంగా చేయబడసాగింది. ఆ యీ వర్ణనల మూలాన్న కథాగతిలో వేగం మందగించి, కవికి కొంత తీరుబడికల్గి, ఎక్కడైనా ఓ క్షణం నిల్చి, విలాసంగా నవ్వడానికిగాని, వికృతి చూపి మనల్ని నవ్వించటానికిగాని తగినంత అవకాశం దొరికింది. గంభీరముద్ర ధరించవలసే అగత్యం తప్పినందున, హాస్యాన్ని ఆహ్వానించడానికి ఉత్సాహం కలిగింది. ఈ మనస్తత్వాని కనుకూలంగానే యీకాలపు పురాణ కావ్యాలు కూడ వీరాద్భుతాలకి మారుగా భక్తి, శృంగార వాత్సల్యాలకి ఆటపట్టుగా రచింపబడ్డాయి. (వానేది దేవతల చరిత్రే అయినా, నాయకీ నాయకులు పురాణ పురుషులే అయినా, కవులు వారిని అతిలోకమైన స్థానం నుండి ఓ మెట్టుకిందికి దింపి, లౌకిక దృష్టితో చూడ నారంభించారు. దేవతలుగాని, మునులుగాని, మనువులుగాని, మహారాజులుగాని ఎవరూ మన మెరుగని లోకంలో సంచరించే వ్యక్తులుగా లేరు. వారి సమస్యలుగాని సంసారాలుగాని మన మెరుగనివి కావు. ఈ విధంగా లోక సామాన్యమైన రూపం ఏర్పడినందున, వారి చర్యలు చరిత్రలు కూడ మన ఊహకి సన్నిహితమై, సానుభూతికి పాత్రమై, ఓ విధమైన మమత్వానికి ఆశ్రయమైనాయి. వీర రసం నిరసించినందున విలాసానికి ప్రాశస్త్యం కలిగింది. అతిలోకమైన విషయాలుకూడ ఆశ్చర్యానికి బదులు ప్రీతి (రతి) కి ఆలంబనలుగా రూపొందసాగేయి. శృంగారం తెల్ల దుస్తులు విడిచి రంగుదుస్తులలో అవతరించింది. ఆ యీరకమైన భావాలతో తనకుగల అవినాభావ సంబంధంచేతనైతేనేం, అనుకూల్యం చేతనైతేనేం, హాస్యానికికూడ ఆసరా ఎక్కువగా లభించింది.

ఈ కాలపు కవులలో కొందరు రాజాశ్రయం కలవారు. మరి కొందరు స్వతంత్రులు. ఇంకా కొందరు అస్థిరులు. వారి వారి స్థితిగతి సాహచర్య సంపర్కాదులను బట్టికూడ హాస్యం మారుతూ ఉండటం సహజం. భక్తులు వేదాంతులు అయిన కవులుకూడ సంసారాన్ని విడిచి సన్యసించినవాలు కారు కాబట్టి వారిలోకూడ సరసమైన హాస్యానికి ఆదరం లభించింది. శృంగార ప్రియులై, విలాసంగా తిరిగిన కవులకి హాస్యంలేనిదే దినం తీరక పోవడం కూడ సహజమే, మరొక విశేషం, ఈ కాలపు కవులు చక్కని మాటకారులు, తగు మనుష్యులలో ఉన్నప్పుడు ధార్మికులు, తాత్వికులు, సజ్జనుల వలె ఉంటారు. తక్కిన చోట్ల అల్లరిచిల్లరగా తిరిగే రకంలో చేరి సంబరపడుతూ ఉంటారు. అతిలౌక్యంగా మాట్లాడ

గలరు కాని విరసత చూపే వ్యంగ్య వాక్యాలు నవ్వరు. సరసంగా మాట్లాడ్డానికి గాని, జాతీయాలు సామెతలు చేర్చి ప్రయోగించడానికి గాని వీరు చాలా వరకు వెనుకటి కాలపు కవుల కంటె ఎక్కువ అభిరాన్ని చూపారు. ఇది వీరి హాస్యానికి మంచి బలమిస్తూంది. ఈ మాటకారితనానికి తోడు కట్టుకథల వంటి చిన్న చిన్న ప్రసంగాలు కల్పించి, సరసమైన సన్నివేశాలు కూర్చి, కథ చెప్పే నేర్పుకూడ వీరిలో కనిపిస్తుంది. ఈ కల్పనల్లో కొన్ని హాస్య కల్పనలు వింతగా ఉంటాయి. మొత్తంమీద యీ కాలంలో వెలసిన మనసాహిత్యం హాస్యాన్ని చాలా వరకు అదుపుచేసి నడిపించింది. కాని శృంగారం మిశ్రితమై వచ్చిన కారణాన్ని ఎక్కువ మేరకు యీ హాస్యం నకిలీ హాస్యంగా మాత్రం ఉంటూంది.

శ్రీనాథుడు తెలుగు సాహిత్యాన్ని నవీన మార్గాన నడిపిన సారథి. "చిన్నారి పొన్నారి చిరుతకూకటినాడు, పట్టిన ఘంటాన్ని అవసాన కాలందాకా విడువకుండా కవితాసేవ చేసిన భక్తుడు. కవిత్వంలో ఎంత సరసుడో జీవితంలో అంత రసికుడు. తన కాలంనాటి రాజాస్థానాలే కాదు, రసికాస్థానాలుకూడ సందర్శించిన వ్యక్తి. సాహిత్యంతో పాటు జీవితాన్నికూడ విలాసంగా నడిపి కీర్తి, అపకీర్తి రెంటినీ ఆర్జించిన ఘనుడు. అవసాన కాలంలో అప్పుల పాలై అగచాట్లకు గురియైనా 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి' అని చెప్ప గలిగిన మహోత్సాహి. గొంతు తడియారిపోయి నాలుక పిడచగట్టినా అవస్థలోనైనా, ఏడవడానికి బదులు నవ్వుతూ

"సిరిగల వానికి చెల్లును
తరుణుల పదియారువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా గంగవిడుము పార్వతి చాలున్."

అనిప్రార్థించిన ధీరుడు. తననుజూచి ఒరులు నవ్వుతారేమో అనే వదురుగాని బెదురుగాని ఏమాత్రం పొందక పోవడం సరిగదా తనకుతానే నవ్వేసుకొని

"కుల్లాయించితి కోక జుట్టితి మహాకూర్పాసముల్ దొడ్గితిన్
వెల్లుల్లిందిల పిష్టముల్ మెసవితిన్ విశ్వాస మొప్పారగా
చల్లా అంబలి ద్రావితిన్ రుచుల దోషంబంచు పోనాడితిన్
దల్లీ కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్"

అని చెప్పి మనల్నికూడా నవ్వించిన వ్యక్తి. ఈ మహాకవి వ్రాసిన గ్రంథాలు కాక అనేక చాటువులు మనకి చక్కని హాస్యాన్ని ప్రసాదిస్తున్నాయి. వేరు వేరు దేశాలమీద, తత్తత్ప్రాంత వాసుల మీద, అక్కడి ఆహార విహారాదుల మీద, చెప్పిన చాటువులేగాక, కొందరు కొందరు ప్రత్యేక వ్యక్తుల మీద చెప్పిన చాటువులు కూడ హాస్యానికి సంబంధించినవి యీ కవి మన కందించాడు. మరికొన్ని శృంగార చాటువులు హాస్యగర్భితంగా వ్రాసి యిచ్చేడు, కొన్ని అసభ్యంగా కూడ వ్రాసి, రహస్యంగా చదివి నవ్వుకో మన్నాడు, కొంత నవ్వు, కొంత రసికత, కలిపి వీధి నాటకం రచించి తెలుగులో రూపకరచనకి విఘ్నేశ్వర పూజ చేసేడు. విలాసంగా బ్రదికి, విచ్చలవిడిగా తిరిగి, నోరువిప్పినవ్వి, నవ్వించ గల్గిన మొదటి తెలుగుకవి యితడే. నవ్వునాల్గు విధాలచేటు అనేది సూత్రము యితడు గమనించడు, నర్మోక్తులకి తడువుకోడు. అసభ్యంగా మాటాడుతూన్నట్టు అనుమానం కూడ పడడు. వెకిలిచేష్టలకి వెనుదీయడు. తగుమనిషి తరహాకి లోపమొస్తుందే మోననే చింత అణుమాత్రమైనా తనలో ఉంచుకోడు, ఈయన వ్రాసిన గ్రంథాలు కొన్ని అలభ్యాలు, దొరికినవాటిలో పురాణాలు, లేదా పురాణాలకి ఖండికలు, మరికొన్ని స్థలపురాణాలు, ఇతని వ్యక్తిత్వం బాగా బయటపడే కావ్యాలు హరవిలాస శృంగార నైషధాలు. ఈ కావ్యాలన్నిటిలోనూ అంతో యింతో హాస్యముంది. శృంగార నైషధంలో అది హెచ్చుగా ఉంది. అయితే యితనిది రసికహాస్యం. అదికూడ చవుకరకం. హాస్యానికి చేసిన ప్రయత్నం చాలా చోట్ల వెకిలిగా ఉంటుంది. అసభ్యతకూడ అక్కడక్కడ చోటుచేసుకొంది. కొన్ని కొన్ని చోట్ల యితని నవ్వు మనకి సహ్యంగా ఉండకపోవటం కూడ కద్దు.

నైషధంలో పెళ్లివారి విందులు వర్ణించే ఘట్టంలో ఉన్న హాస్యం ముప్పాతిక మూడుపాళ్లు తగుమనిషి తరహాకి చెందదు. కాని సంతోషించవలసే విషయం, యితని ప్రసంగ రచనాచాతురి కోడెకాండ్రు నవ్వు ఎన్నెన్ని వన్నెలు చూపగలదో అన్ని రకాల వన్నెలతోనూ యితడు యీ ఘట్టంలో హాస్యాన్ని చిత్రించేడు. వచ్చిన పెళ్లివారు రాజులు, రాజబంధువులున్నూ, 'యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా' అనే లక్షణాలన్నీ అక్షరాలా పట్టించుకొన్న వ్యక్తులంతా ఓ చోట కూడినప్పుడెన్నెన్ని వికారాలోడి, వెర్రులు గురిసి, సంతసిస్తారో, అవన్నీ యీ ఘట్టంలో మన కీకవి విసుగులేకుండా అందించేడు. ఈ తరహా మనుష్యుల వ్యవహారం ఉత్తములకెప్పుడూ నచ్చదు. కాని వీరికి నచ్చునని వారూరుకోరు. సభ్యతతోపాటు అసభ్యతకి కూడ లోకంలో స్థానం ఉండితీరుతుంది. ఈ అసభ్యతే యీ ఘట్టంలో ఉన్న హాస్యానికి ఆధారం, విచ్చలవిడిగా సాగిన పండసరసాల హాస్యాని కాశ్రయంగా పరిపరివిధాల వర్ణించబడ్డాయి. ఈ అసహ్యా వర్తనలో అల్లరికి సహా జాగా ఉంటుంది, ఆ అల్లరిలో జడ్డిజంకలు కూడ ఉంటాయి,

" ఓమె యేమె యిదేమె మేలేమె యేమె
మేషపుష్పంబు దేవంచు మేల మాడ
మేమె మేమేలు కేలుచయ్యో మేలుమేలు
మేక మేకని సభవారు మిగుల నగిరి."

" పచ్చరామానికంబుల పళ్లెరముల
ఒచ్చగండని కూరలేర్పడగ జూచి
పెట్టరని పెండ్లి పెద్దలు పెడముపెట్ట
బెట్టుటకు నంగనలకును బట్టెపడవు."

" కలికివరాటరాజపుడు గప్పుర వీడెము పెట్టె నవ్వుచున్
నలునడపంబు వానికి ఫణాక్షరవల్లి దళాంతరంబునన్
బలితపు దేలుమైకమున బన్ని యతండది చూచి భీతి ద
మ్ముల మిలవైచిన న్నగిరి మూఁగిన రాజకుమారులందఱున్."

నల చౌర్యములోఁగల హాస్యము యింతకంటె అన్నివిధాలా సరసంగా ఉంది. అసలక్కడ కథే హాస్యానికి అనుగుణంగా ఉంది. పైగా బరిస్థితికీ పాత్రకీ నడుమ ఏర్పడిన వైషమ్యం హాస్యాన్ని వృద్ధిచేయడానికి వీలిచ్చింది. నలుడు తాను స్వయంగా పెళ్లికొడుకైవచ్చి, యింకొరిని పెళ్లాడమని దమయంతితో మాటాడబోవటం ఒక విచిత్రమైనసంఘటన. అందులో అతడు తిరస్కరిణీపరిభావంతో అంతఃపురంలో ప్రవేశించినప్పుడు ఎన్నెన్నో పొరపాట్లు, తిరకాసులు కలగడం సహజం. ఇవన్నీ యీ ఘట్టంలో హాస్యానికి బలమిచ్చేవే అయేయి. యీ ఘట్టంలో కవి ఊహించి సృష్టించిన ప్రసంగాలన్నీ అన్నీ కావు. అన్నీ హాస్య ప్రసంగాలే; కాని అంతటా శృంగారమయమైన హాస్యమే, కూర్చేడు. నలుడు తానొరులకు కనిపించడు. అతని కందరూ కనిపిస్తారు. అంతఃపురంలో ఉన్న వాళ్లంతా ఆడవాళ్లు. ఇతడు వారికి త్రోవయిచ్చి ఓసరిల్లి నడిచినా, వారు తెలియక యితని మీదనే వచ్చి పడతూ ఉంటారు. అతడు తప్పుకుందామని ప్రయత్నిస్తాడు. కాని

" చీటికి మాటికేకపథసీమ మెలంగఁగఁ బాటుగామి శృం
గాటక వీథికేఁగెఁ బతి కాంతల సందడి కల్కియైన న
ప్పాట పసించి యుండుట యుపాయమె చూడఁగ నాల్గు త్రోవలం
బాటల గంధులొక్కతతి, బైకొన్ని వచ్చినఁ జిక్కుడో."

అని మన కవిగారి సంశయమ్ము, అతడు సంశయించిన దానికెక్కువగానే,

" ఊరపడినేగు చోట నొక యుగ్మలి యొల్లెచెలంగు మేదినీ
శ్వరుని భుజా విభూషణము వజ్రములన్ దవులంగ బాటినన్
విరిసెను నీవి బంధమది విస్మయ మందఁగఁ దోడి భామినుల్
పరిహసనం బొనర్పఁ బతి పాపభయమ్మునఁ గంప మొందఁగన్."

ఈ పాపభీతికి తోడు ప్రస్తుత కార్య వికల్ప భీతి కూడ కలిగినది.

" వీఁడెనలుండు విశ్వపృథివీ వలయైక విభుండు వచ్చుచు
న్నాఁడని భీమ భూమిపతి నందన నూఱడిలంగఁ బల్కి పూఁ
బోడుల మాట నేర్చి కొని ప్రోసి శుకాంగన యట్లు పల్కినన్
కోఁడిది సన్నునే క్రియ నెఱింగెనొకో యనియెంచె నాత్మలోన్."

దమయంతితో మాటాడి, దేవతల సందేశాన్ని అందించి, వారి పక్షాన్ని వకాల్తీ నెరపిన పిదప కూడా నలుడు తన రహస్యం దాచుకోలేక బయట పడిపోయి, చేత పుచ్చుకొన్న కార్యాన్ని గంగలో కలిపి, 'ఆలింగనంబపేక్షించెద, చుంబనంబు దయసేయు' మని మన్మథోద్రేకంతో తన్ను తానుమరిచి మాట్లాడు తాడు. కాని మరుక్షణంలోనే తన పొరపాటు తానే గ్రహించి, తెల్లబోయి.

" ఏమని తలతురొకో నను
త్రామ ప్రముఖులగు సురలెదన్ నిఖిలాంత
ర్యాములు దమకార్యంబే
నీ మెయి విభ్రాంతిఁ బొంది యిటు చెలఁచుటకున్."

అని బెదురుతూ తనకు తాను నిందించుకొని, చివరికి

" పగవ నేటికి నేమన నచ్చునిపుడు
చేతనా హానిఁ గార్యంబు చిన్నఁబోయెఁ
జేతనా హాని దైవంబు చేఁతవచ్చె
దైవగతి దాట వచ్చునే దేవతలకు."

అని తిరిగి సమర్థించుకొంటూ ఉంటే విని నవ్వకుండా ఉండటం అరుదు. వివాహ ఘట్టం లోనూ, తదుపరి కలిరాజుగారి ప్రసంగంలోనూ కూడ హాస్యానికి చక్కని అవకాశాలు

కల్పింపబడి పోషింపబడ్డాయి. కవి తన భవిష్యత్కార్య క్రమాన్ని వెల్లడిస్తూన్న సందర్భంలో చక్కని వ్యంగ్యగర్భితమైన అధిక్షేప హాస్యం కూడ దొరుకుతూంది.

"యతి మాచకమ్మ యునతిథి దీక్షితపత్ని మగని బాసినయింతి మరుని పాలు
తీర్థ వాసులును మాంత్రికులు దాయాదులు తర్కవాదులును
క్రోధంబు పాలు
యజన దీక్షితులు నధ్యయన పాఠకులును భస్మ కుంతనులు
లోభంబు పాలు
బాలవై తండిక పామరాహంకార చుంబకమతులు మోహంబు పాలు."

అని కవి తన వంశ నాయకులను నిర్దేశించి చూపిన స్థలాలు నేటికీ వారి అధికారంలోనే ఉన్నాయి! ప్రాచీన కవుల ఫక్కీలోనూగా యీ కవి కొంత వ్యంగ్య హాస్యాన్ని అందించాడు. కాని అది చాల తక్కువ, హరివిలాసంలో పార్వతితో మాటాడ వచ్చిన కపటవటుని పలుకులు చల్లని హాస్యాన్ని కలిగిస్తూ యీ పార్వతీ పరమేశ్వరుల వివాహానంతరం, అల్లుని బెట్టుసరి చూసి మేనక తన కూతురితో ఫిర్యాదు చేస్తూ, ఈశ్వరుని యీసడించి పల్కిన పల్కులుకూడా వినదగినవే.

"తలమీద చదలేటి దరిమీలఁదినఁజేరు కొంగలు చెలఁగి కొంగొంగురనఁగ
మెడదన్ను ఫునుకలనిడు పేరులొండొంటిఁబొరిఁబొరిఁదాఁకి
బొణొబ్బొణుగురనఁగఁ
కట్టిన పులితోలు కడకొంగు సోకి యాబోతు తత్తడి చిఱ్ఱుబుఱ్ఱు
మనఁగఁ
గడియంపుఁబాములు కకపాలలోనున్న భూతిమైఁజిలికిన బుస్సురనఁగఁ
పమ్మిపూఁజూలిపునుక కంచమ్ము సాచి
దిట్ట తనమున భిక్షము దేహీయనుచు
వాడ వాడల భిక్షించు కూడుగాని
యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు."

ఈ కవిలో గల మరొక విశేషం, భోజన వరన. పిండివంటలను వర్ణించ వలసివస్తే యితడు గుక్కతిప్పుకుండా, ఎంతసేపైనా సరే ఏకరువు పెడుతూనే ఉంటాడు. భోజనాన్ని ఆపోసనతో మొదలు ఉత్తరాపోసన వరకు విస్తరించి వర్ణించిగాని ఊరుకోడు. ఈ

విషయంలో యితని కావ్యాలన్నీ సాక్ష్యం యిస్తాయి. అసలే కవి భోగి. రాగభోగాల్లో ఆరితేరిన నిత్యోల్లాసి. కనుకనే యీతడింతగా మనకీ హాస్యాన్ని అందించగలిగేడు.

పోతన గారు భక్తకవి. భక్త్యావేశంలో తన్నుతానే మరచి, కథని, పాఠకుణ్ని విడిచి, తన ఆరాధ్య దేవునిపైని ఎన్నైనా పద్యాలూ, తనివి తీరక దండకాలు సహా వ్రాసి, తిరిగి ఎప్పుడో కథలోకి రావటం యీయనకి పరిపాటి. అయితే యితని భక్తి చాల వరకు సఖీ భావాన్ని పోలి ఉంటుంది. ఫలితంగా యితడు తన దేవుని లీలలో వాత్సల్య శృంగారాలు కూడా ఎరమరిక లేకుండా చూడగలిగేడు. ఆత్మార్పణ చేసి ఆత్మీయత గడించుకొన్న భక్తుడు కాబట్టి, తనకు నచ్చిన స్థాయిలోకి భగవంతుని దింపి చూడగలిగేడు. ఇతడు మనకిచ్చిన కావ్యం మహాభాగవతం. ఇందులో సగభాగం పచ్చివేదాంతం. మిగత సగంలో మరోసగం భక్తుల కథలు. ముముక్షువుల ముచ్చట్లు, వగైరాలు. ఇంకా మిగిలిన దాంట్లో కొంత సృష్టి ప్రకారం, దాని తత్వం, రాజుల జాబితాలు మొదలైన వాటికని ప్రత్యేకించబడింది. ఇక అక్కడికి మిగిలినది శ్రీకృష్ణుని చరిత్రకి సంబంధించిన సరసమైన గాథ. అందులోనూ ఉత్తర భాగం శ్రీకృష్ణుని జీవితాన్నే నీరసంగా చూపిస్తూంది. పూర్వభాగంలోనే మనకీ కవి గారి ప్రతిభ చూపి ఆనందించదగిన కథ మిగిలింది. ఇది వాత్సల్యశృంగారాలకి నిలయమైన కథ. భక్తి అనుస్యూతంగా వచ్చే భావం. వీరాద్భుతాలు మధ్య మధ్య పోషించబడ్డాయి. వీటన్నిటికీ హాస్యం అంగ రసంగా రాదగినదే. వాత్సల్య శృంగారాలకి ఆనుషంగికంగా వర్ణింపబడిన యీ హాస్యం భారతీయ సాహిత్యంలో ఓ విశిష్టమైన హాస్యం. శ్రీకృష్ణుడు చూపుకి చిన్నగాని చేష్టకి పెద్ద. ఈ విరోధాభాసలో ఉన్న వికృతి సహజంగా హాసానికి ఆలంబనగా ఏర్పడింది. మన అదృష్టంచేత యీ హాస్యాన్ని చక్కగా అందించగల కవి మనకు దొరికేడు. ఇదే శ్రీకృష్ణచరిత్ర ఎర్రనగారి హరివంశంలో కూడ వర్ణింపబడింది. గాని ఎర్రనగారిది స్మితహాసం, పోతనగారిది హసితం. పోతన గారిలో ఉన్న మమకారం ఎర్రనలో కనపడదు. ఎర్రనగారు శృంగార వర్ణనలో బిడియపడతారు. పోతనగారిలో అలాంటి అక్కరమాలిన జంకు బొంకు లేమీ కనపడవు. ఎర్రనగారిలో ఉన్న మాటకారి తనం పోతనలో తక్కువే కాని ఆయనలో కంటె ప్రసంగరచనానైపుణ్యం యితనిలో ఎక్కువ. హాస్యమయమైన సన్నివేశాలేవో యీ కవి బాగా ఎరిగినవాడు. అలాంటివి కూర్చి అందించే నేర్పు కూడ యితనికి సహజ పాండిత్యంతో పాటుగానే అబ్బింది.

పడతీ నీ బిడ్డడు మా
కడవలలో నున్న మంచి కాగిన పాలా

ఒడుముులకుఁ బోసి చిక్కిన
కవలు బో నడచెనాజ్ఞ కలవోలేవో. ”

“ ఆడం జని వీకల పెరు
గోడక నీసుతుఁడు డ్రావి యొకి యించుక నా
కోడలి మూతిందుడిచిన,
గోడలు ముచ్చునుచు నత్తకొట్టె లతాంగీ.
వారిల్లు సొచ్చి కడవల
దోరం బగు నెయ్యి డ్రావి తుదినా కడవల్
వీరింట నీ సుతుండిడ
వారికి వీరికిని దొడ్డ వాదయ్యెసతీ.
నమ్మినిదురఁ బోవనాపట్టి జుట్టు మా
లేఁగ తోఁక తోఁడ లీల గట్టె
వీధులందుఁ ద్రోలె వెలది నీ కొమరుండు
రాచబిడ్డఁడైన రవ్వమేలె. ”

అని యీ మొదలుగా గల గోపికల ఫిర్యాదులలో ఎన్నో పిల్లలదుడుకు చేష్టలకు సంబంధించిన ప్రసంగాలు కూర్చి వర్ణించబడ్డాయి. మధ్య మధ్య శ్రీకృష్ణుని దేవత్వాన్ని ధ్వనించే ప్రసంగాలు కూడ అల్లరిలో మాత్రం లౌకికంగానే ఉండి నవ్విస్తున్నాయి.

“ వేలుపులలో నాకంబెను
వేలుపు మరి యెవ్వరనుచు వికవికనగిమా
వేలుపుల గోడపైనో
హేలావతి నీ తనూజుఁడెంగిలిచేసెన్. ”

వయస్సుకి మించిన పోకళ్లు బోయి చూపిన శృంగార చేష్టలు కూడ యీ ఘట్టంలో ఎన్నో ఏకరువు పెట్టబడ్డాయి. ఇవి గాక జలక్రీడలాడుతూన్న గోపికల కోకలెత్తుకుపోయి చెట్టెక్కి కూర్చొన్న అల్లరిలో గల హాస్యం విశ్వసాహిత్యములోనే అద్వితీయమనిపించుకొన్న హాస్యం. పది మంది పిల్లలు ఓచోట కూడినప్పుడు చేసే అల్లరి గూడ హాస్యమయంగానే ఉంటుంది. గొల్ల పిల్లల చల్దులారగింపులో గల సొంపులు యీక్రింది పద్యంలో వర్ణించబడ్డాయి.

" మాటిమాటికి వ్రేలుమడచి యూరించుచు నూరుగాయలు
దినుచుండు నొక్కఁ,
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి చూడు లేదని నోరు
సూపు నొక్కఁ,
డేగురార్వురఁ జల్దిఁ దెలిమెఁ బన్నిడి మాడి కూర్కొని కూర్కొని
కుడుచు నొక్కఁ
డిన్ని యుండఁగఁ బంచి యిచ్చుట నెచ్చెలి తనమంచు బంతెన
లాడు నొకఁడు

కృష్ణుఁ జూడు మనుచు గికురించి పరుల మ్రోల
మేలి భక్ష్యరాశి మెక్కు నొక్కఁడు
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొకఁడు మురియు నొకఁడు. "

ఇలా వాత్సల్య శృంగారాలకి అంగంగానే కాకుండా ఆశ్చర్యవీరాలకి అంగంగా కూడా హాస్యం నిర్వహింపబడినపట్లు. బ్రహ్మగర్వాపహారం, ప్రలంబాసురసంహారం వగైరాచోట్ల లభిస్తాయి. రుక్మిణీ కల్యాణ ఘట్టంలో రుక్మిపరాభవంగాని, వివాహానంతరం రుక్మిణీ శ్రీకృష్ణుల సంవాదంలో గల సరసోక్తులు గాని ఏ మంత యింపుగా లేవు. ఇక్కడ హాస్యం విరసంగా ఉంటూంది. నారద గర్వభంగం లాంటి ఒకటి రెండు కథలలో స్వల్పంగా హాస్యధ్వని ఉన్నా అది చెప్పుకో దగిన స్థాయిలోకి రాలేదు.

నాచన సోమన్నలో ఉక్తిచాతుర్యం మూర్తీభవించింది. అడుగడుగునా సామెతలు, లోకోక్తులు, జాతీయాలు విశేషంగా కూర్చి, శబ్దశక్తిని విలాసంగా వినియోగించుకొని, సరసతా చమత్కృతీ రెండూ చూపి మాటాడగల నేర్పు యీ కవిలో గల ఒక విశిష్టత. దీన్ని పురస్కరించుకొని నడిచిన కారణాన్ని యితని హాస్యం కూడ ప్రత్యేకతగడించుకొంది. ఇతని ఉత్తరహరివంశంలోని ఊర్వశీనరకాసుర సంవాదఘట్టం తెలుగు సాహిత్యానికే ఒక అమూల్యమైన అలంకారం. ఈ ఘట్టంలో ఉన్న రసాభాస యితని వాక్చమత్కృతితో కలిసి అతి సరసమైన హాస్యాన్ని మేల్కొల్పేదిగా ఉంది. నరకాసురుణ్ణి మాటలలో బుట్టలో పెట్టి తన హృదయంలో గల అనను కూల్యాన్ని అణు మాత్రమైనా బయటకు పొక్కనీయకుండా, స్వీయకార్యానుకూలంగా పెదవులకు తేనె పూసి మాటాడ గలిగిన నెరజాణతనం ఊర్వసి మాటల్లో యిల్లుగట్టుకుంది.

" చతురవచోవిలాస గుణసాగర సాగరమేఖలావనీ
పతికిని నీకు నెంతువలెగాక ప్రాతియె నీవిటు గోరు టెల్ల నా
యతులితభాగ్య మింతె నిజమైనగలంకరమున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి యొకనాడయినన్ ననుగారవించితే."

అని ఆమె అతిసున్నితా తియ్యారించి నట్లు ప్రారంభించి, నరకునికి తానెంతో అనుకూల సతి అయినట్లు నటిస్తుంది. ఇంత వరకు తనను కోరక పోవడమే అతని దోషమట! కాదు. ఇప్పుడీ కోరిక కోరడం కూడ తాను నమ్మలేకుండా ఉందట!

" లంజియనాడు నేను విమలావున నీసమరేంద్రు గెల్చిన
న్నం జెరపట్టి తెమ్మని వినోదము చేసితిగాక చిత్తమె
ల్లం జెడియుండ రిత్త యొడలంజవిచేరునె చిల్కవోయినం
బంజలమేమిసేయ రసభంగము సంగతి లోన మెత్తురే." అని

అంతతో ఊరుకోక, అతని ఉల్లాసాన్ని మరీ నీరసింపజేస్తున్న ధోరణిలో

" నవ్వులమాటలో నిజమె నాకములోన ననేక కన్యకల్
మవ్వపు దీగెలందగడు మానినులుండగ నంతనెన్నడో
జవ్వన మమ్ముకొన్న గడసాని ననుంగవ యుంపలంచితే
పువ్వులు వేడుకైనం గడివోయిన వాళ్ళ ముడువంగ వచ్చునే." అని

ఉపన్యసించింది. కాని అటు నరకుడు కూడ ఎదురెరిగి మాటాడ నేర్చిన రసికుడే.

" అంజెదివు గాక నను జెం
తంజేరంగ నీక యెంత దఱిగిన మిరియా
లుంజొన్నల సరిపోవే
లంజతనము నందుంగొమిరెలం గెలువవటే." అని

ఆమె మాటలన్ని పెడచెవిని పెట్టబోయాడు కాని ప్రత్యుత్పన్న మతిత్వమంతా చూపి, సమయంచేసి, ఆమె అప్పటికి తని చేతికి చిక్కకుండా తప్పించుకొని, అతని ప్రయత్నాన్ని నగుబాటుచేసి విడిచింది.

ఈ విధమైన 'చతురవచో విలాసంతో' ఉన్న ఘట్టాలెన్నో యీ కావ్యంలో ఉన్నాయి. శృంగారంలోనే కాక ఇతర రసాల్లోకూడ యీ కవి యిదే విధమైన

వాక్చాతుర్యం ప్రదర్శింపగలడు. హాస్యానుకూలమైన సన్నివేశాలలో యీ వాక్చాతుర్యం హాస్యానికెంతో సహాయకారిగా ఉంటూంది. నరకాసురునితో శ్రీ కృష్ణునికి జరిగిన యుద్ధఘట్టంలో కూడ చక్కని అపహాసోక్తులు కూర్చబడ్డాయి. హంస డిభకుల తుంటరి తనాన్ని వర్ణించినపట్లు కొన్ని కేవలం హాస్యానికే జాగాచేసి వ్రాయబడ్డాయి. వారు దూర్వాసుని పరాభవించిన ఘట్టంలో, పరోక్షంగా దొంగ సన్యాసులను అపహసిస్తూన్న అధిక్షేప హాస్యం ధ్వనించబడింది. హంసడిభకులు దూర్వాసుని ఆశ్రమంలోకి పోయి, అతడు తపస్సులో ఉంటే,

" కావి-చీరముసుగు కచ్ఛడంబును జూచి
బోడతలయును నిడుద బొట్టుజూచి
గోచితోడి వెదురు గోలయుఁ జిక్కంబు
గట్టియున్న బుఱ్ఱకాయ, జూచి" డాయబోయినారు.

తదుపరి వారాడిన మాటలివి.

" మిడికెదు పెదవులు వ్రేళులు
మడిచెదు కనుదోయిమొగిడి మాటెదురఁ గడున్
వెడవీక యొసలు చేసెదు
కడపట జపమునకు నేడు గలదో లేదో" అని

అప్పటికీ అతడు మాటాడక పోవుసరికి, మరీ పెచ్చురేగి,

" తిరిసిన కూడుదెచ్చి నలుదిక్కుల బోడలు తిండి బెట్టఁగా
బెరిగినపొట్టతోడ నొక చేటపయిన్ దొరవోలె నెవ్వరిన్
సరకు గొనండు పట్టుకొని చాఁగలుగొన్న బలే యెలుంగు డ
క్కరిబలు మోపు మోచునయగారి తనంబిది యట్టె గట్టినన్.

బాంధవుల బాసి తమ యిల్లు పట్టు విడిచి
తల్లిదండ్రులు నగవఁగ నైతపముతోఁడ
బోడతలలు గాఁబడసిరి కోడెవాల్ల
వీని మాటలచేగదా వెఱ్ఱులైరి."

అని యీరకం వ్యక్తులంతా దొంగ సన్యాసులే అన్నట్టుగా నిందిస్తారు. ఇది క్రూర వినోదం. అసహ్యించుకోవలసేదిగాని హసించి ఆస్వాదించ వలసేదిగాని కాదు. యీ ఘట్టాన్ని కవి అధిక్షేప హాస్యానికి (Satire) వినియోగించుకొన్నాడు. పైగా ఈ హంసడి భక్తుల్ని దూర్వాసుడు శపించినప్పుడు 'తగిన పని అయిందిలే' అని సంతసించవలసే ఘట్టానికిది ముందరి సన్నాహం. ఈ కారణాలనిబట్టి యీ హాస్యం విరసతలోకూడ సరసతనాపాదించుకొంటూంది.

పిల్లలమర్రి పినవీరభద్ర కవి సహజంగా హాస్య ప్రియుడైన కవి. కాని వ్రాసిన కావ్యాలు హాస్యానికంతగా అనువిచ్చేవి కావు. ఈ బాధ మన కవులందరూ అనుభవించేరు. ఇతడు వ్రాసిన శృంగార శాకుంతలం కాళిదాసు నాటకాన్ని అనుసరించి వ్రాసిన ప్రబంధ కావ్యం. కాని వర్ణనలు వగైరాలు శ్రీనాథుని నైషధాన్ని పోలి ఉంటాయి. ఇతని రెండవకృతి జైమినీ భారతం. ఇది ఎడతెరిపి లేని యుద్ధాలతో నడచిన వీరగాథ. ఆ వీరులైనా కేవల వీరులు కారు. వీర భక్తులు. ఇందులోకూడ హాస్యానికి జాగాలేదు. కాగా ప్రాసంగికంగా వచ్చిన చిన్నచిన్న కథలలో యితని హాస్య ప్రియత మనకు గోచరిస్తుంది. కేవలం హాస్యంకోసమనే చిన్నచిన్న ఘట్టాలల్లికూర్చే పద్ధతి యితని కృతులలో కనిపిస్తుంది. జైమినీ భారతం తొలి ఆశ్వాసంలో సుదేవుని వృత్తాంతం యిందుకుదాహరణంగా తీసుకోవచ్చు. ఆ కథ మూలకథకి ఏమాత్రం సంబంధించదు. హాస్యానికి మాత్రం సహాయపడుతుంది. ధర్మరాజుగారి యాగం చూడటానికి పౌరులందరినీ పిలుచుకొని రావలసినదని నియోగింపబడతాడీసుదేవుడు. అతడు నలుగురితోపాటుగా తన తల్లిని సహా యాగానికి ప్రయాణం కమ్మని చెప్పి తొందర పెడతాడు, పైగా అక్కడ శ్రీకృష్ణుని దర్శనం సిద్ధిస్తుందనీ, ముసలి కాలంలో ఉన్న ఆమెకిది చక్కని మోక్షోపాయమనీ బోధిస్తాడు. దానికామె యిచ్చిన సమాధానమిది.

"కుడిచి కూర్చుండి రాజ్యంబు విడిచిపోవ
విభునకును నీకు నెటువంటి వెర్రి పుట్టె
బురజనులు మీరు నెల్లైనఁబొండు నేను
వేయుఁజెప్పిన నిలయంబు వెడలననిన"

అతడు మరికొంత భోధించి రాజు, ప్రజలు గూడ పోవుచున్నారని చెప్పి వెంటనే ప్రయాణము కమ్మని బ్రతిమాలుతాడు. కాని వినకపోవుట సరిగదా, ఆమె తెగించి నిష్కర్షగా

" తండ్రితరమునఁ బెనిమిటి తరమునందు
మీసమంతయుఁ బుణ్యంబుఁ జేసియెఱుంగ
వార్ధకంబున నింకేల వట్టితోడుసు
కృష్ణ పెర్శింపకున్న నాకేమి చిక్కు." అని

చెప్పి విడిచింది. దానికినీ అతడు మెత్తపడలేదు. చివరకిద్దరున్నూ వంతగించేరు. అతడు, నిర్దాక్షిణ్యంగానైనా, ఆమెకీ మోక్షం అంటగట్టి తీరాలనే నిశ్చయంతో, "యానెసపరి పక్కారాలు మెరపెట్టుచు నీడిగిలంగ నంసలంబున వడిఁగట్టి వైచికొని పొండని" నొకగలుస నియోగించి పోతాడు.

ఇలా ప్రత్యేకంగా ప్రసంగాన్ని కూర్చి నవ్వించడమే కాక ప్రసంగానుకూలంగా వచ్చిన కథలలో కూడ యీ కవి నవ్వించడానికి చేసిన ప్రయత్నం అపారంగా గోచరిస్తూంది. ఉద్దాలక చరిత్రనితడు విస్తృతంగా వర్ణించి, చక్కని హాస్యాన్ని అందించేడు. చండికతో ఉద్దాలకుడు పడిన పాట్లన్నీ అన్నీ కావు.

" సంధ్యవార్వగ నిమ్ము జలపాత్రి మనఁ బోవఁ గొట్టిన నతికించు కొనఁగ
నలసె
తడిధోవతిమ్మన్న నడిమికి వడిఁ జింప గట్టుకోఁ బడె బ్రమ్మకమ్మి వైచి
యక్షమాలికఁ జూపు మనఁ దెంచి వైచినఁ బనిచెడి మఱిఁ గ్రుచ్చు
కొనఁగవలసె
సమిధలిమ్మన్న ప్రేలిమిగుండ మార్చగనూఁదుకోఁ బడె మండనొక
విధమున
ననుదినమునిట్లు ప్రాతికూల్యము భజింపఁ
జండికతమున ముని బ్రహ్మచర్య నియమ
మునకు గృహమేధి వర్తనమునకుఁ దొలఁగి
రెంటికిని జెడ్డ రేవని రీతియయ్యె."

ఇట్టిభార్యను ఎట్లో మోసగించి నెరవేర్ప జూచిన పితృకార్యముకూడ, చిట్టచివరి ఘట్టములో అతని పొరపాటుచేతనే చెడిపోయినది. పార్వణము నామె పెంట మీద పోయించినది.

పై విధంగా విస్తృతి నిచ్చిన ఘట్టాల వర్ణనలు మాత్రమే కాక ఈ కృతిలో హాస్యసృష్టికై కూర్చిన ఉక్తిప్రత్యుక్తులెన్నో కనిపిస్తాయి. ఈ కవి వికటోక్తులు, పరిహా

సోక్తులు ఆడటం చక్కగా నేర్చిన వ్యక్తి. శ్రీ కృష్ణ భీమసేనులు కేమలో తాము ఆడు కొనిన వికటోక్తులు సత్యాన్నీ వైషమ్యాన్నీ కూడ ఒకేచోట ధ్వనిస్తూ నవ్విస్తున్నాయి. ఈ క్రిందివి భీముడు శ్రీ కృష్ణుని గూర్చి ఆడిన పరిహాసోక్తులు.

"మొదల నత్యంతకాముకుఁడవౌటకుఁగొల్లయిల్లాండ్ర గుబ్బపాలిండ్లుసాక్షి
యతి నీచరతిశీలివగుటకు పాఠీన కమఠ సూకర విగ్రహములు సాక్షి
బహ్వాసివగుటకు బ్రహ్మాండ కోట్లును బూరింపలేని నీ బొజ్జసాక్షి
స్త్రీలోలుఁ డగుటకు త్రైలోక్యము నెఱుంగ ధరకుఁ దెచ్చిన వేల్పు తరువుసాక్షి
జడసముత్సాహివగుటకు జలధిసాక్షి
వామనుఁ డవగుటకు బలీశ్వరుఁడుసాక్షి
మందమతివౌటనది మఱపొందె గాక
సరవిఁ బేర్కొనఁ దరమె నీ నటులు కృష్ణ."

ఈ మాటల్లో కేవలం పరిహాసమేకాక, భీమునికి కృష్ణుని పైగల భక్తి ప్రపత్తులుకూడ కని పిస్తున్నాయి. వీధిలో పోతూన్న వృద్ధవేశ్యలను చూపి శ్రీ కృష్ణుడు భీమునితో "వీరిఁబరి గ్రహింపుమిదివేళ సమానలు నీకు భీషణాకార కఠోర మన్మథవికారగుణంబులు"నని అన్నప్పుడు, అతడు దానికి బదులుగా "యిట్టిక్రొమ్మాలిన జంతలఁ జక్కఁ బెట్ట నీ భారము. వన్నెకెక్కు దురవస్థలు నీ కరలాలనంబునన్"అని మాటకు మాట నేర్పుగా అందించి పౌరాణ పురాణాలెన్నో త్రివ్వుతాడు. ఇలాఎన్నైనా చూపవచ్చు. ఈకవిలో హాస్యప్రజ్ఞ నిరివి గా ఉంది. హాస్యానికి ఏమాత్రం అవకాశం కలిగినా దాన్ని జారవిడవకుండా, వీలైనం తగా పెంచి, హాస్యాన్ని పోషించడం యీ కవిలో ఉన్నప్రత్యేకత. హాస్యపుపట్లు ఏరి కోరి కూర్చడం యితనిలో గల హాస్య ప్రియతకి చక్కని ప్రమాణం.

ఈకాలపు మిగత కవులలో పేర్కొనదగిన హాస్యం మనకుదొరకదు. జక్కన గారి విక్రమార్క చరిత్రలో యుక్తిచాతుర్యానికి సంబంధించిన కథలెన్నో ఉన్నాయి. కాని ఎక్కడా ఆయుక్తిలో వినోదం కపపడదు. కొన్ని పొడుపు కథలు కూర్చే వృత్తాంతాలు కూడ యిందులో ఉన్నాయి. వీరాద్భుతాలకి సంబంధించిన గాథలు కూడ యీ చరిత్రలో దొరుకుతాయి. కాని యివేవీ హాస్యాన్ని అందించే ధోరణిలో లేవు. గౌరనగారి హరిశ్చంద్రోపాఖ్యానంలో కలహకంఠి, కాలకౌశికుడు, వీరబాహుడు మొదలైన పాత్రలలో కొంత హాస్యం ధ్వనింపబడింది. ఇక మిగత కవులు హాస్యం ఎరగరు. ఎక్క

డేనా వీరికావ్యాల్లో కొంచెము నవ్వుగొలిపే ప్రయత్నం కనిపించినా, అది సహృప లేక పోయిన కారణంచేత విఫల ప్రయత్నమే అవుతూంది. రానురాను శృంగారానికి ప్రాబాల్యం కలిగిన కారణంచేత కూడ హాస్యం చాలా చోట్ల లేకపోవడమో, పకిలిగా ఉండటమో అయింది.

రాయల వారి కాలం నుండి రఘునాథ రాయల కాలం వరకు తెలుగు సాహిత్యానికి రాజాదరణ విశేషంగా లభించింది. కావ్యకన్య సౌకుమార్యాన్ని పెంపొందించుకొని, విలాసాలు నేరపడం నేర్చుకొంది. ముస్తాబ్బుద్దులా సింగారించుకొని, అంతః పురాల్లో ముద్దులొలుకుతూ, ముచ్చట్లు చూపుతూ, ముసిముసి నవ్వులతో ప్రొద్దు గడపడం అలవరుచుకొంది. కవులు తూగుటుయ్యాలలో కూర్చొని, విలాసినీ జనుల వీచోపులందుకొంటూ, ఘంటం పట్టుకొనే వారేగాని, ఊరకే కృతులు రచించేవారు కారు. వ్రాసినది రాజదర్బారులో, రాగ భోగాల మధ్య, శ్రావ్యంగా వినిపించే విషయానికే సంబంధించేది గాని ఊళ్లో వాళ్ళకి పనికి వచ్చేది కాదు. నిర్వ్యాపారంగా ఉన్నప్పుడు కాలక్షేపానికి సరిపోయే విషయంగాని, జీవితాన్ని నానా గతుల్లోనూ నడిపించడానికి ఉద్దేశించిన విషయం కాదు. ఆవిషయమైనా ఓకావ్యంలో ఏరీతిగా వర్ణింపబడిందో మరో కావ్యంలో కూడ అదేరీతిగా వర్ణింపబడి దొరకుతుంది కాని క్రొత్తదనం చూపదు. అంతటా చర్విత చర్వణమే.

ఈ కాలపు గ్రంథాలన్నీ శృంగార ప్రబంధాలు. వీటిలో కథకి ప్రాధాన్యం తక్కువ. వర్ణనలకి విలువ ఎక్కువ. ఏ పురాణ కావ్యంలో నుండో ఓ చిన్న యితివృత్తం, కాదు, ఓ వివాహ వృత్తాంతం- తీసుకొని దానినే వర్ణనల సహాయంతో పెంచి వ్రాయడం యీ కాలపు కవుల పరిపాటి. కథా సంవిధానంలో నేర్పు చూపగలిగినకవులు కొందరున్నా వారూ కథని నక్కచిక్కులలోకి యీడ్చి, నానాడొంకలు త్రిప్పి, యీరేడు తరాలవారి నందరిని ఒకే తాటినిగట్టి నడిపించిగాని నిద్రపోరు. ఇక వర్ణనలకోసం వీరెవరూ ప్రకృతిని అంతగాపరికించి, స్వాభావికతకు విలువయిచ్చి, ప్రస్తుత ప్రసంగానికి అనుకూలమైన భావాలనైనా ప్రకృతిలో చూడగలిగి ఘంటం పట్టుకోలేదు. లక్షణ గ్రంథాలలో ఉన్న విషయాలు తూచా తప్పకుండా తమకావ్యాల్లో దింపుకున్నారు. వస్తువర్ణనకి ఒక నిశ్చితమైన ప్రణాలిక ఏర్పడే సరికి అలంకారాల నాశ్రయించి క్రొత్తదనం చూపవలసే అగత్యం కలిగింది. ఫలితంగా కావ్యం శిల్పంగా మారింది. ఈ నగిషీ పనిలో సూక్ష్మాతిసూక్ష్మమైన జిలుగులు చెక్కి చూపడమనేది చిత్రవిచిత్రమైన చమత్కృతులకి త్రోవదీసి;

ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాల రచనకి ప్రోత్సహించి, నిఘంటువుల నాశ్రయిస్తేనే గాని అర్థంకాని ధోరణిలో రచనల్ని నడిపించింది. ఈ కారణంచేత రసానికి చాలాచోట్ల విచ్ఛిత్తి కలిగింది ముఖ్యరసమే తన ప్రాముఖ్యాన్ని నిలుపుకోలేనప్పుడు, తక్కిన రసాలసంగతి మరీ అధ్వాన్నమైనదని చెప్పడం అనవసరం. హాస్యరసం ఎప్పుడూ మరొకరసాన్ని ఆశ్రయించి బ్రతకవలసేది. ఆశ్రయ దాతకే ఆదరణలేనప్పుడు ఆశ్రితులగతి వేరే అడుగనక్కరలేదు. ఈ కాలపు కావ్యాల్లో ఉన్న శృంగారం నీరసశృంగారం. దీన్ని ఆశ్రయించిన మన హాస్యం మరీ నీరసంగా తయారైంది. కథలోగాని, ఘటనలలోగాని నవ్యత అనేది లేక హాస్యానికి నడుము విరిగినట్టయింది. నాయకుల నర్మసచివులైనా, నాయికాసౌందర్య వర్ణనలో చతురులు గాని నవ్వించడంలో నేర్పుగలవారు కారు. విదగ్ధనాయికల వాక్కులుగాని, సఖులనర్మోక్తులుగాని, సూతికల చతురోక్తులు గాని, ప్రేయసీప్రియుల సరసోక్తులుగాని, ఆఖరికి చంద్రమన్మథాద్యుపాలంభనోక్తులు గాని తటాలున విని నవ్వడానికి తగిన ధోరణిలో లేవు. నిఘంటువును దగ్గరవేసి తేనేకాని అవి అర్థంకావు. అప్పటికి ఈ నవ్వుచచ్చి, శ్రమకు ఫలితంగా ఏడుపుకూడా రావచ్చు. అర్థమైనచోట ఆ మాటలు కట్టుమాటలుగా ఉండటమే గాక ప్రసంగం కూడ కట్టు ప్రసంగంగానే ఉన్న కారణంచేత నవ్వుని ప్రేరేపించలేకపోతున్నాయి. ఇది యిలా ఉంచి, కొందరు కవులు చేసిన హాస్య ప్రయత్నం చూస్తే ఏడుపువస్తుంది.

రఘునాధరాయల వారి తరువాత కవితకు రాజాదరణ నానాటికీ తగ్గుతూ వచ్చింది. కవులు కొంతస్వతంత్రులైనారు. కాని కావ్యనిర్మాణ విధానం మాత్రం పాడిన పాటనే పాడసాగింది. విషయంగాని, వర్ణనలుగాని, ఉక్తులుగాని, ఏవీ నవీనత నాపాదించుకోలేదు. శృంగారం పరితెగి, పచ్చిశృంగారంగా మారింది. కొన్ని కొన్ని కేవలం బూతులబుంగలనిపించుకొనేరచనలు వెలసినవి. కాలప్రభావాన్నిబట్టి, అంతనగ్నంగా కాకపోయినా, పలుచగా పైటవేసిన శృంగారం యించుమించుగా యీకాలపు రచనలన్నిటిలోనూ దొరుకుతుంది. ఇతర రసాల ప్రసక్తి అడుగంటింది. అంతకంతకీ యీ రచనలు కవులకే విసుపనిపించేయి. ఫలితంగా శతకసాహిత్యం వృద్ధి పొందింది. వీటిలో కూడ శృంగారము లేకపోలేదు. కాని భక్తి, నీతి వైరాగ్యం వగైరాభావాలు కూడ ఆదరింపబడ్డాయి. హాస్యానికి సహా కొంత ఆసరా లభించింది.

తెలుగులో హాస్యకవులనిపించుకొన్నవారు యీ కాలనికి చెందినవారు. హాస్య గ్రంథాలనే పేరుమీద వెలసిన రచనలు కూడ యిదే కాలానికి చెందినవి. కాని హాస్యం

మాత్రం ఉన్నతస్థాయికి జెందినదికాదు. జీవితంలో ఉన్న హాస్యాన్ని కావ్యాల్లో ప్రతిఫలింప జేయగల నేర్పు యీ కవులలో చాల తక్కువ. పైగా బూతును హాస్యంగా గ్రహించి రచన చేసిన వారు కూడ వీరిలో కొందరు ఉన్నారు. ఈ దోషం పురుష కవులలోనే కాదు స్త్రీలు కవయిత్రులైనచోట కూడ కనిపిస్తుంది. గార్హస్థ్య జీవితానికి సంబంధించిన సరసమైన హాస్యమైనా యీ కవయిత్రులలో మనకు దొరకదు. కొన్నిచోట్ల, ప్రసంగాన్ని బట్టి హాస్యాన్ని ధ్వనించవలసివస్తే, దాన్ని ఏదో విధిలేక నిర్వహించినట్లు నిర్వహించి దాటి పోవడం వీరిలో తరుచు కనిపిస్తుంది. ప్రత్యేకంగా హాస్యంకోసమని ప్రసంగాన్ని సమకూర్చ డం వీరిలో చాల అరుదు. అథవా ఎక్కడేనా అలాంటి ప్రయత్నం కనిపించినా, అక్కడి హాస్యం బలవంతపు బ్రాహ్మణార్థంగా వచ్చినట్లుంటూంది. నవ్యత అసలేలేదు. ఈ దోషాలు తిరిగి గద్యలో కావ్యాలు వెలసేదాకా మనవారి హాస్యాన్ని అంటిపెట్టుకొనిలచేయి. అయితే ఏ కాలంలోనూ అపవాద స్వరూపులైన కవులు కొందరుంటారు. అట్టివాళ్లు కొందరీకాలంలో కూడ ఉన్నారు. వారిలో కొంత చక్కని హాస్యం దొరుకుతూన్నమాట సంతసించవలసిన సత్యం.

శ్రీ కృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యద ప్రౌఢతిప్రౌఢమైన రచన. కవి స్వయంగారాజు. నలుగురితోనూ నవ్వుతూ మాట్లాడడం రాజసానికే విరుద్ధం. కావ్యం ధర్మానికీ మతానికీ సంబంధించిన కథగలది కాబట్టి అందులో నవ్వించడం కూడ మర్యాదకి విరుద్ధమే. ఇదిగాక, రాయలవారు చాల మర్యాదస్తుడు. ఒకరిని నొప్పించే హేళనలు తన కంతగా నచ్చవు. యామునాచార్యులు పాండ్యరాజు సభలో వాదించడానికి పోయిన సందర్భంలో శైవాచారాల్ని యీ కవి అతి మృదువుగా, అంటే అంటనట్టు, అపహసించి ఊరుకొన్నాడు. అయితే యితడు లోకమెరిగిన రాజు, ఆశ్రితులు, యాచకులు వగైరాల వారి స్వభావాలు చక్కగా గుర్తించినవ్యక్తి. ఆయా స్వభావాలు తడవినప్పుడు తాను లోలోపల నవ్వుకోక మానడు. పాండ్యరాజుగారి శైవాచారాలు తమకు నచ్చకపోయినా

" అప్పుడిచ్చకులగు బ్రాహ్మణౌఘమెల్ల
నాత్మజని భూమి విడుపలే కలిక భూతి
గడ్డముల నాన రదురాక లిడ్డ సంది
సూత్రసంహితలిటికించి దొరఁ దొడగిరి"

అని వ్రాసిన పంక్తులలో యితని చిరునవ్వు తొణికిసలాడుతూంది. కాని నవ్వుతోపాటు వారిపట్ల యీయనకు సానుభూతికూడ కలదు. ఇదే విధమైన సానుభూతితో, యితడు

వర్షకాలంలో సామాన్య గృహస్థులు పడే యిబ్బందులు చూసి, ఏడవలేక నవ్వీసరిపెట్టుకొన్నాడు.

" నానిశిఖిపంట చెఱకుల
చేనఱనవివెండిపంట చెఱకులెయగుటం
బోనంబు ప్రజకు జక్కుల
బోనంబులెయయ్యెఁబ్రొయ్యి పొగయమి వృష్టిన్.
ఇల్లిల్లు దిరుగ నొక్కింతెబ్బు శిఖియబ్బెనేనింటిలో యిడి విసరక
రాఁజదురాఁజిన రవులు కొల్పొపలెగాని కల్గదుగూడు దానఁగలిగె
నేని కూరగుట మందైనఁజెన్నొగ సుఖ భుక్తి సేకూరదా భుక్తికిడినఁ
బ్రాగ్భుక్తలకెతీరు బహుజనాన్నమునీర నారులకొదవుఁబునఃప్రయత్న
మాజ్య పటముఖ్యులయ మెన్న రాలయంగ
దారులయ మెన్న రంతిక కారజనిక
పచనసాంధ్యో గృహిణి రామిఁబడుక మరుఁడు
వెడవెడనె యార్ద్రనొగిలిరజ్జడిని గృహులు. "

ఇలాటి పెద్ద మనిషి తరహాతో కూడిన నవ్వులు అక్కడక్కడ యీ కవి రచనలో దొరుకుతాయి. కాని నిండారా నోరు విప్పి నవ్వడానికి మాత్రం ఎక్కడా జాగా కన్పింపబడలేదు.

అల్లసాని పెద్దన గారి అల్లిక జిగిబిగిలో నవ్వు నలిగిపోయి నట్లయిందిగాని సాపుగా రాలేదు. వరూధినీ ప్రవరుల శృంగారం న్యాయంగా నగుబాటు శృంగారమే. కాని రచనలో ఉన్న ఉదాత్తత నవ్వుకి మర్యాదలేర్పరిచి నిలబెట్టింది. అయినా వరూధిని తన ఊహ కనుకూలంగా పన్నిన యుక్తులు, పలికిన ఉక్తులు, చూపిన సామ్యాలు కొంత నవ్విస్తున్నాయి. " అంగనఁ గోఱయె వెన్నెల గంధర్వాంగనల పొందుగాదని సంసారాంధకూపంబడియెదికట " అని ఆమె ప్రవరునికంలో బోధించి " ఎందే డెందము కందళించు రహిచేసే కాగ్రతన్ నిర్వృతిన్ జెందున్ గుంభగత ప్రదీప కళికాశ్రీదోప నెందెందుఁబోకెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ మానందో బ్రహ్మ " అని ప్రాజదువులకి ప్రసంగానుకూలంగా వాఖ్యానం చెప్పి అతనిని లొంగదీసుకోబోతుంది. అతడణుమాత్రమైనా చలించక,

" ఈ పాండిత్యము నీకుదక్క మఱి యెందేగంటిమే కామశా
స్త్రోపాధ్యాయివినావచించెదవు మేలోహాత్రి యీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమందు నిక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీశ్రీ పథ్యాగమ సూత్ర ఫక్కికివి వో మీ సంప్రదాయార్థముల్ "

అని పలికి నిస్పృహతో నవ్వి ఊరుకొన్నాడు. కాని ఆమె అంతతో ఊరుకోక మరికొంత సాహసించి, మీదబడి క్రిందగిరవాటు వేయబడి, ఏడ్చి " చేసితి జన్నముల్ తపముజేసితి నంటి దయా విహీనతం జేసిన పుణ్యముల్ ఫలముజెందునె " అని యీసడించి, " నీచదువేల చెప్పుమా " అని ముద్దు ముద్దుగా అతనిని చీవాట్లుకూడ పెట్టి, పైగా " వెలివెట్టిరే బాడబులు పరాశరుబట్టి దాశకన్యాకేళి తప్పుజేసి " అని అటువంటి సామ్యాలెన్నో చూపి " యిసుప కచ్చడాల్ గట్టుకొను ముని ముఖ్యులెల్లఁ బామరసనేత్రలిండ్ల బందాలుగారె " అని నిజం నిలవ్వేసి అడిగినప్పుడు నవ్వురాకపోదు.

మాయ ప్రవరుని వృత్తాంతాన్ని కవి హాస్యానికి వినియోగించలేదు. ఆ ఘట్టంలో హాస్యానికి కలిగిన అవకాశాన్ని చల్లగా జారవిడిచేశు. స్వరోచి వేటకుపోయిన ఘట్టంలో ఆటవికుల వర్ణన, వేట కాండ్ర కోలాహలం కొంత హాస్య ప్రదంగా వ్రాయబడ్డాయి కాని తృప్తిగా నవ్వడానికి తగినంత అవకాశాన్ని కలిగించకుండా ఉన్నాయి. ఇంకా అక్కడక్కడ ఉక్తిచాతుర్యం, వర్ణనలు, వగైరాలు హాస్యాన్ని సమీపించేలా ఉన్నా కవి వెంటనే గంభీరతకి జాగాచేసిన కారణాన్న నవ్వుకి స్వస్తి చెప్పవలసి వస్తూంది.

రామరాజ భూషణుని కావ్యాల్లో హాస్యానికి అసలు జాగాయే చెయ్యలేదని చెప్పినా తప్పులేదు. కవి నిబద్ధప్రౌఢోక్తులైనా హాస్యానికి పనికి వచ్చేవిగా లేవు. వసుచరిత్రలో మంజువాణి దౌత్యంలో ఉన్న ఉక్తి చాతుర్యం కొంచెం హాస్యాన్ని సమీపించిన మాట వాస్తవం. చంద్రాద్యుపాలంభనం లోకూడ కొన్ని అపహాసోక్తులు కూర్చబడ్డాయి. కాని అలంకారాల బరువుదింపి, అర్థం గ్రహించి ఆనందించేలోగా మన నవ్వు హరించిపోతూంది. వసురాజుగారి నర్మసచివుడు నవ్వించడాని కనుకూలించే ప్రాతగా గాక గిరికాదేవి సౌందర్యాన్ని, నఖశిఖ పర్యంతంగల అంగ ప్రత్యంగాలతోసహా, వర్ణించడానికి వినియోగపడే పాత్రగా సృష్టింపబడ్డాడు. అసలీకవి గొప్ప శిల్పి. శ్లేషమీద యితనికి గల ప్రీతిలో పదవ వంతైనా చిరునవ్వు మీద ఉన్నట్టు కనపడదు,

పింగళి సూరన్న గారి కళా పూర్ణోదయం రచనలోనే కాక కథలో కూడ పటిష్టమైనది. కథా చమత్కృతికి తోడు వాక్చమత్కృతికూడా యీ కావ్యంలో విశేషంగా కనిపిస్తుంది. నారదుని వంటి జగడాల మారి పాత్రలు గాక స్త్రీ సహజమైన యీర్ష్యకి సరియైన రంభాది పాత్రలు కూడ యిందులో తారసపడతాయి. మాయ రంభా మాయనలకూబరుల వృత్తాంతం పొరపాటుకి నిలయమై నవ్వించేదిగా ఉంది. కాని కథ మరిచిపోయినామేమో అనే జాగ్రత్తలో పడి, మనం తీరుబడిగా నిల్చి నవ్వలేని అవస్థలోకి దిగుతున్నాం. ఈతని ప్రభావతీ ప్రద్యుమ్నంలో భద్రుని వృత్తాంతం కేవలం హాస్యరస ప్రధానమైనది. ఆ ఘట్టం కూడ, జైమినీ భారతంలోని సుదేవుని వృత్తాంతము వలెకాక, ఉత్తర కథకి అన్వయించి, కొంత సరసమై హాస్యాన్ని చేకూర్చేదిగా ఉంది. ఈ భద్రుడు పగటివేషగానివంటివటుడు. సభికులందరినీ భర్త్రాజువలె పొగిడి కానుకలుపుచ్చుకొంటూ ఉంటాడు. అదిచూసి కొందరు ధూర్త వటువులు అతనిని సమీపించి, "భద్ర, కడుసొంపులుగాఁ బొగడించుకోఁ జుమీ తలపగనిప్పుడింత తెగుదారులమైతి" మని "తమ దండపు, గోలల నున్న మాఱు గోచుల" నతనికిచ్చి పొగిడించు కొంటారు. కాని అతని పొగడ్త వారికి పూర్తిగా సంతృప్తి నియ్యలేదు. అసంతృప్తులై వారు అక్కడే తార్లాడుతూ ఉంటే, అతడు వారిని సందేహించి దొంగలని నీలాపనిందవేసి, ఎట్లయినా వారి నక్కడ నుండి దూరంగా తొలగించ బోతాడు. దానికి వారు కోపించి, వాని పొగడ్తకి మించిన విపరీత ధోరణిలో,

"ఏముమ్రుచ్చులమె యూహింప మ్రుచ్చుదనాల పుట్టిన యిండ్లు మీ బోంట్లుకారె
ఆటవాండ్రని నమ్మియనుమతింపగ నెట్టి పురమైన నశ్రమంబుననుజొచ్చి
పగలెల్ల నాటల బ్రమయించుచును సందుగొందులెల్ల నెటింగికొనుచు రేలు
కన్నగాండ్రగుచునగళ్లు ప్రవేశించి యందు నెంతటివారలడ్డమైనఁ
జక్కడచుచుఁ బేను గ్రుక్కిన పాటుగా
నిష్టమైన యర్థ మెల్లఁబడసి
బ్రతుకుచునికి స్వభావ"

మని పల్కి అతన్ని నిందిస్తారు. ఈ ఆక్షేపంలోగల నిత్యసత్యం వజ్రనాభవధకి ఉపాయాన్ని వెల్లడిస్తుంది. కథాగతిలో అతికి యీ వృత్తాంతం చాలా స్వాభావికంగా ఉందికాని హాస్యం మాత్రం బలాత్కృతంగా ఉంది. భద్రుని పొగడ్త అసలు హాస్యాన్ని మేల్కొల్పే

ధోరణిలోనే లేదు. ఈ ధూర్త వటువుల అల్లరినైనా మరికొంత పెంచి వర్ణించినట్టయితే కొంత కూరిరవినోదమైనా కలిగి నవ్వుకి బలమిచ్చి ఉండును. హాస్యం యీ కవిదృష్టిలో లేదనడానికిదే ఉదాహరణచాలు.

ముక్కు తిమ్మన్న గారి పారిజాతాపహరణం. కథలోను, కూర్పులోను, హాస్యం లోను కూడ ప్రత్యేకత గడించుకొన్న కావ్యం, ఇది నాటకగతిలో నడిచిన ప్రబంధం. కవి స్వతః హాస్యప్రియుడు. కథను హాస్యప్రదమైన సంపులోకి త్రిప్పి నడపడంలోగాని, ప్రసంగ ప్రాప్తమైన విషయంలో ఉన్న వికృతిని చక్కగా ధ్వనించి నవ్వించడంలోగాని, నవ్వంగా మాటాడుతూన్నట్టే ఉండి అపనవ్యాన్ని అతి చమత్కారంగా ధ్వనించి హేళన చేయడంలోగాని అపసవ్యాన్నైనా సవ్యమని సమర్థించి చూపగల వికటప్రజ్ఞలోగాని తిట్టినా ముద్దులొలికే ధోరిణిలో తిట్టి వినిపించగల నేర్పులోగాని, యితనితో సాటి అనిపించుకో దగిన కవి, రాయలవారి దర్బారులో యింకొకడు లేడంటే అతిశయోక్తి కాదు. బహు భార్యాప్రియుడైన భర్తపాట్లు ఎవరినైనా నవ్వించి తీరుతాయి. అదే విషయం యీ పారి జాతాపహరణ కావ్యానికి ఆధారమైన విషయం. ఇక మగనినింకొకరికి ధారపోయించి తిరిగి కొనుక్కోమని చెప్పిన కథకంటె మించిన హాస్యప్రదమైన కథ ఎక్కడోగాని దొరకదు. ఇలా ఆద్యంతమూ కథలో హాస్యాన్ని అంతర్గతంగా నిల్పివ్రాసిన కావ్యం తెలుగులో అంత వరకు పుట్టలేదు. ఈ తరువాత వెలసిన కావ్యాల్లో కూడ యింత సరసమైన హాస్యం మన కందజేయబడలేదు.

“కులమును రూపమున్మగని కూరిమియుం గలదాన నంచు నీవల” రుక్మిణి, ఆవల సత్యభామ ఒకర్నిమించి ఒకరు విర్రవీగేసరికి “రవ రవల్వాడ మెన్నది వారికెంతయున్” అని ప్రారంభించినకథలోకి నారదుని దింపడం అనేది హాస్యానికి చక్కని నాంది, ఆ వచ్చిన నారదుడూరుకోక ఓ పారిజాత పుష్పాన్ని శ్రీ కృష్ణుని చేతిలో పెట్టేసరికి, పాపము, “మాధవుడాత్రొన్ననం గయికొని భీష్మక నందనం గనుంగొని, సత్యభామ తలంపున నిలువ” గానే తటపటాయించి ఎవరికిస్తే ఎవరికి కోపం వస్తుందో అని బెదరి, కొంతసేపు గ్రుక్కిళ్లు మింగి నీళ్లు నములుతాడు. చివరికెట్లో తెగించి ఆ పువ్వు రుక్మిణి కిచ్చేసరికి, సమయం కనిపెట్టి నారదుడు పువ్వునీ, పువ్వు ధరించిన రుక్మిణినీ తెగపొగిడి, అంతతో ఊరుకోక “సత్యయింతకున్ గ్రుక్కక యున్నె నీ మహిమ సూచిన బోటులు విన్నవించినన్” అని అక్కడ ఉన్న సత్యాదేవి సఖికి ఊహలందించి, జల్లవలసే అక్షతలు జల్లిగాని వెళ్లడు. ఈ ఘట్టంలో శ్రీకృష్ణుని అవస్థ చిత్రించదగినది, ఏదో తప్పు

భాగవతాల్లోపడుతూ: రవ్వలేకుండా, -రచ్చకెక్కకుండా ఉన్నవాళ్ళమధ్య గంగిడీ పెట్టి తమాషా చూసి ఆనందించే నారదులు నాడుగాదు నేటికీ మన మధ్య ఎందరో కనిపిస్తారు. వీరు పెట్టే తంటాలకి తలాతోకా అనేవికూడ ఉండవు. ఈ తంటాకోరులకి అనుకూలంగానే ఉంటాయి అభిమానస్థులై అంటిపెట్టుకోతిరిగే వారు చెప్పే చాడీలుకూడ. వేను భేతాళంచేసి చెప్పి, ఆరిపోతూన్న అగ్గినైనా ఆరినివ్వక, పుల్లలువేసినట్లో కటికెరెండు జోడించి చెప్పికాని నిద్రపోని ఘటాలు వీరు. ఈ ఘట్టంలో సత్యభామ చెలికత్తె యిదే విధంగా వర్తించింది. సత్యదగ్గరకుపోయి, "అమ్మా యేమని చెప్పెదు" నని ముక్కు మూరెడూ మొగం బారెడూ చేసుకొని, పారిజాత పుష్ప వృత్తాంతాన్ని సాకల్యంగా ఆమెకు వినిపించి

" ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు శౌరివినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁబలికెం బతిగూర్చి దానినా
యంతటివారు లేరనియహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
దంతున వచ్చుసత్యగరువంబికఁ జెల్లదటంచు మానినీ. " అని

కూడ అందించిగాని నోరుమూయదు.

ఇదంతా విన్నతరువాత సత్యభామకు కలిగిన కోపం నారదుని మీద కాదు, రుక్మిణి మీద అంతకంటెకాదు. " ముని యేమిసేయు రుక్మిణిఁగొనఁగారణమేమి " అని ఆమె వారిద్దరినీ ఒడ్డున పెట్టింది. " ధూర్త గోపాలుఁడు నేసినచెయిదమేమి చెప్పెదు " నని మగనిమీద విరుచుకపడి

" పరికింపరు తమ జాడలు
తరుణుల తెగులములు నమ్మఁదగదంద్రుమదిన్
శరదంబుదచలచిత్తులు
పురుషులె పోవారి నమ్మఁబోలునె చెలియా. "

అని మగవాళ్ళందరినీ ఒకే కొలికికి తెచ్చి విడిచింది. దుఃఖము హెచ్చి, మచ్చరం తలకెక్కి, కోపం ముమ్మరమయేసరికి, సాధిద్దామనే ఉద్దేశం సహజంగానే కల్గి, ఆమె " మాసిన చీర గట్టుకొని మానముతోడ నిరస్తభూషయై వాసెన కట్టుగట్టి " అలకపాన్పునధిరోహించింది కాని యింత దుఃఖంలోనూ శ్రీకృష్ణుడక్కడికి రాక మానడనే నమ్మకంగాని, యింకా ఫాలేదేమి అనే ఆరాటంగాని ఆమెను వీడలేదు. శ్రీకృష్ణుడు వచ్చేడు. బెదురుకుతూనే.

వచ్చేడు. 'కేతనపటాంచల చంచలమైన తాల్మి' తోనూ, 'బండికంట్లపగిదిజా భ్రమియించు మనంబు' తోనూ వచ్చి, అలికిడిలేని ఆభవనంచూసి, అనుకొన్నంతా అయిందని అనుమానించి, అలక పాన్పుపైనున్న భార్యను అనునయించడానికి అన్నివిధాలా ప్రయత్నించి, తలకిపాదాలు మోసేలా నమస్కరించి, తాపుదిని, 'అక్కట మానవుగదా యిక నైన సరాళకుంతలా' అని బ్రతిమాలేడు. దాని కామె చివ్వుమని లేచి,

> " ఈయనగారి పుం బ్రియము లీపసి లేమొగి మిచ్చుమాటలే
> లా నిను నమ్మి యుండిన ఫలంబిద తోడనె కర్గనీకు నీ
> యానసుమి ననుం జెనకి యారడి వెట్టిన నవ్వు వారలం
> గాన వలుం గునే పనుల కాపరి భావజకర్మ మర్మముల్ "

అని ప్రారంభించి, అనవలసినవన్నీ మొగం ముందే అనేసి చాలక పైగా ఏడుపుకి మొదలు పెట్టింది. కాని యింత ఏడుపూ "దేవతా కేలివనంబు సొచ్చి యనికిన్ బల నూచనుం డెత్తి వచ్చినన్ గెలుపండుగ ౘోలి యిటుం దెచ్చెదం బారి జాతముజ్" అనే పలుకులు కృష్ణునినోట రావటం తడవుగా మాయమయింది.

ఇలా ఒకదాని కొకటి అతికినట్టుగా ఘటనలు పేర్చి, అంతటా వికృతులు కూర్చి సహజంగా భాసింపజేసి, ఎక్కడికక్కడే మానవ స్వభావంలో ఉన్న లోపాల్ని చక్కగా ధ్వనిస్తు, కథ చదువుతూన్నంతసేపూ చిరునవ్వుతోనే చదివించగల చాతురి యీ కవిలో ఉన్నంతగా మన తెలుగు కవులెందరిలోనో లేదు, ఉత్తరకథలో సత్యభామచేత నారదునికి శ్రీ కృష్ణుని ధారపోయించిన చోటకూడ ఎంతో హాస్యం అందించబడింది. నారదుడు తన తంబురా, చిడితలు, స్వగారాలు కృష్ణునికిచ్చి మోయించటమే కాక "పొమ్మ పొమ్మని యొక కొంతపోప బోప, రమ్ము రమ్మని మరల జేరంగ బిలిచి" ఎన్నో ఆగడాల పాలుచేస్తూ 'నవ్వటాలకు బనులు' కొంటాడు. ఇలాటి ఘట్టాలుగాక అక్కడక్కడ చక్కని పరిహాసోక్తులుకూడ యీ కావ్యంలో ఉన్నాయి, పైగా ఈ క్రింది బావమరదుల వికటాలు చూడండి,

> " బలి పనుజేంద్రు గట్టితని భల్లుగ విందుము గాని నేడు మా
> చెలి యిద పుష్ప దామకముచే నిను గట్టగఁగంటి మింక నె
> మ్మెలు పచరింప రాదనుచు మేలములాడెదు సత్యబోంట్ల స
> న్నల నెసలొల్పు చుంగలన సవ్వరి ధర్మజ భీమ ఫల్గునుల్ "

ఇట్లా వాక్ క్రియా కలాపాలన్నిటిలోనూ హాస్యాన్ని అందించిన కవి, ప్రబంధకవులలో యీ ముక్కుతిమ్మన్నగారొక్కరే.

తెనాలి రామలింగ కవి 'వికటకవి' బిరుదాంకితుడు. కాని యీతడు వ్రాసిన కావ్యమేదీ హాస్యమయమై మనకు దొరకలేదు, పాండురంగ మహాత్మ్యము వ్రాసిన రామకృష్ణుడే యీ రామలింగడని నిర్ణయించుకొన్నా నాడే 'వికటకవి' శబ్దం మరీ నేతిబీరకాయ వాటంగా తయారౌతుంది. ఈ కావ్యం యితనిది కానినాడు మనకు మిగిలేవి యితని చాటువులు మాత్రమే. అవి కూడ చదవగానే ఫటాలున నవ్వించడానికి తగిన ధోరణిలో ఉన్నవి చాలకొద్దిగా ఉన్నాయి, ఈ చాటువులకి సంబంధించిన కథలెన్నో ఉన్నాయి, ఆకథలు చెప్పే అక్షతలు వేసుకొన్నవాళ్ళకేగాని, అందుకు నోచుకోనివారికి యీ పద్యాల్లో నవ్వొదిగిన విషయం కనపడదు, ఆ కథలుకూడా కొన్నింటికి ముందూ వెనుకా కూడ చెప్పుకోవాలి,

" కెంగేల రామకృష్ణుని
బంగరు కడియంబులుండ బండితుడగునా
జంగులు జల్లులు గల్గిన
సింగారపు టూరకుక్క సింగంబగునా. "

అనే పద్యం యిదేరకమైనది. ఇలాటి వెన్నో యితని చరిత్రకీ, చర్యలకి సంబంధించిన చాటువులు ఉన్నాయి. కథ చెప్పుకోనక్కరలేకుండా నవ్వొదగిన పద్యాలు కూడ వాటికి సంబంధించిన కథ వింటే యింకా ఎక్కువగా నవ్వించేవిగా ఉంటాయి.

" బాచా బూచుల లోపల
బాచన్నే పెద్ద బూచి పళ్ళుందానుక్
బూచన్న రాత్రి వెరతురు
బాచన్నను జూచి పట్టపగలే వెరతుర్. "

అనే పద్యం యితడు తనకుమారుని మీద, భార్య కోరిక మీద, ఏరికోరి పఠించిన దని వింటే నవ్వు మరికొంచెం ఎక్కువగా వస్తుంది. మరికొన్ని పద్యాలు విని మనం నవ్వినా పూర్వాపరాలు తెలుసుకొందామనే జిజ్ఞాస ప్రకటించకుండా ఉండలేము " మేకతోకకు మేకతోక, మేకకు తోకమేకకో, తోకా మేకా తోక మేక " అనే సీస పద్యం యీరకమైనది "అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ. అనాచార భయం నాస్తి తిప్పశ్శాస్త్రస్య

సన్నిధే" వంటి చాటువులు అసభ్యముగా కూడ ఉన్నాయి. మరికొన్ని చాటువులు యితనివో, కావో తెలియదు. మీద వ్రాసిన బాచన్న మీది పద్యం అడిదము సూరకవిగారిదని ప్రతీతికలదు. అసలు బాచిగాడే రామలింగడని మరో ప్రతీతి ఏది ఎలా ఉన్నా యీయనకు సంబంధించిన కథలు మాత్రం చక్కని హాస్యాన్ని కల్గించేవనే సంగతి రూఢి. ఈ కథలు కల్పితాలా? నిజాలా? అంటే అదివేరే సంగతి. హాస్యపూరితాలనేది నిశ్చయమైన సంగతి. వీటిలోగల యుక్తిచాతుర్యం వాక్చమత్కృతి, ఘటనా వైదుష్యం వగైరాలన్నీ కడుపు చెక్కలయ్యేలా నవ్విస్తాయి. ఈ కథలనినా, యీ కవి అనినా తెలుగు వారికెంత అభిమానమో తెలుసుకోనేందుకు ఇతని పేరెత్తితే ఏడు కథలు చెప్పిగాని ఊరుకూకూడదనే లోకోక్తికి మించిన ప్రమాణం వేరే అక్కరలేదు. ఇంతగా హాస్యాన్ని జీర్ణించుకొన్న యీ కవి, కలం పట్టుకొనే సరికి, మూతి బిగించి, ఎక్కడలేని గంభీరతనీ ఎరువు దెచ్చుకొని, ప్రౌఢాతి ప్రౌఢంగా రచన సాగించి, హాస్యాన్ని తననీడలో కూడా నిలవనివ్వలేదంటే అది మన ప్రారబ్ధం.

ధూర్జటి కవి వ్రాసిన కాళహస్తి మహాత్మ్యములో కూడా మనకు నవ్వు దొరకదు. కుమార ధూర్జటి రచనలు కూడ యిదే మచ్చు, మొల్ల వ్రాసిన రామాయణం ప్రౌఢతలో వీటికి తక్కువదే కాని హాస్యం విషయంలో వీటికి తుల్యమే. తంజావూరు రఘునాథ రాయలు వ్రాసిన వాల్మీకి చరిత్రలో తగు మాత్రంహాస్యం కనిపిస్తుంది కాని అది ఏవో కాకతాళీయంగా వచ్చినట్టిసె. వాల్మీకి ప్రారంభిక జీవితానికి సంబంధించిన ఘట్టంలో యీ హాస్యం ఎలాగో దొర్లింది. చేమకూర వేంకట కవిగారి విజయవిలాసంలో ఉక్తిచాతుర్యం కొంతకు కొంతగా హాస్యాన్ని సమీపిస్తూంది. సుభద్రార్జునుల వివాహ ఘట్టం స్వతః హాస్యానికనుగుణమైన కథగలది. మాయమునిగా వచ్చిన అర్జునుని చేష్టలు నన్నయగారి వంటి ఋషికే నవ్వుగొలిపి "మునీంద్ర నీకుఁబన్నె నలినాక్షులందు మది నిల్పఁగ" నని శ్రీకృష్ణునిచేత పరిహాసింపజేసేయి. ప్రసంగ ప్రాప్తమైన యీ హాస్యాన్ని విజయవిలాసకర్త విడిచిపెట్టకుండా పోషించిన మాట నిజం. పైగా సుభద్రార్జునుల సంభాషణను నాటకీయ వ్యంగ్యధోరణిలో నడిపించి హాస్యానికి వన్నె బెట్టేడు. బలరామాదులకు తెలియకుండా ఈ వివాహాన్ని జరిపి మరదిగారి మనోభీష్టాన్ని నెరవేర్చిన కృష్ణుని నటనలు, అంతా అయిన వెనుక బలరాముడు పడిన అక్కరమాలిన కోపతాపాలు. రుక్మిణీ సత్యాదులు సుభద్రనాడిన పరిహాసాలు వగైరాలు చక్కనిగార్హస్థ్య హాస్యాన్ని అందించేయి. ఇలా నిత్యజీవితంలో ఉన్న హాస్యం కావ్యంలోకి రాగలగడం తెలుగులో చాలా అరుదు. అసలు మన వారు జీవితాన్నీ సాహిత్యాన్నీ వేర్వేరు పట్టాల మీద సమానాంతర దూరంలో నిలిపి నడి

క్షించేరు. ఎక్కడో ఒకరిద్దరు కవులు కొంచెం సాహసించి వీటిని కలపడానికి ప్రయత్నించినా, మిగిలిన వారికి నచ్చదనో, అందరూ హర్షించరనో భయపడి, భావదాస్యానికిగురియై 'ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా' అని నిస్పృహతో నిట్టూర్చి, తమ ప్రయత్నాన్ని విధిలేక విరమించుకొన్నారు. ఇలా చాటుమాటుగా ప్రయత్నించి, జీవితంలో ఉన్న హాస్యాన్ని సాహిత్యంలోకి స్వల్పంగానైనా తెచ్చిన వారిలో యీ చేమకూర వెంకట కవిగారొకరు. ఇదే విశిష్టమైన ప్రయత్నం అప్పకవి వ్రాసిన శశిరేఖా పరిణయ కావ్యంలో కూడ కనిపిస్తుంది.

శశిరేఖా పరిణయంలో కథ మూలంలోనే వ్యంగ్య హాస్యానికి వీలిచ్చేదిగా ఉన్న కథ అన్నివిధాలా అనుకూలుడైన వరుడుగా మేనల్లుడింట్లోనే ఉన్నప్పటికీ, 'దూరపు కొండలు నునుపు' అన్నట్లు ఏదైపై సంబంధమో తెచ్చి, కుమార్తెకు కూర్చదలచే పెళ్లిపెద్దలు నేటికీ కనిపిస్తారు. పీటల మీద పెళ్లి తప్పించి ఎత్తుకు పైయెత్తులువేసి కార్యాన్ని సానుకూలం చేసుకొనే ప్రాజ్ఞులు కూడ నేడు లేకపోలేదు. ఇలా స్వతః హాస్యమయమై ఉన్న కథ యీ శశిరేఖా పరిణయం. ఇందులో ఉన్న వికృతిని మరి కొంత వృద్ధి జేసిన విషయం ఘటోత్కచుడు మాయ శశిరేఖగా అవతరించి, వివాహ మంటపాన్ని రణ రంగంగా మార్చి రసాభాసచేయటం. ఈ వివాహ ఘట్టంలో చూపిన రాక్షస మాయలన్నీ అద్భుత హాస్యాలకి చక్కని ఆలంబనలుగా ఉన్నాయి. అందరికంటికీ శశిరేఖగా కనిపించే ఘటోత్కచుడు, ప్రస్తె కట్ట వచ్చిన లక్ష్మణ కుమారునికి మాత్రం భూతంలా కనిపిస్తాడు. ఈ మగ పెళ్లివారి మీద అటు కవికిగాని ఇటుమనకిగాని సానుభూతి లేదు, కాగా వారెంతగా ఏడుస్తే మనకంతగా నవ్వు కలుగుతూంది.

" చూడ లక్ష్మణున కాసుపతి కుందేలుగా గంతులు వైచుచుఁ గానబడియె
వెంబడినతఁడాత్మ వెఱగంది చూడఁగాఁ బిండిఁ బొక్కుచు గండు
బిల్లియయ్యె
వగచుచుఁ దెరవంచి వాఁడు వీక్షింపఁగాఁ గొక్కిరింపుచుఁ బండు
గ్రోతియయ్యె
నిదిచిత్రమని యెంచి పదిలంబుగాఁ జూడ రోమముల్ పెరిగి
భల్లూకమయ్యె.
మదిని భ్రమఁజెందితినో యంచు మరియుఁ జూడ
మినుకు కోఱల సర్పమై మీదికెగసె

నపుడు భయమున రెప్ప లల్లార్చు కొనుచుఁ
బండ్ల నిగిలించి విలపించెఁ బెండ్లి కొడుకు."

ఈవిధమైన రాక్షసమాయలెన్నో యీ ఘట్టంలో విస్తృతంగా వర్ణించ బడ్డాయి. ఇవి గాక ఘుర్జరీదువులతో మాయ శశిరేఖ పల్కిన పలుకులు కూడ ముచ్చట గొల్పేవిగానే ఉన్నాయి,

" పతియుననుఁగూడి భూమిపైఁ బ్రదికె నేని
మదన సౌఖ్యంబుతో నిమ్ముఁ మదిపలంపఁ
జూడవచ్చినఁ గన్నెత్తి చూడ నేను
ముసలి పాడంబు లాన రెయో ముగుదులార.
తాల ధరుఁడైన హరుఁడైన ధాతయైనఁ
దోడరి నాయింటి వాకిలిఁ ద్రొక్కఁగలరె
నేడు మొదలుగ నాకు మారాడి రేని
యత్తమామల గణిపై నట్టెరాతు."

ఇలాటి మాటలు నిజానికి విరసంగానే ఉన్నా సందర్భాన్ని బట్టి సహ్యంగానే ఉన్నాయి సందర్భాన్ని పురస్కరించుకొని, సరసంగానో విరసంగానో, యీ మాత్రమైనా నవ్వించగల వారీకాలపు కవులలో చాల తక్కువ.

కూచి మంచి తిమ్మకవిగారి కృతులలో మనకంతగా హాస్యం దొరకదు. సరిగదా వీరు హాస్యానికై చేసిన ప్రయత్నం కూడ చాలాచోట్ల విఫల ప్రయత్నంగా కనిపిస్తుంది. నీలా సుందరీ పరిణయంలో గొల్లరేని యెదుట బ్రాహ్మణుడు శ్రీ కృష్ణుని లీలలు వర్ణించిన ఘట్టంలో నైతేనేం, గొల్లరేని పరివారాన్ని వర్ణించినచోట నైతేనేం, హాస్యాన్ని రెక్క బట్టుకొని లాగడానికి చేసిన ప్రయత్నం ఎంతైనా కనిపిస్తుంది, వీరేకాదు వీరి తరువాత తిరిగి తిరపతి వేంకట కవులకాలం వరకు గల మధ్య కాలంలో వెలసిన చాలా మంది కవులలో హాస్యంలేకపోవడమో, వస్తుబలవంతపు బాహ్మణార్థముగా రావడమో జరింగింది. అసలు కావ్యాలే సహజంగానూ స్వతంత్రంగానూ వచ్చినవికావు. అన్నీ యించు మించు మక్కికి మక్కిగా వ్రాసిన ప్రబంధాలే, అలాటప్పుడు హాస్యానికి సహ్యతగాని నవ్యతగాని కలగడం స్వప్నవార్త. తెలుగు సాహిత్య చరిత్రములోనే యీ కాలం ఆకు రాల్పుకాలం. తిరిగి వసంతోదయం గద్యంతోగాని కాలేదు.

అస్తవ్యస్తంగా ఉన్నా యీకాలంలోనే హాస్యకావ్యాలనే పేరుమీద కొన్ని అధిక్షేప కావ్యాలు, కొన్ని బూతు కావ్యాలు వెలసేయి. రావణ దమ్మీయ చంద్రరేఖా విలాపాదులీ కాలపు రచనలు. ఇలా బూతుహాస్యం కాక పోయినా శృంగారాన్ని విచ్చల విడిగా అందించిన తారాశశాంక విజయరాధికాస్వాంతనాదులు కూడ యిదే కాలానికి చెందిన ఉజ్జ్వలరచనలు. ఈ శృంగార వ్యామోహం ఉత్తర రామాయణం వంటిపురాణకావ్యాల్లోకి కూడ వ్యాపించింది. ధరణిదేవుల రామయ్య మంత్రి గారి దశావతార చరిత్ర యీ విషయంలో మరో రెండాకులెక్కువగా - తొడిగింది. అయితే, యీకవి కొంత హాస్యప్రియుడు. కాని అది రసిక హాస్యం. శృంగారాంగమైన హాస్యాన్ని పోగలిగినన్ని పోకడల పోనిచ్చి నడపగలచాతురి శ్రీనాథుని తరువాత తిరిగి యీ రామయమంత్రిలో కనిపిస్తుంది. ఈ దశావతార చరిత్రలో కృష్ణ బలరామావతారాలు రెంటిలోనూ శృంగార హాస్యాలు ముమ్మరంగానే అందించబడ్డాయి. ఇందులో చిలిపిచేష్టలు, జగడాలు, అల్లరులు, సరసాలు, సరాగాలు సయ్యాటలు, పంతాలు, పరిహాసాలు అన్నీ స్థానం సంపాదించాయి. యీ హాస్యంకూడ మన మెరిగినదీ, నిత్యజీవితంలో అంతోయింతో అనుభవిస్తూన్నదీ, జీవితాన్ని సరసంగా పిరాయించి నడపగలిగినదీ అయివుంది. ఇక జారత్వంలో ఉన్న సాహసం, చతురత, తత్పరత, వగైరాలుకూడ హర్షాద్భుతమిశ్రితమైన చల్లని హాస్యాన్నికూర్చేవిగానే వర్ణింపబడ్డాయి. ఎదుటి వారిని మూర్ఖులుగాచేసి స్వప్రయోజనాన్ని సాధించుకొనే గోపకాంతల అభిసారంలో ధ్వనించిన హాస్యం యీ క్రింది పద్యంలో చూడండి.

" అత్తయెక్కడికంచు నడుగ నెక్కడికి లేదిదుగో వచ్చెదనంచు నేగె
నొకతె
కోడెలు విడిపించుకోనెనంచు వాకిట మఱది లోపలికంచి జరిగె
నొకతె
పొరుగింట నుండు మా పొరుగింటి పడుచునుజూచి వచ్చెదనంచులేచె
నొకతె
మంచినీళ్లకుబోయి మఱలివచ్చెదనంచు వేడ్కమీఱగనేగె వెలదియొకర్తు
తోవలో తోడికోడలు పోవజూచి, యేడకేయన్న నదియు నీ
వేడకన్న,
గూయకు మటంచు నిద్దఱుగూడి తోడి దొంగలై పోయిరాగోపధూర్తు.
కడఁకను, 72

కూర్మావతార ఘట్టంలోకూడ సరసమైన హాస్యం పోషింపబడింది. వాసుకి తల తోకలు పట్టుకోవడంలో రాక్షసులు చూపిన తెలివితక్కువతనమేగాక, తరువాత జగన్మోహినిని చూసి, తమ్ముతామే మరిచి, అమృత కుంభాన్ని ఆమె చేతికిచ్చి, మోసపోయిన చందముకూడ హాస్యమయంగానే వర్ణింపబడింది. ఇక యీ ఘట్టంలో బలి చక్రవర్తికీ జగన్మోహినికీ మధ్య నడచిన సరసోక్తులుకూడ, సందర్భాన్ననుసరించి, చల్లని హాస్యాన్ని చేకూరుస్తున్నాయి. ఈ పరాచకాలు అమృతము పంచటం పూర్తి అయేదాకా నడిచి, బలినీ, తదనుయాయులనూ చివరివరకూ మూర్ఖులుగాచేసి నవ్వులపాలు చేస్తున్నాయి. కాని శృంగారం వినాగా యీ కావ్యంలో ఎక్కడా హాస్యంకనపడదు. అదైనా శృంగారాన్ని మించి వెళ్లిన పట్లు తక్కువ. శృంగార వర్ణనలో యీ కవి ఔచితికూడ పరికింపడు. రామావతార కథలో విశ్వామిత్రుని నోట రామలక్ష్మణులకు చెప్పించిన అహల్యా వృత్తాంతం వచ్చి శృంగారంలో పది అహల్యా సంక్రందనీయ కావ్యాలకి సరిపోయినంత సామగ్రితో నింపబడింది.

అడిదము సూరకవిగారు తిట్టుకవిత్వానికి ప్రసిద్ధులు. ఈయన పేరుకి రాజాస్థాన కవిగాని వాస్తవానికి స్వతంత్రుడు. 'శాపాదపి శరాదపి' అనే మచ్చులో ఎంతవారినైనా ఎదిరించి, తిరస్కరించి తిట్టి లొంగదీసుకొనే రకం. కలంతోపాటు కత్తిగూడా నడుమున గట్టి తిరిగిన వ్యక్తి. నియోగ్యానికి పెట్టినది పేరు. తత్కాలీనవైదిక కవి అయిన రేకపల్లి సోమప్పగారీయన బాధపడలేక, "జిలిబిలి పలుకులవెలదీ, పలుగాకిన కారగుల్ల పాలైతిగదే, యిలలో వైదిక విద్వత్తిలకంబులకేమి దిక్కు తెలిపితివమ్మా" అని దైన్యమోడుతూ చెప్పిన పద్యం. ఆ కాలపు కవుల వ్యక్తిగతద్వేషాలు శాఖాగతంగా మారి ఎలాచెలరేగేయో చెప్పక చెప్పుతూంది, సూరకవిగారి ధోరణిలో యీ మృదుత్వం కూడ కనపడదు.

"తట్టెడంత విభూతిపెట్టి తాతలనాటి కుండనాల్ వీనుల గునిసియాడ
మైలగ్రక్కెడు శాలుమడతలు నెరసిన బోడి బుర్రలమీద బొసగజుట్టి
ప్రాత నీరుంగావి పంచెలు వృషణముల్ గనుపింపగా డొల్లు కచ్చగట్టి
బరగు దుష్పండిత బ్రహ్మ రాక్షసులచే గవితారసజ్ఞత కట్టువడియె
కాన నేరీతి జూచెదో కరుణ మాధ్వ
సుల కవిత్వమేరీతిని నూటిజేసి
రక్ష జేసెదో నీవు మారక్షకుడవు
జానకీ ధామ దేవతా సార్వభౌమ,"

అని యితడు సోమప్పకవి నుద్దేశించి చెప్పేడు. ఇంత ఘాటుగా ఎదిరించే యీస్వభావానికి తోడు యీయనలోగల విశేషప్రజ్ఞ ఆసు కవితాధార. అనువుగా యీయన చెప్పినచాటువు లెన్నో ఉన్నాయి. అందులో కొన్ని హాస్యానికి సంబంధించినవి కూడ ఉన్నాయి. కాని యితని హాస్యం వెంకితనంతోకూడి వెళ్లసుగా ఉంటుంది. మోటుగానైనాసరే ఒకరిని ఆక్షేపించడంలో యితని హాస్యం ముందంజవేస్తుంది. ఇతని ప్రబంధాల్లో మనకెవ్విధమైన హాస్యము దొరకక పోయినా, యీ అధిక్షేప హాస్యం ( Satire ) మాత్రం, యీయన వ్రాసిన రామలింగేశ శతకంలో హెచ్చుగా లభిస్తోంది. ఈ శతకంలో ఆనాటి విజయ నగరాస్థాన తాత్కాలికాధిపతులైన సీతారామరాజుగారి దుర్నయాలెన్నో వెల్లడించ బడ్డాయి. "మాన్యమ్ము లీయసమర్థుఁ డొక్కఁడులేడు మాన్యముల్ చెరుప సమర్థులంద" రని చెప్పిన పద్యం వంటి వెన్నో, యీ రాజుగారి నుద్దేశించి వ్రాసిన పద్యాలీశతకంలో ఉన్నాయి. ఇలా దోషాన్ని వెల్లడించడమేగాక ముద్దు ముద్దుగా తిట్టి దీవించినట్టి ధోరణికూడ కొన్ని పద్యాల్లో కనిపిస్తుంది, ఈ తిట్లు ఇలాటి వ్యక్తులెవరికైనా సరే అన్వయిస్తాయి.

" పదుగురు గ్రోతివెంబడి సంచరింపరే వాహకుల్లేరె శవంబు నకును
గంగిరెద్దుకులేవె ఘన తూర్యరావముల్ కలిమిగల్లదేనారకాఘినులకు
బులిగోవు జంపి నక్కలను బోషింపదే స్థూల కాయము లేదె
దున్నలకును
బుద్ధిపంటికిలేదె పుట్టంబుజుట్టుట వేణుధరుండెన్న నెంటరాడె
న్యాయపద్ధతి నడవని యవని పతికి
నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొఱకు
నంతనమున జూడ వలయు నాయయ్యసుఖము
రామలింగేశ రామచంద్ర పురవాస."

ఈ విధంగా ఆలంబనానికి వ్యాప్తి కలిగించి, నీతిజోడించి, నిజాన్ని వెల్లడించిన కారణంచేత యీ శతకంలో ఉన్న అధిక్షేప హాస్యం మిక్కిలి సరసంగా ఉంది. ఇదే ధోరణిలో లోకవృత్తాన్ని యీసడిస్తూ వ్రాసిన పద్యాలు కూడ యీశతకంలో చాలా దొరుకుతాయి. అనాచారం, అన్యాయం, అత్యాచారం, అధికారమదం, మిథ్యాభిమానం వగైరా మానవ సహజమైన లోపాలన్నిటినీ, చక్కని సామ్యాలుచూపి అపహసించిన పద్యా లిందులో ఎన్నో ఉన్నాయి.

ఈ కాలంలో మనకు శతకాలు హెచ్చుగా లభించాయి. ఈ శతకాల్లో కొన్ని కేవలం హాస్య పూరితాలుగా కూడ ఉన్నాయి. మరి కొన్నిటిలో హాస్యోపమానాలు కూర్చి అపసవ్యమైన విషయాన్నల్లా యీసడించి సవ్యమైన నీతిని బోధించడం జరిగింది. వీటిని గురించి తరువాత ప్రకరణంలో మనవి చేస్తాను. ఈ కాలపు యితర కవులలో హాస్యం కోసం వెదకడం వృథాశ్రమ. ఈ చివరి కాలంలో కొంత హాస్యమయమైన కథను ఇతివృత్తంగా గ్రహించి వ్రాసిన కావ్యం ధూళిపాళ్ళ కృష్ణకవిగారి "గణనాథాభ్యుదయము." ఈ కావ్యంలో గజాసురుని తపస్సు, శంకరుడాతనికి వరాలు ప్రసాదించటం, ఫలితంగా శివుడతని గర్భంలో చెరపడ్డం. విడిపించడానికని బ్రహ్మాదులు గంగిరెద్దవేషంతో గజాసురుని వద్దకురావటం, గంగిరెద్దుగా నటించిన నందికోరిక పై గజాసురుడు శంకరుని విడిచి ప్రాయోపవేశం చేయటం, ఇంటికి వచ్చిన శంకరునికి వాకిట కాపున్న కుమారుని ( వినాయకుని ) తో వాగ్వాదం జరగటం, కోపించి శంకరుడాతని సంహరించటం, పార్వతి విలపించటం, తిరిగి చచ్చిన కుమారుని బ్రతికించి, గజాసురుని తల వానికి జోడించటం, వరాలిచ్చి గణాధిపతిని చేయటం, వగైరా వృత్తాంతాలేగాక స్యమంతకమణి కథ కూడ జోడించి వ్రాయబడింది. పూర్వభాగంలో చక్కని హాస్యం అందించబడింది. గంగి రెద్దువేషఘట్టంలో హాస్యం చాల స్వాభావికంగా ఉంది. శంకరునికి గణపతితో జరిగిన వాగ్వాదం కూడ చక్కని హాస్యాన్ని కూరుస్తోంది. వచ్చినవాడు శంకరుడని గణపతికి తెలియదు. తన యింటికి తనను పోనీయకుండా అడ్డగిస్తున్న యీకుర్రవాడెవరో యీశ్వరుడెరుగడు. ఈశ్వరుడతనితో,

"బాలక నీవెవ్వండవు
ప్రేలంతయు లేవు నన్ను వెరపించెద వీ
శూలం బెక్కడదొరకెను
లే లెమ్మడ్డెదవు భీతి లేశము లేకన్."

అని పలికి అంతకూ వినకపోతే, "వెఱ్ఱివాడవు నీకు వివేక మేమి తెలియకున్నది పోపొమ్మ" అని మందలించేడు. కాని గణపతి దానికి మారుగా

"బట్ట కట్టుకొనక బట్టెడు బూడిద
దిట్టముగ నలంది ముట్ట గూడ
నట్టి పునుక పేర్లు నెట్టిన దాల్చితి
విట్టి వెఱ్ఱివార లెందుగలరు."

అని పలికి "నాకు వివేకము లేదని ప్రాకటముగ బల్కెదీవు పరగృహమునకుం దేశవ సొచ్చెదు నీకు వివేకంబున్నదె" అని మారు ప్రశ్నిస్తాడు.

గణాధిపతి మోదక ప్రియత కూడ హాస్యమయంగానే వర్ణించ బడింది.

"ప్రతి యింటన్ గణనాయకుండు మహమొప్పన్ మోదకంబుల్ వేసన్
మితి మీరంగ భుజించి తృప్తిసనకన్ మేలైన భక్ష్యంబులన్
గుజుకంబొప్పగ మూటగట్టుకొని చేకొంచున్ మహోల్లాసం
యుతుడై ప్రేస్నుచు వచ్చె సంతటను సూర్యుండేగ నస్త్రాద్రికిన్."

ఇట్లు వచ్చిన గణపతి తల్లి దండ్రులకు సాష్టాంగ పడుసరికి, పాపము, "గర్భమెయ్యాన ధరిత్రికిమోపి కరాబ్జ పాదముల్ వీసము భూమి కందకను వెన్కకు ముందుకు తూగుచుండ" గాచూసి చంద్రుడు నవ్వాపు లేక పోయాడు.

ఆధునిక కాలం మనకు గద్యంతో ప్రారంభమయింది, గద్యంతో పాటుగానే నాటకాలు, ప్రహసనాలు, నవలలు, వ్యాసాలు అనేవి విరివిగా వ్రాయబడుతూ వచ్చేయి. పద్యంలో కంటె గద్యంలో హాస్యానికి అవకాశం ఎక్కువ. పద్యం ఉదాత్తమయిన భావాలకీ, గద్యంవిషయనిర్వాచనానికీ వాడటం అనేది మనలోనే కాదు యితర భాషలవారిలో కూడ కనిపిస్తుంది. ఉదాత్తమయిన భావాలు వెల్లడించడానికి కావలసిన ఉన్నతమైనభాష, గంభీరమైన శైలి, పరిష్కృతమైన ఆవేశం, వగైరాలు పద్యరచనలో శోభిస్తాయి. ఆ లక్షణాలన్నీ పట్టించుకొన్న నాడు పద్యరచన ప్రౌఢమై, ఉత్తమస్థాయికి చెందినదిగా పరిగణింపబడుతుంది. అయితే యీ ప్రౌఢతగాని, గంభీరతగాని, హాస్యానికి అంతగా అవకాశమివ్వవలసేవి కావు. అందుకే ఏభాషా సాహిత్యంలో వెదికినా ఉత్తమ కావ్యాలని పించుకొన్న వాటిలో, హాస్యం అప్రధాన రసంగానే పోషింప బడిదొరుకుతుందిగాని, ప్రధానంగా నిల్చి కనపడదు. కాక, పద్యం ఎప్పుడూ సంస్కారులైన ప్రజలకి పనికివచ్చే హాస్యాన్నే అందింపజూస్తుంది. అందుకే పండితులామోదించిన హాస్యం ప్రజాసామాన్యానికి తృప్తినివ్వకపోవటం, ప్రజలు మెచ్చిన హాస్యాన్ని పండితులు వెలివెయ్యడం, అనేది మామూలై పోయింది. గద్యం అటు పండితులనూ యిటుసామాన్య ప్రజనూకూడ తనకు సుముఖులుగా చేసుకొని నడుస్తుంది, అదేకారణంచేత గద్యలో హాస్యంకూడ యీ యిరుతెగలవారికీ నచ్చిన స్థాయిలో అవతరించ గలుగుతూంది.

తెలుగులో గద్య రచనలు సాగించడానికి ప్రబల ప్రోత్సాహం యిచ్చిన విషయం నాటిమనవారి సంస్కారాభిలాష, ఈ సంస్కారం ఒక క్షేత్రంలో కాదు; మతంలోను,

ఆచారంలోను, అభిప్రాయంలోను, అభిరుచిలోను, అన్నిటిలోనున్నూ. అటుసమాజంలోనూ యిటు సాహిత్యంలోనూ వేళ్ళు పాతుకొనిపోయి ఉన్న ప్రాచీన రూఢిగతమైన పద్ధతులన్నిటినీ, సంస్కరించి, నవ్యత నాపాదించి, నవీనగతిలో నడపవలెననే అభిలాష యీ సంస్కారోద్యమాలన్నిటికీ మూలం. దేశంలో అప్పుడప్పుడే వ్యాపించిన ఆంగ్లేయవిద్య, ఆంగ్లేయ పరిపాలన, అనేవి మనవారికి యితరదేశములతోనూ, వారి సాహిత్యంతోనూ, వారి నాగరికతతోనూ పరిచయం కలిగించి, మన మెరిగిన ప్రాత విషయాలకీ యిప్పుడెరిగిన యీక్రొత్త విషయాలకీగల తారతమ్యం గమనింపజేసి, తప్పని తోచినది నిరసించడానికి, ఒప్పని తోచినది గ్రహించడానికి తగిన ఉత్సాహాన్ని జనింపజేసేయి. తత్ఫలితంగా యీ సంస్కారోద్యమం ప్రబలంగా సాగడానికి గాని, ఉద్యమానికి లక్ష్యమిదీ అని స్పష్టంగా నిర్వచించడానికి చక్కని అవకాశం కలిగింది. తదనుగుణంగా నాడు దేశంలో ప్రచారం పొందుతూన్న, బ్రహ్మసమాజాది మతాలవంటివి కొన్ని, మనకి విదేశ సాహిత్యంతో పాటుగా దాన్ని అనుకరించి సాగుతూన్న బెంగాలీ సాహిత్యంవంటి యిరుగు పొరుగు దేశీయ సాహిత్యాలతో కూడ పరిచయాన్ని కలిగించడమే కాక, సమాజ సంస్కారానికి ఏకైక సాధనం సాహిత్యమేననీ, అది ముందు సంస్కరింపబడితేనే గాని యితరమైన వాటినది సంస్కరింపజాలదనీ పరోక్షంగా మనకి బోధించాయి. ఫలితంగా గద్యరచనలు, ప్రబంధశైలికి స్వస్తి చెప్పిన పద్యరచనలు. ప్రజా సామాన్యానికి ప్రబోధం కలుగచేయగల నాటకాలు తెలుగులో వెలయటం జరిగింది. సంస్కారాభిలాషులైన సాహిత్య నిర్మాతలందరికీ, అపహసించి సంస్కరించడమనేదే, అనుకూలమైన మార్గం. నవీన మార్గాల నడచిన మన తెలుగు సాహిత్యం కూడ, సంస్కార ప్రియులైన వీరేశలింగం పంతులుగారి సంతతి వారిచే నిర్మింపబడిన కారణాన్న, హాస్యానికి విధిగా జాగా చేసి నడిచింది. సనాతన మూఢత్వం, ఛాందసాచారం, సాంఘిక దురాచారం, మతంచాటు అవినీతి, ధర్మం పేరిటి అన్యాయం, సంప్రదాయంలోని అక్రమం సర్వరాలు అపహసించి అధిక్షేపించి, తిరస్కరించి, దిద్దుబాటు చేయదగిన విషయాలుగా గ్రహింపబడి, సాహిత్యంలో వ్యంగ్యంగానో, సూటిగానో వెక్కిరించడానికి తగిన హాస్యాలంబనలుగా స్వీకరింపబడ్డాయి. కేవలం సంస్కారాన్నే ఉద్దేశించినచోట హాస్యం మరీ విస్తారంగా గ్రహింపబడి ప్రహసన రచనకు వ్యంగ్యప్రధానమైన నవలల రచనకు త్రోవదీసింది. ప్రజలనాకర్షించి గాని ప్రచారం సఫలంగా సాగదనే హేతువు, నాటకాల్లో హాస్యానికి ఎక్కువగా స్థానమిప్పించింది. కవులకు రాజాశ్రయం పోయి, సంఘాశ్రయం కలిగిన హేతువుచేత కవిత్వం ప్రజాసామాన్యాని కందుబాటులోకివచ్చి, తదభిరుచినిబట్టి, హాస్యానికి యితోధికంగా జాగా యిచ్చినడవసాగింది. దేశంలో నానాటికీ పెరుగుతూన్న నవనాగరికతా వ్యామోహం

కూడ, వంతుల వారీగా, హాస్య భాజనమె అయింది. ఫలితంగా కవులకు ప్రాచీనాధునా తన నాగరికతలు రెంటిలోనూ, చూసి నవ్వుకొనేందుకుగాని, హేళనచేసి ఏడిపించడానికిగాని, కావలిసినంత సామగ్రిదొరికింది. పద్యంలోనే రచించి తీరాలనే బాధపోయి, గద్యం వ్రాసినాకవి అనిపించుకో వచ్చుననే ధైర్యం, కవులలోగల హాస్య ప్రజ్ఞను మాత్ర ముప్పిడిగా నిల్చిమురిగి పోనియ్యక, బయటకు తెచ్చి ప్రదర్శింపజేసింది. నవీన నాగరికతతో పాటు వర్ణించడాని కాకర్షణీయమైన నవీన విషయాలు, యితర సాహిత్య పరిచయంతో పాటు నవీన రచనా విధానాలు ఏర్పడి హాస్యాన్ని కూడా నవీన గతిలో నూతనాలంబనలతో నడిపించడానికి అనువుకలిగించె. దేశంలో అచ్చుయంత్రాల వంటి సౌకర్యాలు లభించిన కారణంచేత, రచయితల కొకటికి రెండు ఎక్కువగా రచనలు సాగించడానికి ప్రోత్సాహం కలగడమే కాక, పెద్ద కావ్యం ఒకటి వ్రాయడానికి బదులు చిన్నది పది వ్రాయడం మేలనే అభిప్రాయం కలగడం కూడ, ఒక దాంట్లోకాక పోతే మరొక దాంట్లో నైనా హాస్యాన్ని పోషించి వ్రాయడానికి అనుకూలించింది. పరిమాణంలో రచన చిన్నదిగా ఉండటం వల్ల, పోషించవలనే హాస్యాన్ని యింకోరసానికి అంగంగా కాక, ప్రధానంగానే స్వీకరించి పోషించడానిక నిరాక్షేపణీయమైన అధికారం లభించింది. ఎవర్నైనా ఆక్షేపిస్తే అది కూడ వాళ్ళతలో కావ్యమే అవుతుందనే ధోరణి చాల మంది కవులను అధిక్షేప కావ్యాలు వ్రాయించి నవ్వించింది.

ఈ కాలపు పద్యకవులు కేవల పద్యకవులుగారు, గద్యకవులుకూడ. ఇదిగాక నేటి కవులలో కొందరు నవీనతాప్రియులు మరికొందరు ప్రాచీన పద్ధతిలోనే యింకా నడువవలనేవారు. ఈ ప్రాచీన మార్గానుయాయులలో కూడ కొంత నవీనతావ్యామోహం కలిగిన వారు మరి కొందరు. కవులందరూ స్వతంత్రులు, ఆ యీ కారణాల్నిబట్టి వీరిలో హాస్యం కూడ తరతమభేధాలతో కనిపిస్తుంది. ఈ కాలంలో కూడ కొన్ని పురాణాలు, కొన్ని ప్రబంధాలు వెలసేయి. మూల సంస్కృత గ్రంధాలకి మక్కీకి మక్కీ అనువాదాలు దిగేయి, కొన్ని స్వతంత్ర రచనలు కూడ లభించాయి. అను వాదాల్లోని హాస్యం మనకిప్పుడప్రస్తుతం.

స్వతంత్ర కావ్యాలెక్కువగా వ్రాసి ప్రబంధపు బాటలోపడి కునుకుతూన్న సాహిత్యరథాన్ని నవీనమార్గానికి తెచ్చి నడిపిన ఘనత తిరుపతి వేంకట కవులది. వీరికాలపు కవులకే ఆదర్శ పురుషులు. కవిత్వానికే పీఠొక సంస్థ. వీరి శతావధాన సంప్రదాయం కావ్య కన్యను ప్రజాభిరుచి నెరిగి నడపడానికేగాదు, కవిత్వాన్నే ప్రజలసొత్తుగా జేయ

డానికి పనికి వచ్చినది. వీరు చూడని తెలుగు సంస్థానంలేదు. వీరి కావ్యగానం వినిపించని తెలుగు పట్టణంలేదు. వీరు కవులు, పండితులు, మాత్రమే కాక, రసికులు ప్రాచీన సాంప్రదాయాల్ని సాకల్యంగా ఎరిగి, జీర్ణించుకొనిన నవీనతాప్రియులు. భావంలోను, భాషలోను, శైలిలోను కూడ నవ్యత చూపి, ప్రాచీన కవితకు క్రొత్త తొడుగు తొడిగి కలం నడిపించారు. వీరి వర్ణనలతీరు, ఉపమాన వస్తువుల కూర్పు, వర్ణ్యవస్తువుల సేకరణ, రచనా సంవిధానం అన్నీ అపూర్వతనాపాదించుకొన్నవే. వీటికితోడు వాక్చమత్కృతి కూడ వీరిని వరించినది. వీరు వ్రాసిన కావ్యాలలో దేవీ భాగవతాదులు బృహద్గ్రంథాలు. శ్రీపదానందాదులు ప్రబంధాలు గిరతాదులధిక్షేపకావ్యాలు. ముద్రారాక్షసాది సంస్కృత నాటకాలెన్నిటినో తెలిగించటమే కాక వీరు భారతకథను తమ పాండవ నాటకాలలో మన కందించి, తెలుగులో ఉత్తమ నాటకం లేదనే లోటు పూర్తిచేసేరు. ఈ కావ్యాలన్నిటిలోనూ వీరు చాల సరసమయిన హాస్యాన్ని మన కందించేరు. కథను హాస్యమయమైన పట్టులోకి మళ్లించడం, హాస్యపూరితమైన సన్నివేశాలధికంగా తారసింపజేయటం, హాస్యాశ్రియమైన పాత్రీను సృష్టించడం వగైరాలు వీరిలో అంతగా కనపడవు కాని ప్రసంగ ప్రాప్తమైన హాస్యవస్తువును విస్తరించి వర్ణించి హాస్యాన్ని పోషించడం వీరెన్నడూ మరిచిపోరు. అదిగాక హాస్యపు పట్లు ఎట్టివో వీరు చక్కగా ఎరుగుదురు ఉన్న దానిని మరింత హెచ్చించి క్రొత్త క్రొత్త చమత్కృతులు జోడించి, కావలసినంత నవ్యతనాపాదించి, అత్యంతాకర్షణీయంగా రూపొందించి, హాస్యాన్నందించటం వీరిలో విశిష్టత. జీవితంలో ఉన్న హాస్యాన్ని కావ్యంలోకి తెచ్చి పోషించటం వీరి ప్రత్యేకత. తమ పరిసరపు రసిక భాష నాశ్రయించి, చక్కని కథామయమైన హాస్యాన్ని వీరు మనకి ప్రసాదించేరు. సరసతచూసి హర్షించి నవ్వటమేకాక, విరసతచూసి వెక్కిరించి నవ్వటం కూడ వీరు మనకి నేర్పేరు.

హాస్యాలంబనమైన వస్తువు పరంపరాగతమైన ప్రాచీనవస్తువే అయినా, దానిని నవీనమైన ధోరణిలో వర్ణించి, ఆకర్షణీయంగా చేసి నవ్వించటానికి ఉదాహరణగా వీరి శ్రీనివాసకళ్యాణ కావ్యంలోని భోజన వర్ణనం చూడవచ్చు.

" నేయిరాల్పన దేమి నీ తాత సొమ్మయంచరచి యొక్కనిఁజేతఁజరచె
నొకఁడు
పప్పు దెమ్మన దేక పగులెత్తెదేమి రోగపని యొక్కని దిట్టఁగడఁగె
నొకఁడు
జొత్తరావులు వీరలని యెఱుంగ నెయుం మఁ దెగువ నొక్కనిచేతఁ
దిగిచె నొకఁడు

జొత్త్రాహులకన్న నదముండవేయంచు మించిరియొక్కని
నిరసించెనొకడు
లెమ్ము లెమ్మని కయివెట్టి తెచ్చినంత
వలదు పొమ్మనెనొకని నవ్వులకు నొకఁడు
నృపునితోఁ జెప్పినేను నేనిక్కుమాని
పించెదనటంచు నొకని వేధించె నొకఁడు.
దొన్నెలబోఁగల ఘృతమొక
చిన్నమ్మను మిగులకుండఁ జెంబున వేవే
గన్నెల కొల్పుచు లేదని
దొన్నెలుబోర్లించె నొకఁడు దుండగ మెనయన్."

ఇలాటి ఘట్టాలు వర్ణించేటప్పుడు వీరు క్రొత్త క్రొత్త ప్రసంగాలుకూడ కూర్చి, వర్ణన పొడిగించి హాస్యాన్ని పోషిస్తారు. దీనికి తోడుగా జాతీయాలు, సామెతలు వగైరాలేగాక, కొందరు కొందరు ప్రత్యేక వర్గాలలోని వ్యక్తులు వాడుకొనే పరిభాషలు, కట్టుమాటలు, సాంకేతికాలు వగైరాలు కూడ యిట్టి హాస్యప్రసంగాలకి వన్నెబెట్టేలా ప్రయోగించడం వీరిలో తరుచుకన్పించే విశేషం.

" ననుసుగుళాయటంచు స్తవనంబొనరించె నితండు మంచి వా
డని మరికొన్ని భక్ష్యములు నాయవనీసురు భాజనమ్ము నం
దునిచెనువేగ నంసయుగముబ్బ నిరక్షరకుక్షియైన యా
దనిపుఁడొకండు పూదుఁడని తత్పద వాచ్యమెఱుంగ కెంతయున్."

ఒక్కొక్కచోట యీ సాంకేతిక పదాలవాడుక, హాస్యానికి బాధకంగా కూడ పరిణమిస్తూంది. తటాలున అర్థంకానందున అట్టి హాస్యం కేవలం పండితైక వేద్యంగా మిగిలిపోతూంది. వడ్డించేవాడొకడు "నిష్ఠానత్వ విఖ్యాతంబగు తే మనం బిదుగో" అని అంటే, భోక్తలలో ఉన్న వ్యాకరణ పండితుడొకడు ఆ మాటల్లో దోషాలెంచబోతాడు. మిగత పండితులతని వ్యాకరణ పాండిత్యాన్ని హేళనచేస్తూ తమలో తాము యిలా నవ్వుకొన్నారు

" చూచుటకేమి 'కోయణచి' సూత్రముగాదది బుద్ధికేన కా
ణాచినటంచు నర్భక గణంబులకైనను సాధమైన యీ
నాచక మెన్నడేని గనెనా? యమరంబునలేదు పాప మీ
పాచకుఁడైన మేలనియ పస్మిత ముంబొనరించి రెంతయున్,"

ఇలాగే వైష్ణవ సాంప్రదాయంలో కట్టుమాటలెన్నిటినో ఉపయోగించి పోషించిన హాస్యం వీరిశ్రవణానంద కావ్యంలో వృద్ధవేశ్య వైష్ణవునితో సంభాషించిన ఘట్టంలో దొరుకుతుంది. కాని అక్కడ పదాలింత క్లిష్టమైనవికావు. తోడుగా అనేక జాతీయాలు కూడ వాడబడ్డాయి, అందుచే ఆ ఘట్టంలో హాస్యం చాల సరసంగా ఉంటూంది. చాలాఘట్టాల్లో వీరిది సరసమైన హాస్యాన్నే, అందరికీ అందుబాటుగా ఉండే శైలిలోనే, అందించారు. ఎక్కడో ఒకటి రెండుచోట్ల మాత్రమే పైపై విఘ్నమైన సాంకేతిక పదాలతో కూడిన హాస్యం కనిపిస్తుంది. ఇంతేకాదు అక్కడక్కడ అలంకారాలు కూర్చి హాస్యాన్ని సృష్టించే ప్రాచీన సంప్రదాయంకూడ వీరిలో కనిపిస్తుంది,

" నిదురబోఁగొట్టుఁ గ్రమముగా నెత్తికెక్కుఁ
గలుషత ఘటించుఁగుండయుఁ గర్గియుఁదవ
చేతి కొనఁగూర్చు నదిగానఁ జెప్పనగునె
వేశ్యకును నశ్యమునకును భేదమిలను." (శ్రవణా నందం)

వీరిశతావధానపద్యాల్లో ఎన్నో సమస్యాపూర్తులు, చాటువులు హాస్యానికి సంబంధించినవి ఉన్నాయి. నాటిలో సహా చక్కని హాస్యం దొరుకుతుంది.

శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారి హాస్యం ప్రాచీన సాంప్రదాయంలో, చాలా సరసమైన ధోరణిలో ఉంటూ, తగు మాత్రం నవ్యతచూపుతుంది. వీరి హాస్యానికి కొంత శృంగారం, కొంతవ్యంగ్యం కూడ బలమిచ్చి నడుస్తాయి. హాస్యాలంబనాన్ని వేర్వేరు రీతుల వర్ణించి, ఘట్టాన్ని పొడిగించి నవ్వించడం వీరిలో విశేషంగా కనిపిస్తుంది. వీరి రామాయణకావ్యంలో ఋశ్య శృంగచరిత్రలో పోషింపబడిన హాస్యం, యింతవరకు తెలుగులో వెలసిన రామాయణాలన్నిటిలో దానికన్న మిన్నగా ఉంది. హాస్యానికి బలమిచ్చే వాక్చమత్కృతిగూడ వీరికావ్యాల్లో కనిపిస్తుంది. వీరి నాటకాల్లో ఏమంతగా ఆకర్షణీయమైన హాస్యం కనపడదు. వీరి అధిక్షేపకావ్యాల్లో దివ్యంగ్య పూరితమైన హాస్యం.

ఇటీవల మన పద్యకవిత చాల మార్పులకు గురి అయింది. విదేశీ సాహిత్య సంపర్కాన్ని పురస్కరించుకొని అనేకానేక వాదాలు, సిద్ధాంతాలు మన కవితలోగూడ ప్రతిఫలింప సాగేయి. కొంతమంది ఉత్సాహులైన రచయితలు కూడి, సాహితీసేవ చేయడానికి ప్రతిజ్ఞబూని, ఏర్పరుచు కొన్న సమితి, సంఘాలు వెలసేవాటినుండి వెలువడ వలసే రచనలు ఫలానావిధంగా ఉండాలనే నిర్ణయాలు కూడ చేసుకొని రచనలు సాగిం

చేరు. రవీంద్రుని గీతాంజలి వంటి రచనల ప్రభావం కూడ మన కవిత్వమైపబడింది. కవితకు కట్టు బాటులు సడల నారంభించేయి, కరుణశృంగార రసాలకి ప్రాధాన్యం కలిగింది. శృంగారంలో విప్రలంభమే ఆదరణీయమయింది, లాలిత్యము, మధురము, శ్రావ్యము అయిన శైలి పోషింప బడింది. కథగాని, పాత్రగాని లేని కేవల వర్ణనలు విస్తరించేయి, బాహ్య వస్తు వర్ణనల కంటె ఆంతరంగికభావ ప్రదర్శనానికి విలువ హెచ్చింది. హృద్గతభావాని కనుకూలమైన దృశ్యాలు, ప్రతిబింబాలు, ప్రతికృతిలో వెదకి, ఆంతరంగిక ప్రవృత్తికీ బహిరంగ ప్రకృతికీ సామంజస్యం స్థాపిస్తూ, ఆత్మకి విస్తృతినిచ్చి ఆధ్యాత్మికానుభూతిని పరామృశింపజేసే పద్ధతిలో రచనలు వెలువడ సాగేయి. దేశంలో నానాటికి వృద్ధిపొందు తూన్న జాతీయభావాలు, వీరపూజ, స్వాతంత్ర్యపిపాస, స్వదేశాభిమానం, పగ్గె రాలను స్పష్టంగా వెల్లడించే రచనలకు ప్రోత్సాహమిచ్చాయి. అస్వాతంత్ర్య, నిరుద్యోగం స్వేచ్ఛావరోధకాలైన సామాజిక, ధార్మిక, నైతికాది ప్రవృత్తులు అన్నికలిసి దుఃఖవాదానికి తోడ్పడి రాళ్లు కరిగించగల శోకగీతాలను వినిపింప జేసేయి, ఈ ప్రవృత్తులేవీ హాస్యాని కనుకూలించేవికావు. ఫలతః హాస్యం అడుగంటింది. పాశ్చాత్య సాహిత్య జ్ఞానంతో పాటుగా దిగిన మరికొన్ని రకపు రచనలు హాస్యాన్ని పోషింపక పోయినా స్వయంగా అప హాస్య భాజనాలు కూడ అయేయి. మానసిక విజ్ఞానాన్ని, స్వప్న విజ్ఞానాన్ని ఆధారంగా తీసుకొని, అవచేతనలో ఉండే భావాలను, అస్తవ్యస్తమైన అభిప్రాయాలను ఉన్నవి ఉన్నట్టుగానే ప్రకటించాలనే ధోరణిలో బయలుదేరిన 'అధివాస్తవిక కవిత' వంటివి. రచయిత ఏ ఉద్దేశంతో వ్రాసినా, పఠితలకి మాత్రం విధిగానవ్వు కలిగించేవిగా ఉంటున్నాయి.

> "మింగి తిమింగిలంగిల తమిః శ్రగు హాంతర మీనమేషపా
> రంగతులైన బొంగరములార ఎతింగిన, దెబ్బడీ పరి
> ష్వంగము పాడుటెందుకు ; విపంచికి కంచికి దూరమెంత ; వ
> డ్రంగులు రంగులా ? గులకరాళ్లగు మాగుడిలోని లింగముల్ "
>
> (శ్రీ.శ్రీ.)

అనే పద్యం ఉదాహరణమచాలు. ఈ కవిత కేవలం ఓ చమత్కృతి. అత్యాధునికమైన అభ్యుదయ కవిత, ఆకలి మంటలు, అత్యాచారాలు, అన్యాయాలు వగైరాలకు ప్రతి క్రియగా బయలుదేరి, సమాజంలో ఉన్న ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించాలనే. మూల సిద్ధాంతాన్ని ఆదరించి నడువ సాగింది. తదనుకూలంగా యిందులో కూడ, శోక భీభత్స

రసాలకే ఎక్కువ ప్రాధాన్యం యివ్వబడింది. ఈ రెండు రసాలు హాస్యానికి అగర్భ శత్రువులు. కాక, ఇవి నవ్వవలసే రోజులు కావనే తత్వం కూడ యీ కవులను నవ్వనివ్వలేదు.

పద్య రచనల్లో నిరాదృతమైన హాస్యానికి గద్యలో కావలిసినంత ఆదరం, ఆశ్రియం కూడ లభించేయి. గద్యతోపాటుగానే తెలుగులో నాటకాలు వ్రాయడం ప్రారంభమయింది. మన అదృష్టం కొద్దీ తెలుగులో నాటక రచనకు ప్రథమంగా పూనుకొన్న కవులు కేవల కవులుగాక 'నాటకసభ'లు స్థాపించి, నడిపించిన మహనీయులు దొరికేరు. ధర్మవరం కృష్ణమాచార్యులు గారు తాము వ్రాసిన నాటకాల్లో తామే పాత్రధారులుగా కూడ ఉండేవారు. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య తత్వాలు రెండూ సాకల్యంగా తెలుసుకొని, నటుల సాధకబాధకాలు, రంగస్థలపు మర్యాదలు, ప్రేక్షకుల అభిరుచులు వగైరాలు గమనించి వీరు తమ నాటకాలు రచించేరు. పౌరాణిక ఇతిహాసాలకీ, స్థానిక చరిత్రకీ సంబంధించిన యితివృత్తాలు తీసుకొని వీరు రమారమి పాతిక నాటకాల వరకు వ్రాసేరు. అన్ని నాటకాలలోనూ హాస్యాని కంతోయింతో జాగా చేసారు. కేవలం ప్రేక్షకుల మనోరంజనకు మాత్రమే కొన్ని హాస్య ఘట్టాలు జోడించిన కారణంచేత అయాచోట్ల యీ హాస్యం మూల కథకి ఏ విధంగానూ సంబంధించక, అతుకు కుదరక, సందర్భోచితంగా ఉండకపోవటం కూడ జరిగింది. చిత్రనళీయ నాటకంలో సుదేవ పర్ణాదుల అన్యోన్య సంభాషణలో హాస్యం ఉబుసుపోని హాస్యంగా కనిపిస్తుంది. అయితే అన్ని చోట్లా యిలాలేదు. చక్కని హాస్యం సందర్భోచితంగా వాడిన పట్లు లేక పోలేదు. పై చిత్రనళీయ నాటకంలోనే బాహుకునకు, దమయంతి చెలికత్తెతో జరిగిన సంభాషణలో నాటకీయ వ్యంగ్య ప్రధానమైన, హాస్యం, అతి సరసమైన తీరున అందింప బడింది. ఘకాలమని నవ్వించవలెననే అభిలాషచే వీరిహాస్యం అక్కడక్కడ పామర హాస్యంగా కూడ రూపొందింది.

కోలాచలం శ్రీనివాసరావు గారి నాటకములుకూడ చాలవరకు పౌరాణికములో ఐతిహాసికములో అయినవే. సభికుల కోసమని సృష్టించిన హాస్యం వీరి నాటకములలో కూడ కనిపిస్తుంది. వీరి హాస్యం కూడ చాలచోట్ల బలాత్కృతంగా దిగినదే. ప్రహ్లాద నాటకంలోని గురుశిష్య సంవాదంలో హాస్యం సందర్భశుద్ధి మాట అటుంచి సహజంగా కూడ లేదు. సమంజసమైన సభ్య హాస్యం వీరిలోకూడ దొరకదు. కాని వీరేశలింగం గారి వంటి సహజహాస్య ధోరణిలో వ్రాయగల కవులు కొందరి నాటకాల్లో చక్కని హాస్యం మనకు

లక్షించింది. చిలకమర్తి, పానుగంటి, గురజాడల నాటక రచనలు హాస్యమయాలై వెలసేయి. ప్రతాపరుద్రీయం వంటి చక్కని హాస్యనాటకం కూడా రచింపబడింది, వీటిని గురించి వైపరీకరణంలో మనవి చేస్తాను

ఈ తరువాత తెలుగులో నాటకాలు శరపరంపరలుగా దిగేయి. వీటిలో కొన్ని రంగస్థలానికి పనికి వచ్చేయి. పాండవోద్యోగ విజయాల వంటి నాటకాలు ఒకటి రెండు సాహిత్యక దృష్టికీ, ప్రేక్షకుల దృష్టికీ కూడా సరిపోయిన ఉత్తమ స్థాయిలో వెలసేయి. వీటిలో హాస్యం తగు మాత్రం పోషింప బడింది, ముత్తరాజు సుబ్బారావుగారి తులాభారనాటకంలో విదూషకుని ( వసంతకుడు ) పాత్ర ఉంది గాని హాస్యం లేదు. బలిజేపల్లివారి హరిశ్చంద్రలో విదూషకుని నక్షత్రకుని వంటి యితర పాత్రలలో సిద్ధబడింది. కాని హాస్యం స్వాభావికంగా లేదు. సాంఘిక నాటకాల్లో హాస్యానికి కొంత ఎక్కువ అవకాశం యివ్వబడింది. కాని చాలవాటిలో హాస్యం సహజంగానూ సరసంగానూ లేదు. కాళ్లకూరి నారాయణరావు గారి నాటకాల్లో హాస్యం చాలవరకు సరసంగానూ సందర్భోచితంగానూ ఉంది, వీరి 'చింతామణి' లో సుబ్బిసెట్టి పాత్ర పరిహాసానికి పాత్రమైనది. 'వరవిక్రయం' లో లింగరాజుగారి పాత్ర కూడా హాస్యానికి చక్కని ఆలంబనగా పోషింప బడింది. ఈ కవి హాస్యరచనలో ముఖ్యంగా కనపడే లక్షణం అను ప్రాసలు కూర్చి మాటాడించటం. అనర్గళమైన, నవ్వుపుట్టించే వాచాలతకూడా వీరి పాత్రలలో కనిపిస్తుంది. వీరి 'మధుసేవ' లో శర్మగారి పాత్రలో హాస్యం, యింగ్లీషు తెలుగు కలగలుపు పద్యాలు మాటలు వగైరాలతో పోషింప బడింది. ఈ నాటకంలో సంకేతం పాత్రలో హాస్యం, సభ్యంగానే ఉంది గాని నవ్యంగా లేదు. ఈ కాలపు మరికొన్ని నాటకాలలో కొంత వ్యంగ్య హాస్యం కూడా దొరుకుతూంది నాటికలలోనూ ప్రహసనాలలోనూ ఈ వ్యంగ్య హాస్యం జాస్తీగా పోషింప బడింది. ఏకాంకికలు వెలసిన తరువాత శ్రీపాద, భమిడిపాటి, మల్లాదివంటి సుప్రసిద్ధ హాస్యరచయితల రచనలు మనకు లభించేయి నేటి పత్రికలలో. లెక్కకుమిక్కిలిగా వస్తూన్న ఏకాంకికలలో అక్కడక్కడ హాస్యానికి జాగా యిచ్చినవి కూడా కనిపిస్తున్నాయి.

తెలుగులో నవల వ్రాయడం ఏ ముహూర్తాన ప్రారంభమయిందో కాని, నేడివి బళ్లకొలదీ దొరుకుతున్నాయి. వీరేశలింగంగారి నవలల్లో చక్కని వ్యంగ్య హాస్యం దొరుకుతుంది. చిలకమర్తివారి నవలల్లోకూడా అతి సరసమైన హాస్యం పోషింపబడింది. భోగరాజు నారాయణమూర్తిగారి నవలల్లో హాస్యంకోసం ప్రత్యేకంగా సన్నివేశాన్ని కూర్చడమో లేదా హాస్యాని కాలంబనమైన పాత్ర నొకదానిని విధిగా నిలపడమో, కనిపిస్తుంది. వీరి

'అల్లాహూ అక్బర్'లో చ్యాలకుని పాత్ర మృచ్ఛకటికంలో శకారుని వంటిది. పిరికితనంలో ఉత్తరుని జ్ఞప్తి తెచ్చి నవ్విస్తుంది. వీరి ఐతిహాసిక నవలలో కొన్ని మహమ్మదీయ పాత్రలతో గల ఘట్టములు కేవలము హాస్యరస ప్రధానములుగా రచింపబడ్డాయి. విశ్వనాథ సత్యనారాయణగారి నవలలో హాస్యపు సన్నివేశాలు కూర్చటంగాని, హాస్యపు పాత్రలు నెలకొల్పి పోషించడంగాని, హాస్యమయమైన సంభాషణలు పెంచి వ్రాయడంగాని కనపడదు; గాని కటు వ్యంగ్య పూర్ణమైన ఘటనా విధానం హెచ్చుగా కనిపిస్తుంది. 'వేయి పడగలు'లో యితి వృత్తమే నేటి నాగరికతను వేయినోళ్ల వెక్కిరిస్తూంది. దోషము నిరూపించి, హృదయమునకు హత్తునట్లు చూపి చెప్పగల నేర్పులోగాని, అనాకారితనాన్ని అతి నిర్దాక్షిణ్యంగా ఎదుర్కొని హేళనచేయగల ఉత్సాహంలో కాని, అపసవ్యమైన విషయాన్ని సమూలంగా నశింపజేయగలిగినంత ఆవేశంతో వ్యంగ్యాన్ని ప్రయోగించడంలోగాని వీరికి వీరేసాటి. వీరెప్పుడేనా ఒకానొక పాత్రను హాస్యానికి గురిచేస్తే, అది చివరికి మన విద్వేషానికో, లేక కరుణకో పాత్రమవటం సంభవిస్తుంది. అగ్నిక్షేత్రంలో వీరికలం అతిక్రమమూ, తీక్ష్ణమూ కూడ, అడవి బాపిరాజుగారి నవలల్లో హాస్యం అంతగా దొరకదు. ఉన్నచోటకూడ చాల పేలవంగా ఉంటుంది. వీరు 'నాగరాజు' వంటి శ్లిష్టరూపక (Allegorical) రచనలు కూడ కొన్ని చేసేరు. ఈ కాలపు మిగత రచయితల నవలల్లో హాస్యము తక్కువ. ఎక్కడో ఒకటి రెండు హాస్యపు తుంపరలు లభించినా అవి మరిచిపోడానికి వీలులేని రకంలోవి గావు. స్వతంత్ర రచనలతోపాటు యితర భాషలనుండి అనువదింపబడిన నవలా రచనలు నేడు మనకి లభిస్తున్నాయి. కొన్ని చవుకబారు నవలలుకూడ దిగేయి. నేటి పత్రికలలో 'సీరియల్'గా కూడ కొన్ని నవలలు వస్తున్నాయి కొన్నిటిలో కొంత వ్యంగ్య హాస్యం కూడ ఉంటూంది.

చిన్న కథలలో కొన్ని కేవల హాస్యకథలు మనకు లభిస్తున్నాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యంగారు చక్కని హాస్యకథలెన్నో మన కందించేరు. మునిమాణిక్యంవారి కథలు తెలుగు సాహిత్యానికే అలంకార ప్రాయాలు. భమిడిపాటి, గుడిపాటి, కొడవటిగంటి, కొల్లూరు, వ్యాగ్రాల కథలెన్నో చక్కని హాస్యాన్ని అందిస్తున్నాయి. మన కథాసాహిత్యం మంచి ఉన్నతస్థాయిలోకి కూడ వచ్చింది. పాలగుమ్మి పద్మరాజుగారి వంటి తెలుగు కథకుడు ప్రపంచ కథాసాహిత్య నిర్మాతలలో ఒకడుగా పేరుపొందటం మనకు గర్వహేతువు. నేటి పత్రికలెన్నో కథలనాదరిస్తున్నాయి. కొన్ని కేవలం హాస్యకథల కొరకే వెలసిన పత్రికలు కూడ ఉన్నాయి.

తెలుగులో 'ఆంధ్ర పత్రిక' వెలసి, సారస్వతానుబంధం అని ప్రత్యే
సాహిత్యానికి కొన్ని పేజీలు విడిచి తెలుగుకి చేసిన సేవ అపారం, 'సాక్షి' వ్యాస
హాస్యరచనలకిది మంచిచేయూత యిచ్చింది. అల్లే 'కృష్ణా పత్రిక' హాస్యా
ప్రాధాన్యం కూడ మరువరానిది. ఆ పత్రికలో దైనందిన రాజకీయ, ఆర్థిక, సామాజిక
కాద సమస్యలెన్నో చక్కని హాస్యధోరణిలో వ్యాఖ్యానించబడటం నేటికీ మనమె
'పదరుబోతు' వ్యాసాలనో మరేదో వ్యాఖ్యానాలనో నేటికీ ఓ ప్రత్యేక శీర్షికలో
మృదువైన వ్యంగ్య హాస్యపూర్ణమైన రచనలు మనకాపత్రిక అందిస్తూంది. 'భ
మనకు ప్రసాదించిన హాస్య రచనలు గాని, రచయితలుగాని, లెక్కకు మిక్కిలిగా
టమేగాక, నేటి మన సాహిత్య ప్రగతికే అదె ఒక అద్దంలా ఉంటూంది. అ
ప్రతి ఫలించని మార్పు, తెలుగు సాహిత్యంలో ఏశాఖలోనూ మనకు దొరకదు. ఇ
యిటీవల కేవలం హాస్యాన్ని పోషించే నెపంతోనే పుట్టిన 'వినోదిని' వంటి చిన్న
పత్రికలు కూడ చాలా ఉన్నాయి. ఇవి యిప్పుడిప్పుడు 'సినీమా సాహిత్యాన్ని' ప్ర
చెయ్యడానికి కొంత స్థానం ప్రత్యేకిస్తున్నాయి, గాని తమోలం హాస్యాన్ని విడి
లేదు. ఇది సంతోషించదగిన విషయం.

మొదట పత్రికలలో ప్రకటించిన కొన్ని వ్యాసాలు, కథలు, ఏకాం
విమర్శలు వగైరాలు తరువాత తరువాత పుస్తకరూపేణా అచ్చవుతున్నాయి. ఈ మా
'మాటా - మంతీ' వంటిచక్కని హాస్యవ్యాసాల సంపుటీలు మనకు లభించేయి. వ
ముందు యిలాంటి హాస్య రచన లింకా ఎక్కువనా దొరుకుతాయనే ఆశ కలగడం సహ

# మన హాస్య గ్రంథాలు

తెలుగు ప్రాచీన సాహిత్యాన్నంతటినీ గాలించి చూచినా హాస్యకావ్యాలని పించుకోదగినవి రెండు మూడు కంటె ఎక్కువగా దొరకవు. వాటిలో కూడ హాస్యం ఉత్తమకోటికి చెందినదిగా కనపడదు. కావ్యమే కావాలనే పట్టువల విడిచిపెట్టి చూసినట్టయితే ఖండ కావ్యాలవంటి చాటువులు శతకాలు హాస్యమయమైనవీ, క్వాచిత్కంగా ఉత్తమ హాస్యాన్ని అందించేవీ కొంతవరకు లభిస్తాయి. చాటువులు వ్రాయడం, లేదా ఆసువుగా చెప్పడం అనేది తెలుగులో అనాదిగా వస్తూన్న సాంప్రదాయం. తత్ఫలితంగా యీ చాటువులు మనకి విస్తారంగా లభిస్తున్నాయి.

ఈ చాటువులనేవి అన్నీ నీకాలానికి గాని, ఓ కవికిగాని సంబంధించినవి కావు. వీటికి పాఠాంతరాలు కూడ బహుళంగానే వినిపిస్తాయి. కొన్నిటికి కర్త ఎవరో, ఏకాలపు వాడో తెలియదు. కొన్ని ఏ సందర్భంలో రచింపబడ్డాయో తెలియదు. కొన్ని నిష్కర్షగా అర్థం కూడ చెప్పనిచ్చే ధోరణిలో లేవు. కొన్ని రెండు మూడు చరణాలతో మాత్రమే నడుస్తున్నాయి. కొన్నిటిలో ప్రక్షిప్త పంక్తులు గూడ దొర్లుతాయి. అవుగాక, మనకు కావలసినది హాస్యము. వీటిలో అది చాలవరకు నిర్వహింపబడిన మాట వాస్తవము. ఆహాస్యంలో కూడ ఎక్కువ భాగం అధిక్షేప హాస్యం ( Satire ) దొరుకుతుంది. ఏరాజునో రెడ్డినో అడుగుతే డబ్బిచ్చేడు కాదనే నెపంచేతనో, అవమానం చేసేడనే నేరం చేతనో ఆక్షేపించి కసిదీర్చుకోవటం యీ అధిక్షేప చాటువులలో చాలవాటికి ప్రేరక హేతువు. కవులలలో కవులు కొట్లాడుకొని వారినివీరు, వీరినివారు పద్యాల్లో తిట్టుకోవటం అన్నే ప్రతిజ్ఞ మరికొన్ని చాటువుల సృష్టికి హేతువు. ఈ రెండు రకాల చాటువుల్లోనూ హాస్యం ఉక్రోషంగానే మారింది. విశుద్ధంగా హాస్యం కోసమనే రచించినవి, సంస్కృతంనుండి అనువదించినవి కూడ చాల చాటువులు దొరుకుతాయి. ఏదో నల్లీ, పిల్లీ, అల్లుడూ, అగ్రహారం, దాతృత్వం, ధర్మం, లోభం, లోలత్వం వగైరాలపై వినిపించే చాటువులు యీ రకమైనవి. వీటిలో హాస్యం శాస్త్రీయంగానూ, సరసంగానూ ఉంటుంది. ఆ భాసశృంగారాన్నో, అసభ్య శృంగారాన్నో వర్ణించే హాస్యపు చాటువుల్లో అశ్లీలత తొంగిచూస్తూ ఉంటుంది. అన్యోక్తి పద్ధతిలో చెప్పిన చాటువులు అతి సరసమైన వ్యంగ్య హాస్యాన్ని అందించేవినా ఉంటాయి. అక్కడక్కడ కవి స్వయంగా హాస్య భాజనుడై చెప్పిన చాటువులు గూడ సవ్యమైన హాస్యాన్నే కలిగిస్తాయి. కాకులతో విసిగిపోయి, కర్రవిడిచి పెట్టి, ఘంటం పట్టుకొని, వెనుకముందులు చూడని కోపంతో,

" నీ కుటిలత్వమున విడువనేరవు తిట్టెద తాంత్రికైకొనన్
రాకు పరాకుచే నయిన రాక వివేకము దెచ్చుకొమ్ము నా
వాకులు దప్పి వారయ ధ్రువంబుగ నమ్ము మనంబులోన నో
కాకమ నీకు తెల్పెద చికాకొనరించకు మనే కవీంద్రుడన్." అని

చెప్పిన కొట్రా బాలకవిగారి అవస్థ ఎవరైనా నవ్వించి తీరుతుంది. మరికొన్ని చాటువులు చిత్రమైనవి. ఇవి ఉన్నవి ఉన్నట్టుగా చదువుతే హాసము కాదుగదా ఏ భావాన్నీ ధ్వనించవు. వీటిని చదివే ముందు వీటికి సంబంధించిన యితివృత్తమో, సందర్భమో సాకల్యంగా తెలుసుకొని, తరువాత చదువుతే, యివి కొంత హాస్యాన్ని ప్రసాదిస్తాయి ఇట్లే సమస్యాపూర్తికై చెప్పిన చాటువుల్లో కూడ, ఒక్కొక్కచోట సమస్య ముందూ, పద్యం వెనుకా చదువుతే నవ్వురాకపోదు.

తెలుగులో శతకాలు వ్రాయడం అనే పరిపాటి మధ్యకాలంలో ప్రారంభమయింది ఏ దేవుని పేరనో మకుటం మాత్రం ఒకటి తగిలించి, ఆద్యంతమూ హాస్యాన్నే ధ్వనించిన శతకాలు కొన్ని దొరుకుతాయి. కాని కాలం, కర్తృత్వం రెండిటిలోనూ యివి వెనుకటివే. హాస్యానికి సంబంధించిన యీ శతకాలలో కొన్ని చాలా అసభ్యరచనలు. ఇవి డజన్లకొద్దీ ఉన్నాయి. పూర్వపు వ్రాతలే కావు; ఈ యుగంలో కూడ యిట్టి రచనలు చేసి సంతసించిన కవులు లేకపోదు. ఏ రఘురామదేవుని పేరనో శతకం ప్రారంభించి, ఆ చివరినుండి యీ చివరిదాక రంకు పురాణమే వ్రాసి, పాపపరిహారార్థం పది పన్నెండు భక్తిరసపూర్ణమైన పద్యాలు జోడించి పావనులైపోవడం ఈ కవులకి సాంప్రదాయం. వీటిలో అశ్లీలత వ్యంగ్యం కూడా కాదు. కేవలమూ విశుద్ధమైన వాచ్యం. విశేషమేమిటంటే, వీటిని 'పండిత ప్రతులు'నే పేరు మీద ప్రచారంలోకి తీసుకొనిరావడం. ఈ వెనుక యిట్టి రచనల కోసమని ప్రత్యేకంగా వెలసిన కొన్ని 'శృంగార గ్రంథ మండలు'లు చాల వరకు వీటినాదరించేయి. పూర్వపు వాటికితోడు ఆధునిక 'కృష్ణశతకము'లు కొన్ని ప్రకటింపబడ్డాయి. ఈరకమైన రచనల్ని సమర్థించిన పూర్వకవి 'కవిచౌడప్పశతక' కర్త. ఆయన తత్వంలో బూతులేనిదే హాస్యమే లేదు.

" నీతుల కేమి యొకించుక
భూతాడక దొరక నవ్వుపుట్టదు ధరలో

నీతులు బూతులు లోక
ఖ్యాతులురా కుందవరపు కవి చౌడప్పా.

పది నీతులు పది బూతులు
పది శృంగారములు గల్గు పద్యములు సభం
జదివిన వాడే యధికుడు
గదరప్పా కుందవరపు కవి చౌడప్పా.

బూతనినగుదురు తమ తమ
తాతలు ముత్తాత మొదలు తర తరముల వా
రేతీరున బూతెటిగిరి
ఖ్యాతిగ మరి కుందవరపు కవి చౌడప్పా."

అయితే, యీ జాడ్యం యీ రోజుది కాదు. అనాదిగానే ఆవహించింది. అన్ని సాహిత్యాల్లోనూ అంతో యింతో వ్యాపించింది. అస్తు. ఈ రకపు రచనల్లో కొంతలో కొంత మెరుగైన రచన "వేణు గోపాల శతకం." ఇందులో బూతులు చాల స్వల్పం. నీతుల,నిందలు అధికం. హాస్యం కోసం యీ కవి త్రొక్కిన మార్గాలనేకం కనిపిస్తాయి. హాస్యోపమానాలను గుది గ్రుచ్చి అందించడంలో యితని ప్రజ్ఞ అపారం. జాతీయాలను సామెతలను అతి నేర్పుగా ప్రయోగించి హాస్యం కలిగించటం ఇతనిలో ఒకకళ. ఇతని పద్యచరణాలెన్నో నేడు సామెతలుగా వాడబడుతూ ఉండటమనేది యితని కవిత్వ ప్రతిభా ప్రభావాలకి స్వతః ప్రమాణం. చెప్పవలసే నీతి సూటిగా చెప్పక, ఏదేదో ప్రారంభించి, ఏవేవో చెప్పి, చివరకి సారం తేల్చినట్లు నీతి నందించి, నిలబెట్టి బుజావు చేయడం యీతనిలో ఉన్న విశిష్టత. చెప్పేది సాంతంగా వినాలనే ఆకర్షణ కలిగించే సాధనం హాస్యం.

"ఎరువు సతంబౌనె యిల్లౌనె పందిరి, యిల నెండ మావులుజలము లౌనె
పరవుడిల్లాలౌనె వాపువలంబౌనె, కులటాతనూజుండు కొమరుడౌనె
మెరుపు దీపంబౌనె మేఘంబు గొడుగౌనె, స్వాంగ వాద్యములు
తూర్యంబులౌనె
కంతి తలగడౌనె కలయదార్థంబౌనె, పెనుగుడ్డ ముక్కాలి పీటయౌనె
కాని వస్తువు బట్టుకో కాంక్షచేత, వెనగు మాత్రంబె కానిలభింప దేమి
మదరిపువిశాల మునిజన హృదయలోల, వేణుగోపాల భక్త
సంత్రాణశీల."

వక్రంగా నిందించడానికి పూనుకొని, వాచాలతలో నిందనీయమైన అసలు విషయాన్ని పూర్తిగా కప్పిపెట్టి, అదే ప్రాకారమైన, నిందార్హమైన వస్తువులన్నిటినీ కూర్చి, పేర్చి, ఏ వాక్యాని కావాక్యమే లోకోక్తిలా మెరపించే కవితా ధోరణి యీ కవిలో ఓ ప్రత్యేక శిల్పము.

"పెట్టనేరని రండ పెక్కునీతుల పెద్ద, గోడ్రాలి ముండకు గొంతుపెద్ద
తోడపల్చనగు నింతి నడగండి కలపెద్ద, మూర్ఖ చిత్తుడు
కోపమునకు పెద్ద
గుడ్డి గుర్రపు తట్టు గుగ్గిళ్లు తినపెద్ద, నెలయనాబోతు కండలకు పెద్ద
అల్ప విద్యావంతు డాక్షేపణకు పెద్ద, రిక్తుని మనసు కోరికల పెద్ద
మధ్యవైష్ణవునకును నామములు పెద్ద, పెట్టనేరని విభుడు కోపింప పెద్ద
మదనరిపువిశాల మునిజన హృదయలోల, వేణు గోపాల భక్త
సంతాన శీల."

సమాజంలో ఉన్న అవినీతి, సంకర జాతుల ప్రాభవం, సామాన్య ప్రజల అగచాట్లు, సాధించి ప్రజల మాన మర్యాదలు దోచుకొనే అధికారుల అత్యాచారాలు సంసారుల యిక్కట్లు, మొదలైన వెన్నో యీ శతకంలో అతి సరసమైన శైలిలో హాస్యంగా వర్ణించబడ్డాయి.

వ్యాజస్తుతి, వ్యాజనింద, వక్రోక్తివంటి అలంకారాల సహాయమున హాస్యాన్ని అందిస్తు చివరంటూ రచన సాగించిన శతకాలుకూడ మనకు కొన్ని దొరుకుతాయి. వీటిలో కొన్ని కేవలం అధిక్షేప పూర్వకమైన శతకాలు. ఏ ఆశ్రయదాతనో నింధించడంకోసమనే యివి వ్రాయబడ్డాయి. ఆద్యంతమూ నిందసాగక, అప్పటికి శతకం పూర్తిగాక, యింకా చెప్తే పునరుక్తి దోషంవస్తుందనే భయంకల్గి, ఒకది పదిహేను నీతిపద్యాలు లేదా ప్రార్థనపద్యాలు చెప్పి సాంతంచేసిన శతకాలివి. అడిదము సూరకవిగారి రామలింగేశ శతకం ఈరకం దేశక్షామం, రాజవిప్లవం, చోరభయం, వగైరా సందర్భాల్లో, అడ్డుపడి కాపాడలేదనే నెపంతో, అంతవరకు అతిభక్తితో అర్చించిన దేవుణ్ణి, ఆక్షేపించిన శతకాల్లో వ్యాజనింద ఎక్కువగా కనిపిస్తుంది. ఈశతకాలు సరసమైన హాస్యాన్ని అందిస్తాయి. కోదండరామ శతకం, సింహాద్రినారసింహశతకం, ఆంధ్రనాయక శతకంవంటి వీరకమైనవి. ఈ "ఆంధ్ర నాయకశతకం" మన ఆంధ్రభాషకే ఒక భూషణం, కవి కాసుల పురుషోత్తం కవి హృదయం తోపాటు భక్తహృదయంకూడా కల్గినవాడు. వ్యాజోక్తి యితనిసొమ్ము, పౌరాణిక కథలు,

పాత్రలు, చివరకి పేర్లుకూడ యితని దృష్టినుండి తమలోఉన్న వికృతిని దాచుకోలేక పోయాయి. లేనిచోటకూడ వికృతి నారోపించటం ఈకవికి ఎడంచేతిపని.

" ఆలునిర్వాహపరాలు భూదేవిరైై అఖిల భారకుడన్న యాఖ్యదెచ్చె
ఇష్టసంపన్నురాలిందిర భార్యయై కామితార్థుడన్న ఘనతదెచ్చి
కమల గర్భుడు సృష్టికర్తతనూజుడై బహుకుటుంబికుడన్న బలిమిదెచ్చె
కలుషవిధ్వంశియౌ గంగతనూజరై పతితపావనుడన్న ప్రతిభదెచ్చె
నాండ్రు బిడ్డలుదెచ్చు ప్రఖ్యాతిగాని, మొదటినుండియు నీవు
దామోదరుడవె
చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ."

నూటికి నూరుపద్యాలు యిదేవిధంగా నడిపించగల్గిన కవిప్రతిభ చాలా అరుదు.

గ్రామ్యాన్ని నిందిస్తు, పామరుల భాషనేవాడి, వారి ఆచారాలు, అలవాట్లు, నమ్మకాలు, నడవడులు అన్న మూర్ఖతక్రింద చేర్చి వ్రాసిన శతకం. "చంద్రశేఖరశతకం." ఈపద్యాల్లో 'అనుకరణ' విరివిగాఉంది. అదేకారణాన్ని పురస్కరించుకొని యీ పద్యాలు చటాలున అర్థంకావు. పామరులువాడే భాషతో పూర్తిగా పరిచయముండి, అందుకనుగుణంగా విరిచి చదువుతేనేకాని భావం బోధపడదు, అంతేకాదు కొన్నికొన్ని పదాలు ఛందస్సుకోసమనీ మరీ వికృతమైన రూపంలో వాడబడ్డాయి. వాటమూలరూపంలో తెలుసుకోవడం చచ్చినంతపని.

" గంటము పేరయింటను భగాతము సెప్పితె యీదిలోని వో
రెంటివి సూస్తినేను యినురేత్రి రమాండము బాగసెప్పె మా
యింటి దురోధనుండు బవ్వుయుద్ధ మిభీసనుసించి లంకలో
మంటెగివించి వచ్చెనను మాంద్యుడు మూర్ఖత చంద్రశేఖరా.

బాపడులగ్నమంట తెగబారెడు పుస్తక మిక్కీసూసి యె
ల్లెపత మాసచూడుమిదె లింగడి పేరుబలాన చల్లు మం
టూపదబెట్టె నన్ను కొరగాని పులంబిది సమ్మరాదు సీ
గాపెడు గింజలైన మరిగాపను మూర్ఖుడు చంద్రశేఖరా."

శతకం అంతా యిదే శైలిలో నడిచింది. ఇందులో భాషతోపాటు పాటకజనుల జీవితం గూడ చక్కగా చిత్రింపబడింది. కాని అపహసించడానికని ప్రత్యేకంగా యీ ధోరణి

అలవరచుకొన్నందుచేత, అక్కడక్కడ అతిశయోక్తి కూడ అతిగా దిగుమతీ అయింది అర్థం కోసంపట్టే కుస్తీలో హాస్యం సగంచచ్చి మిగులుతూంది.

నీతులతోపాటు నిర్మొహమాటమైన సత్యాన్నీ, తత్వంతోపాటు దాంభికాన్నీ, అనుసరణీయమైన ఉపదేశంతోపాటు ఆచరిస్తూన్న అనాచారాన్నీ అతిసరసమైన భాషా శైలిలో అవసరమైనంత హాస్యముట్టోడించి వర్ణిస్తూ వ్రాసినశతకాలు కూడ కొన్నిదొరుకుతాయి. కొన్ని శతకాలలో యిట్టి పద్యాలు కొన్ని మాత్రమే దొరుకుతాయి. మిగిలిన పద్యాలు భక్తికో, వేదాంతానికో, లౌకిక ధర్మానికో, సంబంధించిన సూక్తులుగా ఉంటాయి. అయినా పరవాలేదు. నిజానికి శతకాలన్నీ ముక్తక కావ్యాలు. ఓ పద్యానికి మరో పద్యంతో సంబంధం ఉండదు. పద్యాలను ఓ వరస క్రమంలోపేర్చి చదవాలనే బాధలేదు. పద్యమేమి కర్మం, చరణాల్ని పిరాయించి తల్లక్రిందులా చదివినా అర్థానికి ప్రమాదంరాని పద్యాలు కూడ ఉన్నాయి. ఓ శతకంలో పద్యాన్ని మరో శతకంలోకి పోనీయకుండా కట్టిన సూత్రం పద్యాల చివరిమకుటం. ఇది నేను ఫలానా అని చెప్పి పద్యాల్లో పద్యాలకి సజాతీయ ధర్మాన్ని చేకూరుస్తూ ఉంటుంది. ఈ మకుట నిర్వహణ, పద్యంలో కొంత భాగాన్ని వ్రాయవలసే భారాన్ని తొలగించుకోవడానికని పనికి వచ్చే 'యిన్సూరెంసు' లాంటిది. దాన్ని అర్ధచరణం నుంచి చరణన్నర దాకా సాగదీసి సాము చేసినవాళ్లూ, యతి ప్రాసలలో నిలబెట్టి కసరత్తు చేసినవాళ్లూ, గూడ మన కవులలో లేకపోలేదు. అస్తు. ముక్తక కావ్యాలనే దృష్టితో చూస్తే, యీ శతకాల్లో హాస్యానికి సంబంధించిన కావ్య సంపత్తి చాలా లభిస్తుంది. ఈ రకమైన పద్యాలను శతాధికంగా అందించిన 'కవి వేమన్న'. అందరూ శతకాలు వ్రాసేరు కాని వేమన్న సహస్రాలు వ్రాసిన కవి. అతని పేరు మీద చెలామణీ అవుతూన్న 'దొంగ పద్యాలు' ఓ శతకం ఉంటాయి.

1 వేమన్నలో హాస్యం సభ్యాసభ్య రూపాలు రెంటిలోనూ, కనిపిస్తుంది. ఈ అసభ్యతకూడ కొన్ని కొన్నిచోట్ల మరీ పచ్చి పచ్చిగా వాచ్యం అయింది. ఇందు మూలాన్ని యితనిలో ఉన్న హాస్యం సగపాలు కలుషితమైంది. కాని యీ కవి స్వతంత్రుడు. సహజంగా హాస్యప్రియుడు. ఈ గుణాలకితోడు యితనికున్న లోకజ్ఞత అపారం. ఇతని దృష్టికందని రహస్యంలేదు. ఇవన్నీ యితని హాస్యానికి బలమిచ్చినవే. పూర్వాశ్రమంలో గడించిన అనుభవమూ సన్యసించిన తరువాత చేసిన దేశసంచారమూ, వేరు వేరు తరహా జనులతో కలిగిన స్నాహచర్య సంపర్కాదుల వలన సంపాదించిన జ్ఞానమూ, తరచి చూచిన తత్వమూ, అన్నీ యితని కనూనమైన ఆత్మ విస్వాసాన్ని గడించి పెట్టేయి.

ఈ ఆత్మవిస్వాసమే తానునమ్మినదానికీ, యితరమైనదానికీగల వైషమ్యాన్ని విస్పష్టంగాచూపి, వికృతమనిపించి, యితనిని నవ్వించింది. తననవ్వు సహజే అనే నమ్మకం, యితరుల్ని నవ్వించడానికి త్రోవదీసింది. కొన్నిచోట్ల యితడు నిష్కల్మషంగా నవ్వుతాడు. కొన్నిచోట్ల వేరొకరిని ఏడిపించిగాని నవ్వడు. కొన్ని నవ్వాలనిపించే లాంటిఅవ్యాజమైన నవ్వులు, కొన్నిలోతైన నవ్వులు, కొన్ని పకిలినవ్వులు, కూడ యితనిలో స్వభావగతంగా ఉన్నవే.

" పాల సాగరమున పవ్వళించినవాడు
గొల్లయిండ్లపాలు కోర నేల
ఎదుటివారిసొమ్ము లెల్లవారికి తీపు
విశ్వదాభిరామా వినురవేమ."

పైపద్యంలో మొదటి రెండు చరణాల్లోనూ, ఏదో కఠినమైన సమస్య లేవదీసినట్లు నటించి, ప్రశ్నవేసి, ఆకాంక్షజేసి, ఆలోచించినట్లు రూపించి, మూడవ పాదములో ఓనిత్య సత్యాన్ని నిష్కర్షగా ఆవిష్కరించి చెప్పడమనే ధోరణి అతి సరసమైన హాస్యానికి త్రొక్కినత్రోవ.

" గుహలలోన జొచ్చి గురువుల నెదుకంగ
క్రూర మృగ మొకండు తారసిలిన
ముక్తి మార్గమదియె ముందుగా జూపురా
విశ్వదాభిరామ వినురవేమ."

ఇది సత్యమైన ఉపదేశం చేస్తూన్నట్లే నటించి 'కళ్లుమూసి జెల్లకొట్టే' వెంకితనంతో గూడిన హాస్యం. ఈ రకమైన హాస్యం యితనికి చాల ప్రీతిగా ఉండే హాస్యం. ఇంతకన్న దయా దాక్షిణ్యాలులేని హాస్యానికి ఉదాహరణగా యీక్రింది పద్యాలు తీసుకోవచ్చు.

" లోభివాని జంప లోకంబులోపల
మందు వలదు వేరు మర్మము కలదు
పైకమడిగినంత భగ్గున బడిచచ్చు
విశ్వదాభిరామ వినురవేమ.

పిసినివాని యింట బీనుగు వెడలిన
కట్టెకోలలకును గాసులిచ్చి
వెచ్చ మాయెననుచు వెక్కి వెక్కి డుచ్చురా
విశ్వదాభిరామ వినురవేమ."

హాస్యం కోసమనే కోరి కోరి సాగదీసిన వాక్యాన్ని క్రింది పద్యంలో చూడండి.

"మేక పతుకకట్టి మెడచన్ను గుడుచగా
నాకలేల మాను నాశ గాక
లోభివాని నడుగ లాభంబు గల్గునా
విశ్వదాభిరామ వినురవేమ."

శతక రూపంలో కాకపోయిన విడి విడిగా వ్రాసిన పద్యాలన్నిటినీ ఓ చోట సంగ్రహించి, రూపక విభేదాలలో ఒకటైన వీధీరూపకంగా సరిదిద్ది, శృంగారాంగమైన హాస్యాన్ని స్వల్పంగా అందిస్తూన్న ప్రాచీన కృతి శ్రీనాధుని 'వీధీ నాటకం' ఇందులో శృంగారం అతిమాత్రగాను, హాస్యం అత్యల్పంగాను వర్ణింప బడ్డాయి. ఆలంబన వర్ణనం విపులంగా జరిగింది. వేరు వేరుజాతుల స్త్రీలు 'ఆలంబనం' గా గ్రహింపబడి, అక్కడక్కడ అసభ్యంగా కూడ వర్ణింప బడ్డారు. యిదే యిందులో ఉన్న నవ్వు. ఈ వెనుక కూడ యిట్టి వీధులు కొన్ని రచింప బడ్డాయి. వేరు వేరు జాతుల వారిపైన, మతాలవారిపైన, తరగతులవారిపైన, వ్రాసిన స్వాభావికమైన వర్ణనలే కొంత శృంగారం, కొంత హాస్యం కొంత సరసం, కొంత విరసం కల్గి వీటిలో కూర్చ బడ్డాయి.

తెలుగులో దండకాలు వ్రాయడం కూడ ప్రాచీనుల నాటినుండి వస్తూన్న సాంప్రదాయమే. ఇట్టి దండక రూపమైన ప్రాచీన కృతులలో వ్యంగ్య ప్రధానమైన హాస్యాన్ని అంతో యింతో అందిస్తూన్న కృతి పోతనామాత్యుని 'భోగినీ దండకము.' ఇందులో వేశ్యల మాయలు, విటుల విలాసాలు, ధూర్తుల ఆగడాలు కూడ వర్ణింపబడి అధిక్షేప హాస్యాన్ని అందించేవిగా ఉన్నాయి. కాని కవిదృష్టి హాస్యం కంటె శృంగారం వైపు అధికంగా ప్రసరించింది. అందుచేత హాస్యం నీరసించింది. ఈ వెనుక యిట్టి దండకాలు చాలా వెలసేయి. కొన్నిటిలో ఉత్తమ స్థాయికి జెందిన హాస్యం కూడ లభిస్తూంది. ఇటీవలి 'సిగరెట్టు దండకం' 'టీ దండకం' 'వకీలు దండకం' లోభులు చదివే 'లక్ష్మీ దండకం' వగైరాల్లో హాస్యం చాలా సరసమైనదిగా ఉంది. ఈ మధ్య ఒక హరికథలో 'బ్లాక్ మార్కెట్టు' దండకం విన్నాను. ఇదికొంచెం మోటుగా వ్రాయ

బడింది. ఇవన్నీ సవ్యమైన దండకాలకి సరసమైన అను కరణలు. పగటివేష కలాపాల్లో కూడ యిట్టివికొన్ని ఉన్నాయి.

కావ్యరూపంలో ఉన్న ప్రాచీన హాస్యకృతులలో పరిగణింప దగిన కృతి పిండిప్రోలు లక్ష్మణకవి వ్రాసిన "రావణ దమ్మీయము." ఇది శ్లిష్ట కావ్యము. మూలతః అధిక్షేపకావ్యము. దమ్మ భూమిపాలుడు యీ కవిగారి మాన్యాన్ని అపహరించిన మహానీయుడు. ఈ బలవద్విరోధాన్ని కలంతో ఎదిరించి కీర్తిగాంచినవాడు కవి. కావ్యంలోని కథ రామాయణకథ. అన్వయించుటలో వచ్చిన కథ దమ్మభూపాలునిది. అతడు రావణుడు. కవి రాముడు, మాన్యక్షేత్రము సీత. ఇట్లే మిగత పాత్రలు కూడ అన్వయింపబడినవి. ప్రతీ పద్యం రెండర్థాలు కలిగి ఒక వంక రామాయణ కథనూ, వేరొక వంక 'దమ్మీయ' కథనూ అందించును. అందుకు తగిన శ్లిష్ట పదాలతో యీ రచన సాగింది.

"చిత్రం బజకులమాన్య క్షేత్ర మపహరించె నింకఁ జెడునీదుశ్చా
రిత్రుండు పుత్ర మిత్రకళత్రాదులతోడ విగత లక్ష్మీకుండై."

ఇందులో తొలిచరణంలో ఉన్న అజకులమాన్య క్షేత్ర "శబ్దానికి రామాయణ పరంగా 'అజ మహారాజకులోద్భవుడైన రాముని భార్య సీత' అనినీ, దమ్మీయ పరంగా 'బ్రాహ్మణుడైన కవిగారి పొలము' అనినీ అర్థంచెప్పుకుంటే మిగత పద్యం అంతా దానంతటు అదే రెండు కథలకీ అన్వయిస్తుంది. ఈ మాత్రంబెడద కూడా అక్కర లేని పద్యాలు కొన్ని ఉన్నాయి.

"అప్పుడల దుర్మదాంధుం, డొప్పుగ దనుసేయు కార్యమొక్కింతయులో
దప్పని తలపడుబ్రతికెడు, చొప్పెరుగండ కటకాలచోనితుడగుటన్."

ఈ పద్యం రెండు కథలకీ యథాతథంగానే అన్వయిస్తుంది. అన్యాపదేశంగా, రావణుని నిందించినట్లు, రాజుని నిందించి కసిదీర్చుకోవడమే యిందులో ఉన్న హాస్యం. కాని రామాయణ కథని అనౌచిత్యాది దోషాలు రాకుండా కాపాడుకొంటూ, అంతటా ప్రకృతార్థ వ్యక్తమవాలనే మొండి పట్టుదలతో సాగించిన రచన అవటంచేత, అటు కవి ప్రతిభకీ, యిటు హాస్యానికీ కూడ కాలి సంకెళ్లు తగిలించినట్లయింది. అస్వాతంత్ర్యం హాస్యాన్ని బతుకనివ్వదు. ఇక అక్కడికి కవిగారి పట్టుదల, అతడు పడినశ్రమ, మనకు హాస్యాన్ని లిగించేవిగా మిగులుతాయి.

కూచి మంచి జగ్గకవిగారి "చంద్రరేఖా విలాపం" 'హాస్యప్రబంధంబుగా' పుట్టిన అధిక్షేప కావ్యము. తనకో కావ్యం అంకితంగా వ్రాయమని ప్రోత్సహించి, తీరా వ్రాసిన వెనుక సత్కరించక అవమానించిన నేరానికి గురియై, కవిగారిచేత యీ తిట్టు కావ్యంలో దీర్ఘాయువు పోయించుకొన్న చింతలపాటి నీలాద్రిరాజుగారీ ప్రబంధ కథకి రసిక నాయకుడు. నాయిక అతని ఉంపుడుకత్తె 'చంద్రరేఖ' పచ్చి శృంగారం వర్ణ్యవస్తువు. రాజుతోపాటు రాజాశ్రితులు, ఆంతరంగికులు కూడ అడ్డమైన తిట్లకీ గురి అయ్యారు. లక్ష్మణకవిగారివలె స్వాతంత్ర్యం చంపుకొని, మూతముప్పిడిగా తిట్టడం జగ్గకవికి నచ్చదు. అనవలసేది విస్పష్టంగా మొగంముందే మోటతనంగా అనేసేరకం. ప్రతిజ్ఞబట్టి తిట్టిన తిట్టు తిరిగి తిట్టకుండా ఎంతసేపైనా తిట్టగలిగినది యితని ప్రజ్ఞ. 'ఎలాతిడుతున్నాడో' అనిపించేది ధోరణి. ఈ చంద్రరేఖా విలాపం కథలోనూ, శైలిలోనూ, ప్రబంధపక్కీలో వ్రాయబడింది. ప్రబంధ సామాన్యమైన అష్టదశ వర్ణనలు యిందులో ఉన్నాయి. రసం శృంగారం గంగాప్రవాహం వంటిశైలి. తణుకూ బెణుకూలేని బండతనం యిందులో ఉన్న ఆకర్షణ. బూతు మాటలేని పద్యం కష్టంమీదగాని దొరకదు. ఇందులో ఉన్న అతి మృదువైన పద్యాల్లోకెల్లా మృదువైనదీ క్రిందిదని చెప్పవచ్చు.

" పండ్లు దోమడు గుద ప్రక్షాళనము సేయడమవసనాడైన హరిదినంబు
నందైన గడునూరబంది మాంసము లేక కూడు భుజింపడు గురుముఖంబు
గాడు తమ్ములజేరనీడు సత్కవులకు నైశ్యుల పెండ్లిండ్లవలన వచ్చు
కట్నముల్ దాదురాగ్రహమున లంకించి లంజెలకిచ్చును లజ్జమాలి
వినయమున దండ్రి తద్దినమునను విప్రు బిలిచియొక కాసుతవ్వాడు
బియ్యమీడు
పతితుడును లోభి చింతలపాటి నీలరాజు ఛీఛీ యతనిమీద మోజదేల."

వెనుక వీధి భాగవతంలో హాస్యము గాని ధోరణీ ఉదాహరించాను. అదే ఘుమ్మలో జగ్గకవిగారి సౌందర్య వర్ణనలు కూడ సాగనవి.

" మోవిపీయూషమూరును గేవలముగ, గవదళసరిపల్లహాకవికి చేని
మృదువు కోరింత కంపల గదుమజాలు, చెక్కులలరారు లోహపు
నిక్కులౌర."

ఈ కవి స్వభావతః హాస్యప్రియుడు. రాజునూ, రాజాశ్రితులనూ నిందించడంలో ఉక్రోషం కనిపించినా మిగతచోట్ల కథాగతిలో వికృతపూర్ణమైన ఘటనలు తారసింపజేయడంలోనూ

వికారంగా హాస్యాలంబనాన్ని వర్ణించడంలోనూయితని హాస్య ప్రియత చక్కగా బోధ పడుతుంది. పైగా

" పోడుముల ట్రోవులార కడుబూచిన పీతరితుమ్మలార బల్
బాడిద చెట్టులార ఫలభాగ్యవిశేష ముష్టి కుజంబులార యీ
వేడుకకర్త చిత్తమున వేడుక మీఱగ పేరంబు మీ
నీడను నీడ కొక్క సరణింబులు తెంచమగా వచింపరే.

చెండా మార్కొండాయా, దొండా మీయండకిపుడు తోరము మీఱక్
దాండవమాడుచు మేలిపసింహందెల చంద్రిరాడె చెచ్చర జెపుడా."

వగైరాపద్యాలు ప్రాచీన ప్రబంధశైలిని వెక్కిరిస్తూన్నట్లున్న హాస్యానుకృతులు (Parodies గా ఉన్నాయి. ఈరకమైన హాస్యానుకరణ ఈకావ్యంలో శ్రీకారంనుండి చిత్తగించవలెను వరకూ కనిపిస్తుంది.

రాజాశ్రితుల దౌర్జన్యాలు, విప్రుల దురంతాలు, వగైరా వర్ణనలు వ్యక్తిగతమైన నిందతో ప్రారంభించినా పర్యవసానంలో జాతిగతంగానే రూపొందాయి. యజ్ఞయాగాలు చేస్తామని యాచించి వచ్చిన సంభారాలు వెచ్చించకుండా, మసిబూసిన మారేడుకాయ వాటంగా కార్యం నిర్వహించే స్వార్థపరులైన శ్రోతులీనాటికీ ఉన్నారు. వెంకటశాస్త్రి గారి పేరుమీద వారంపరికి వడ్డించబడిన నింద యీక్రిందిది.

" పుడమిరేండ్లంపిన గుడదధిపాయసంగ వీనముల్ లోనిండ్లలో డాచి
కరణమ్ము లంపినకంద పెండలములు పదిలమ్ముగా నేల పాతివైచి
బ్రాహ్మణుల్ దెచ్చిన బహువిధ ఫలములు లోలోన దనదుచుట్టాలకిచ్చి
కోమట్లు దెచ్చిన గురుతరవస్తువుల్ మెల్లమెల్లనదారె మ్రింగివైచి
నేతిలో నామువమ్మును నిండనింపి, పప్పులోనుప్పుమిక్కిలి పాఱజల్లి
పులుసులో గంజి మిక్కిలి కలియబోసి భక్ష్యములలోన మిరియంపు బదటు గలిపి
మంచిబూరెలు పాణకలమాటువెట్టి, పిండిబూరెలొక్కొక్కముక్క పెద్దవారి
విస్తరులలోన భారంగ విసరివైచి కసరికొట్టిన విప్రులాకటను లేచి."

ఈ అతిశయోక్తులు హాస్యంకోసం వచ్చినవి. ఈ కావ్యంలో హాస్యం చాలవరకు అసభ్య మైనది. అయితే అసభ్యత హాస్యంగా తాండవించటం నేటికీ తగ్గలేదు.

ఆధునిక యుగంలోకూడ హాస్యకావ్యాలుగా మెరుగెక్కినవి అధిక్షేప కావ్యాలే. తిరుపతి వేంకటేశ్వరకవుల "గీరతం" తెలుగునాట బహుళ ప్రచారంపొందిన అధిక్షేపకావ్యం. ఇది ప్రశస్తీ, ప్రసారం పొందటమేకాక యీరకమైన మరికొన్ని రచనలకి ఒరవడిపెట్టగల ప్రభావంకూడ కలిగిన రచన. కవులమధ్య రగుల్కొన్న చిలిపి జగడం చివరికి మహాభారతమై మనకీ గీరతాన్ని ప్రసాదించింది. గీరతకర్తలధాటికి ప్రతి ద్వంద్వులైన రామకృష్ణకవులాగ లేకపోయినమాట వాస్తవం. వారుసహితమూ యిట్టి రచనలు చేసినవారే కాని వాటికీ ప్రశస్తిగాని ప్రచారంగాని రాలేదు. ఇదేవిధంగా శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రీగారు కూడ కొన్ని అధిక్షేప రచనలు చేసేరు. ఇట్టి వ్యక్తిగత ద్వేషాలతో ప్రారంభించి వ్రాసిన రచనలు పాశ్చాత్యసాహిత్యంలో విరివిగా ఉన్నాయి. ఇప్పుడు మనకీ ఉన్నాయని సంతసించవచ్చు. అంటే వీటిలో హాస్యం ద్వేషపూరితం "పొరుగింటికయ్యం వినవేడుక" అనే తత్వం యీరచనలకి తాత్కాలికంగా ప్రజాదరణ లభింపజేస్తుంది. ఏదిఏట్లున్నా, గీరతంమాత్రం కొంతవరకు అధిక్షేపాన్ని సరసంగా అందించిన కావ్యం. ప్రాచీనకవుల చాటువుల తరువాత పుస్తకరూపంలో గుస్తరించబడిన వ్యక్తి నిందకిది నాంది. నింద కేవలం వ్యక్తిగతం అయినందున హాస్యం ఆక్రోశంగానే మారింది. ఇందులోకంటె వీరి యితర కావ్యాల్లో ఉన్నహాస్యం ఎంతో శాస్త్రీయంగానూ, సమీచీనంగానూ, సరసంగానూ ఉంది. జాతీయమైన హాస్యం వీరి కృతులన్నిటిలోనూ కనిపిస్తుంది.

వేర్వేరు తరగతుల ప్రజల వేష భాషలనూ, ఆచారాలనూ, అపహాస్యనచేస్తూ వ్రాసిన చాటు సంగ్రహాల వంటి కావ్యాలు మనకీ కాలంలో చాలా లభించాయి. వీటిలో ఉపహాస మూలకంగా ఉంటుంది. అలంటనవర్ణలలో అక్కడక్కడ అతిశయోక్తి కూడ హాస్యం ఉంటుంది. ఈరకమైన రచనల్లో మొదటిది దాసు శ్రీరాములుగారి "తెలుగునాడు" ఇది ఆంధ్ర దేశపు బ్రాహ్మణ శాఖల వారి వేష భాషాదులను 'అనుకరణ' ద్వారా అపహాస్యనచేసి నవ్వించే రచన. మచ్చుకి.

" అన్నే నూన్నీ వషే బలే చాడషే విన్నావషే కాదషే
విన్నావఝ్ఝుల నారి బుర్రి నష యీ విన్నాయకిన్నారషే. "

ఇది సనాతన ఛాందస వైదికుల భాషకి హాస్యానుకరణ. ఇట్లే మిగతవి కూడ వెక్కిరింపుగా చెప్పబడ్డాయి. ఆధునికుల వేషభాషలు, పాశ్చాత్య సభ్యతావ్యామోహం, కోర్టు

కచేరీల పేచీలు, దొరదొరసానుల సీటు గోటులు, విచ్చల విడిగాసాగే విలాసాలు, వ్యైరాలన్నీ పూస గుచ్చినట్లు వర్ణిస్తూ, వ్యంగ్యంగా అపహాసించి వ్రాసినది. పాచిపెంట సంస్థానాధీశ్వరుల "కవి మహా రాజశతకం" ఇందులో కవికాలపు వర్ణన సంస్కారాభిలాషతో గూడిన వ్యంగ్య హాస్యంతో చేయబడింది. హాస్య సృష్టికై అక్కడక్కడ విభాషాపదాలు, యాసమాటలు వాడబడ్డాయి. ఇదే ధోరణిలో వేర్వేరు తరగతులవారిలో ఉన్న అహం మన్యత, ఆత్మోత్కర్ష, అంధ విశ్వాసాలు, అనాచారాలు వంటి కల్మషాలన్నీ కడిగిపోస్తూ, వ్రాసిన కావ్యం కొల్లూరు ధర్మారావుగారి "చాకిరేవు" ఇది నేటి ఖండకావ్యాల తీరులో వెలువడిన రచన.

మనలో ఉన్న లోపాలన్నిటినీ ఓ జాబితా వ్రాసినట్లు వ్రాసి, అన్నీ ఓ దగ్గర గుది గూర్చి పేర్చి, ఒక్కొక్కలోపాన్ని ఒక్కొక్క వెర్రి క్రింద జమ కట్టి వ్రాసిన పద్య సంపుటము కొత్తపల్లి సూర్యారావుగారి "ఉన్మాద సహస్రము." ఇది వెర్రి వెయ్యి విధాలనే సూత్రప్రాయమైన లోకోక్తికి సుదీర్ఘమైన వార్త్తికము. ఇందులో నవ్వు ఫలానా అని చెప్పిన కంటె ఒకటి రెండు పద్యాలుదహరించి చూపడం మేలు.

"తొమ్మిదవ వెర్రియును బొలంతులనె పట్టు
ధనము వెర్రియు నగలు వస్త్రముల వెర్రి
సుందరాకృతి వెర్రియ సూయ వెర్రి
సంతుపై వెర్రి పూజలు సలుపు వెర్రి.

పదియవదియగు వెర్రి సంఘవిలు స్త్రీ
పురుషులకు నవరతమ్ము గోరుకుల వెర్రి
నాటకము వెర్రి కథ వెర్రి నవల వెర్రి
వెర్రిలో వెర్రి కొస వెర్రి శైల వెర్రి."

ఇదే తీరున పుస్తకం అంతా వ్రాయబడింది. ఈ వెర్రు లెలా ఉన్నా సాంతంగా విసుగు లేక చదువుతే మనకు వెర్రెత్తడం కూడ సంభవమే అనిపిస్తుంది. ఇవిగాక, ఏవేవో ఎప్పుడెప్పుడో వ్రాసిన పదిపదిహేను పద్యాలతో వెలసిన రచనలు. బ్రాహ్మణ నక్క హాస్యం వంటి వర్ణవిద్వేష పూరితాలైన అసభ్య రచనలు, హాస్యాన్నే అప హాస్యభాజనంగా చేసే చకిలి రచనలు కూడ నేడు మనకు దొరుకుతాయి. ఇట్టి విడివిడి రచనలలో శేషభట్టర్ రామానుజాచారిగారి పద్యాలు చాలా ఉత్తమ తరగతి హాస్యాన్ని అందించేవిగా వలసెయి, సదానాదాలు ! ఇవి గోలకొండ కవుల సంచికలో వున్నవి.

సరసమైన హాస్యాన్ని అందిస్తూన్న అధిక్షేపకావ్యం అనంతపంతుల రామలింగ స్వామిగారి "శుక్లపక్షము". ఈ కవి అభినవ వికటకవి. కావ్యము 'కృష్ణపక్షము' తరువాత వచ్చిన 'శుక్లపక్షము'. ఉద్దేశం ఈనాటి 'భావకవులు' 'భావకవిత్వం' అనేవాటిని అపహసించడం, అయితే ఈ కవినిందగాని కావ్యనిందగాని కేవలము ఏకదేశీయాలుకావు. ఆలంబనకిచ్చిన వ్యాప్తి అధిక్షేపాన్ని సరసమైన అపహాసంగా మార్చింది. నిందార్హమైన విషయాన్ని ధ్వనించడానికి శబ్దశక్తినీ, అలంకారాలనూ వాడుతూ, హాస్యాన్ని పోగలిగినన్ని పోకడల నడుపుతూ, సభ్యతగాని, సరసతగాని చెడకుండా కాపాడుతూ కవి యీకావ్యాన్ని వ్రాసి మొదటినుండి నేటిదాకా తెలుగులో వెలసిన అధిక్షేపకావ్యాలన్నిటికీ యిదిమిన్న అనిపించేడు. వస్తుస్థితిలో యిది ఏడెనిమిది ఖండకావ్యాల సంపుటిగా వెలసినచిన్న పుస్తకము. ఈ ఖండికలలో కొన్ని కథాప్రధానములు. ఈ కథలుకూడ ప్రస్తుత అధిక్షేపానికి అన్యాపదేశంగా బలంచేకూర్చేటట్లు రచింపబడ్డాయి. ఒకచోట కథకు బదులు 'కల' వర్ణింపబడింది. కథ, ఘటన, పాత్రచివరికి పాత్రకి పెట్టిన పేరులో సహా వికట ప్రజ్ఞ ( Wit ) గోచరిస్తుంది.

" కవితకు హాస్యంబునకున్, లవమాత్రమునైన ముఖ్యలక్షణమున గా
నవు భేదము రెండింటికి, నవు జీవము వికట వాక్సహాయమున జుమీ."

అనేవాక్యం యీ కావ్యంలో చరితార్థమైంది. మొదట దైవప్రార్థన, తరువాత కల, కుకవినింద వగైరాలు వ్రాసి, అప్రధానంగానైనా, మన కవులలో ఉన్న కావ్యారంభ సంప్రదాయాలను గూడ వ్యంగ్యంగా వెక్కిరించటం జరిగింది. ఈ క్రింది పద్యం 'కుకవినింద' చేసే సుకవి స్వభావాన్ని వెల్లడిస్తూంది.

"తనలోపంబుల నాడిపోదురను చింతన్ జారిణీ కాంతము
న్మను సాధ్వీమణులందులోపముల జూపుంగాదె తద్రీతి నీ
వును నాదిన్ గుకవిప్రకాండమును నెప్డున్ దిట్టనుంకింతు భ
ర్తను దండించి గయాళిముందు మొగసాలన్ జేరుటిట్లే గదా."

కలలో గనిపించిన తెనాలి రామలింగ కవి స్వరూపవర్ణనంలో ఆయన జీవితానికి సంబంధించిన ప్రసంగాలెన్నో గర్భితంగా అందిస్తూ, హాస్యానికి లోతు, విస్తృతి రెండూ ఒకేసారి కలిగించబడ్డాయి.

"అద్దమరేయి నొక్క పురుషా కృతి దోచెను స్వప్నమందునా
కద్దిర పంగనామములు నాస్యమునన్ రుదురాక్ష పేరులున్
జెడ్డవి కంఠ సీమమున జిల్లిని చంకను తాటియాకులన్
గొడ్డిగ నొక్క చేత నొక కుంచెను రెండవ చేత బూనుచున్."

'భావతురంగము' లో తెనాలి రామలింగకవి చిత్రకారుడుగా దర్శనమిచ్చి 'భావచిత్రాలు' వాటిపై ఖరీ వాటి తత్త్వం వాటినర్థం చేసుకోనేందుకు కావలిసిన పరిజ్ఞాన వగైరాలు విప్పిచెప్పి, ఉదహరించి చూపి వ్యాఖ్యానిస్తాడు. సవ్యమైన చిత్రాన్ని అపసవ్యమని నిందించి, అపసవ్యంగా తాను గీసిన చిత్రమే సవ్యమైనదని సమర్థించి, కాదని చెప్పే విమర్శకులను పడతిట్టి, రామలింగ కవి పొందిన గెలుపు, ప్రాచీనకావ్యాల్లో భావం లేదనీ, తమ గీతాలే భావపూర్ణాలనీ, తెలియనివారు దద్దమ్మలనీ, నోరుపెట్టుకో జయించే భావ కవుల పద్ధతిలోనిదని వ్యంగ్యంగా నిరూపించబడింది. ఇదేవిధంగా "కవిరాజు" కథలోకూడ, అడ్డమైన పాట్లుబడి కచ్చిబిచ్చిగా కొంతవ్రాసి కొంత ఎరువుదెచ్చుకొని స్వంతంజేసి, 'యిదేకావ్య' మని నోటిబుకాయింపుతో సమర్థింపజూచి, అది సాగక నాడు మరెవరో పెద్దలు సమర్థిస్తే ఆ చాటున పెద్దవాళ్లయి తిరుగ జూచి, కవులమని విరగబడి విర్రవీగే వారిని అర్థాంతరంగా నిందించడం జరిగింది. ఈ కథలలో హాస్యానికని పోయిన పోకడ లన్నీ అన్నీ కావు. సామెతలు, జాతీయాలు, హాస్యోపమానాలు విరివిగా వాడ టమేగాక, "యీతడు గా కపీశ్వరుడు," 'భావాతీత భావుండు' 'ఉత్తముండయా' వంటి రచనా చమత్కృతుల చాటున నింపిన నిందావాక్యాలెన్నో కూర్చబడ్డాయి, 'భావ కవిత్వము' అనే ఖండికలో నవ్యకవిత్వానికి అనుకరణలు కూర్చబడ్డాయి, 'భావకవి' లో వారి మూర్ఖత వారి నోటనే వెల్లడించబడింది.

" తెలుగాడుటను వ్రాయుటను దెలియన్వలె నాంగ్ల భాషాజ్ఞాన
మవసరంబు
దేశాట నొత్కటా దేశముండన్వలె నుద్యోగమున బుద్ధి యుంచరాదు.
భావ గీతాలను బాడుచుండన్వలె బూర్వకవుల దిట్టి పోయవలయు
స్వేచ్ఛా విహారంబు సేయవలెన్ సభ్యులొకరి నొకరు మెచ్చుచుండ
నప్ప కవి సెప్పినది యెల్ల దప్పవలయు వలయు
నరయ గర్ణద్వయము గప్పియాడు కురులు
పెంచవలె నూత్న వేషంబు వేయ వలయు
మాసమితి సభ్యులకు నియమంబు లివ్వి. " అని అంటాడు భావకవి.

శ్రీనాథ కవిరాజునీ, భావకవి బ్రాహ్మణునీ ఒక పంక్తిలో నిల్పి ప్రాచీన కవులకీ, యీ నవ్యకవులకీ, గల తారతమ్యం కూడ ధ్వనించ బడింది. శ్లేష, యమకం, కాకువు వగైరాలతో పాటు, 'మృషవం' 'ప్రపంచం' వంటి వీథ్యంగములలోని వ్యంగ్య చమత్కృతులు గూడ అధిక్షేపమును సరసముగా చేయుట కుపకరించునట్లు వాడబడినవి హాస్యము అంచులూ, హద్దులూ దాటి పోలేదు; పోవలసినచోట కూడ శిల్పము ఆకర్ష నీయముగా ఉండి అడ్డుపడి మనదృష్టిని అన్యథా త్రిప్పుతూంది. ఉదాహరణకి కలలో కన్పించిన రామలింగని పల్కులు చూడండి.

> " ఈ కలగాన కవీశులె, యీ కవులయినారు లోకువిక దమకవితా
> ప్రాకట గుణము గ్రహింపగ, నీకల దలమానిక మటు విడుకొండ్రు
> సుమా."

ప్రాచీన సాంప్రదాయాన్ని అనుసరిస్తూ వ్రాసిన విశుద్ధ హాస్యకావ్యం స్వర్గీయ భోగరాజు నారాయణమూర్తిగారి " పండుగ కట్నము. " ఇది నాల్గు ఆశ్వాసముల పద్య కథ. హాస్యాలంబన లోభి బ్రతుకు. లోభి అయిన శరభరాజు ధనాశచే తనకూతురు సీతమ్మను వయస్సు మళ్లిన వరునికిచ్చి పెళ్లి చేయిడానికి నిశ్చయిస్తాడు. ఇది అతని భార్యకు గాని, కుమార్తెకుగాని కిట్టదు. దాని కాతడు సమర్థించిన ధోరణి యీ క్రిందిది. ఇది భార్యకు నచ్చ చెప్పేతీరు.

> " పొన్నాడ కామరాజని, యున్నాడో కచిన్నవాడ యోగ్యుడుకాడే
> మున్నను నొక్కడె తమ్ములు, నన్నలులేరాస్తి యెల్ల నతనిది సుమ్మా,
> నలువదియేండ్ల వయస్సని, పలుకుదురే కాని మూడు పదులకు దాటం
> గల యీడున్నటు తోచదు, కలిపించిన మాట నమ్మగారాదు గదా
> అందకాడటంచు ననజాలనైనగు, రూపికాడు మంచియేపువాడు
> నలుపు తెలుపు రెండు గలసిన యొకచాయ, గలుగువాడె కాని
> నలుపుకాడు.
> తనకు సీతమ్మనిమ్మని తరచు వ్రాయు, చుండెనైనను గిట్టని
> ముండకొడుకు
> లాతడొక ముండ నుంచు కొన్నట్లు నాకు, లేని సంశయ మొకటి
> కల్పించినారు.

ముండయు ముసగు లేదుత్త ముండ టంచు బలుకుఃబడి మీద
దరువాత దెలిసెనాకు;
ఆయిన నింతకు మగవాడు; ఆలిలేని, వాఁడు డబ్బున్న వాఁడు;
ఏ యేడుపైన
ఏడ్చి యుండును; అఘోషలేల మనకు. "

ఈ విధంగా సమర్థించి, తిరిగి,

" ఏక రాత్రి పెండ్లి యేర్పైనచో జాల
వరకు ఖర్చు తగ్గ వచ్చు మనకు
చూడ వచ్చి నట్టి చుట్టాలచే నిల్లు
గుల్లగాదు డబ్బు చెల్లిపోదు. "

అని చెప్పి ముహూర్తము కూడ నిశ్చయించినట్లు శరభరాజు భార్యతో చెప్తాడు. పెళ్లి కుమార్తె బెంగతో మంచమెక్కినది. డాక్టరు దొరసానికిది మనో వ్యాధి అని బోధపడినది. మేనబావపై నామె మనసు లగ్నమైనదని వినినది. మేనల్లుని రమ్మని వ్రాయమని లేదా వైరిచ్చి రప్పించుమని శరభరాజుతో చెప్పినది. కాని

" ఆరణాలంట వైరంట ఔర యెంత
జడుపు లేకన్నదా దొరసాని గుంట
దానియబ్బ గడించిన ధనము దాచి
యుంచినట్టులె మాటాడు చున్నదిచట.

డబ్బున్నర కవరంపిన, నబ్బాలున కందదొక్కొ అందిన రాడో
డబ్బున్న వారి నెప్పుడు, నిబ్బందులు పెట్టుచుందురిల్లే మూర్ఖుల్. "

అని చెప్పి శరభరాజు 'కానీ' కార్డు వ్రాయును. భార్యయిది సహింపక, అటు మేనల్లుని స్థితిగతులు, యిటుభర్త మూర్ఖత, ఎరిగిన దగుటచేత, తనమెడలో నగ నెచ్చించి, పంపి మేనల్లుని రప్పించినది. ఇది తెలిసి శరభరాజామెను గొడ్డు బాదినట్లు బాది, లోభత్వమెట్లు మానవత్వాన్ని శాసిస్తుందో రుజువు చేసేడు. కాని మరు క్షణమే అతనికి భార్య నాశ్రయించి, ఆశ్వాసించి 'అపరాధము క్షమింపు'మని బ్రతిమాలు కొనునంత అర్థ సంకటం తటస్థించింది. అది స్వాముల వారిరాక వారిని సత్కరించడం తన కిష్టము లేదు. ఇంట్లో దాగొని భార్యతో,

" పీకిల్లు కాల యెంతకు
బోడట తన పాప కట్నముము జెల్లింపక
పీడించుక తింటాడట
లేడనుమా శరభరాజు లేడను మింటక. "

అని చెప్పి బ్రతిమాలు కొంటాడు. స్వాములవారు నెల రోజులు మకాంవేశారు. శరభరాజు బయటకురాడు, ఇదే సమయమని భార్య 'సీతమ్మ సమర్తాడిన' దని బొంకి బయట పెట్టి వెలి వేయిందు కోవడం కంటె, రహస్యంగా మేనల్లునిచేత మూడు ముళ్లు వేయించి పెళ్లి అయిందని పించడం మేలని అతనితో చెప్పింది. తనకు పిల్లనివ్వకున్నట్లయితే మేనల్లుడీ నార్త ఊళ్లో చాటక మానడన్నిన్ని, స్వాములవారికి గూడ తమ గుట్టు బయట పెట్టి తీరతాడనిన్ని చెప్పి భయపెట్టింది. పచ్చి వెలగకాయ గొంతులో పడిన వాని అవస్థలోపడి శరభరాజు చివరకామె చెప్పినట్లు చేయడాని కంగీకరిస్తాడు. ఇలా ఘటనలొకదాని కొకటి దారితీస్తూ, అంతటా హాస్యాన్ని ధ్వనిస్తూ కథనడిచింది. అక్కడక్కడ హాస్యంకోసం అప్రధానమైన ఘటనలు కూడ అతి సరసంగానూ సహజంగానూ ప్రధాన కథతో చేర్చి వర్ణించబడ్డాయి. అవి కూడ అతుకు సరిపోయి సరసంగా ఉన్నాయి. శరభరాజుగారిని తేలుకుట్టినట్లు వ్రాసిన ఘట్టం ఈ రకమైనది. ప్రసంగము దిగిచి కట్నాల గోడు, పెళ్లికుమారుల నడవడులు వగైరాలెంతో ముచ్చటగా వర్ణించబడ్డాయి.

" ఓర్యేలట యెమ్మేలట వెయ్యిన్నూట పదియార్లు విసుగూనకయే పొయ్యాలట పైసిక్కిళ్లును నియ్యాలట యల్కనాడి లెక్కడి యాశల్."

" పెండిలియాడి కట్నముగ బెట్టిన నంతయు మూటగట్టి య ల్లుండల యత్తమామయు నలోమని యేడ్వనదే పరీక్ష కో లండనుబోయి నేటికిని రాడుగదా పదియేండ్లనుండి రో ముండనొ కూడి వాడు చెడిపోయెనటంచనుచుందు రందరుక."

భాషాశైలిలో గూడ హాస్యం ధ్వనించబడింది. ఈ క్రిందివి దొరసానిమాటలు.

" పోష్టాఫీసును పోష్టుజేయుడొక కార్డుక రేపె నా మాటలక టెష్టుక జేయగవచ్చు ష్టార్టిమిడియట్లే యంచునై రిచ్చుటే

చెప్పన్నింటను వైరుచూచుకొనుచుఁ వేవేగ మైత్రినులో
నే ప్పాత్రా నతడారణాలెకపి మీకేమైన వేష్టైనచోఁ."

ప్రసంగ ప్రాప్తమైన సంక్రాంతి వర్ణన, సూర్యాస్తమయ చంద్రోదయాది వర్ణనలు వగైరాలలో కూడ హాస్యోపమానాలు కూర్చబడ్డాయి, లేదా హాస్యప్రదమైన ఊహలు రేకెత్తునట్లు అన్యోన్య విరుద్ధమైన విషయాలొకచోట చేర్చి వర్ణింపబడ్డాయి. పంకుగగోజులలో లోభియింటికి తీరదట."

" అయ్యయ్యో అను భార్యయు గుయ్యో మొర్రో యటంచు గూతురు గట్నం
బియ్యాడని యేడ్చునల్లుడు, చయ్యన గనిపింత్రు లోభి సంసారమునఁ."

ఇలా హాస్యాన్ని ప్రధానంగా పోషించిన పద్య కథాకావ్యం తెలుగులో మరొకటి లేదని చెప్తే అతిశయోక్తి కాదు.

పౌరాణిక కథను కావ్యవస్తువుగా గ్రహించి, అనువైన వంపులు కూర్చి, అప్రధానమైన హాస్యాన్ని ప్రధానంగా భాసింపజేసి వ్రాసిన కావ్యం స్వర్గీయ చిట్టిలక్ష్మీనృసింహ కవిగారి "ప్రభాస శాపవిమోచనం" ఈ కవి రసికుడూ, హాస్యప్రియుడూ కూడ. ఇతని 'కృష్ణశతకం' బూతు హాస్యాన్ని అందించిన శృంగార శతకం. ప్రస్తుత ప్రభాస శాపవిమోచనంలో మాత్రం హాస్యం మిక్కిలి సరసంగానూ, సభ్యంగానూ అందించబడింది. కథ భీష్ముని చరిత్ర. నాటక విధానంలో నడిచినది కావ్యం. అనుస్యూతంగా అన్ని ఘట్టాల్లోను యిల్లు కట్టుకొన్నది హాస్యం. సత్యవతీ సౌందర్య వర్ణనం ప్రత్యక్ష పద్ధతిలో చేయక, శంతన సచివుడైన బ్రాహ్మణుని చేత భీష్మునికి చెప్పించి, పరోక్ష పద్ధతిలో వర్ణించడంలో యీ కవి హాస్యానికెట్లు జాగా చేసినదీ యీ క్రింద చూడండి. ఇవి బ్రాహ్మణుని పల్కులు.

" ఏబదియేండ్లు పైబడిన యీడు భవత్పిత కింకరుడు మా
టా బలుసాకుతో బ్రదుకు నచ్చపు వైదిక విప్రుడం గదా
పైబడ రంభవచ్చినను భంగమురాని యవస్థ నాది యో
బాబయ యిట్టి మాకును సెబాసనిపించిన వామె యందముల్."

ఇదే సందర్భంలో ప్రాచీన కవుల సౌందర్య వర్ణనలు కూడ అపహసింపబడ్డాయి.

" అటుపయిమోముదామరట యక్షియు దామరలోన దామరే
యట చరణంబుదామరయెయంట కరంబును దామరంట యింకటి
తటి విపరీతమున్నె మొలతామర వింటిమిగాని మేని యం
తట నిటుదామరంగలుగుతన్వి నిజంబుగ దూల గొండియే."

పైవిధంగా హాస్యంకోసమని ప్రసంగాన్ని అన్యథా మలర్చకుండానే, సంప్రాప్త మైన సందర్భాల్లో ఉన్న అసందార్భ్యాలు వెదకిచూపి నవ్వించటంగూడ యీకవికి మామూలే. ఈక్రింది పద్యాల్లోస్థూలకర్ణునికి శివుడు ప్రత్యక్షమై వరముగోరుకొమ్మని చెప్పగా అతడు పలికినమాటలు చూడండి,

" పలికినస్థూల కర్ణుడు ప్రభానుని దుర్నయమెల్ల నీసుతో
దెలిపి మహేశ యాతని మృతింగలిగింపగ గారవంబైన
యిలజనియింపగా వలతునింతియ కాదిదె నాదు మీసముల్
మొలువక చిక్కుపెట్టె నవి మున్నటియట్లుగ జేయుమాయనన్.
వెఱ్ఱుకలవరము గోరిన వాంఛనుమును గాంచలేదు వహ్వారేనీ
మంద్రాటముగను గొన్నన్ గుండ్రాలపు సేనియుగరగును డెందంబుల్
అనుచు నెకసక్కెమాడిన హరుని గాంచి అర్థనారీశ్వరా పక్క
సంబయున్న
నీకునొక్కప్రక్క మీసంబులేకయేమొ, కరుణ గాంచకుంటివి నాదు
గతికినీవు.

నారదునిచేత అంబవృత్తాంతం వింటూ, ఆమె మగవాడుగామారి తమమధ్యనే ఉన్నదని తెలిసి, కృష్ణార్జునాదులు తమలో ఆడుకొనిన బావమరదుల వికటాలసొంపుకూడ, ఘట్టాన్ని నిలవెట్టి యీకవి మనకుచూపెడు.

" నీవంబవు కావుగదా, బావాయూర్వశి శపింప భామాత్వము నీ
జీవితమున గొంతకలదు, నావిని యర్జునుడును జిరునవ్వు కనులతో
అర్థ జనంబునందునే నాడుదాన, గాను నారద మాబావగారెయేమొ
చెప్పనరుడనైనట్టి నాచేత భీష్ముక, ననినిజంపింతురాయన్న నమరమాని.

అంగనరూపులేని మనయవ్వ శిఖండి యటంచు నవ్వె జా
టుంగనుమన్న గెఙ నకులుఁడుఁ సహదేవుడు పెద్దబావ యా

డంగులలో నసేజమపండగను లెక్కిడువారటంచు గొ
న్నుం గొనలందులేనగవునూల్కొన బల్కుచు జూచెభీమునిక్."

హాస్యమయమైన ప్రసంగాలు కూర్చటం అనేది యీకవిలోగల ప్రత్యేకవిశిష్టత
హాస్యంకోసమనే కోరికోరి కథాప్రవాహాన్ని నిలిపి, కొంతసేపు నవ్వించి తిరిగి కథనడపడం
ఎన్నోచోట్ల కనిపిస్తుంది. సంభాషణల్లో చూపిన వాక్చమత్కృతి అతిసరసమైన హాస్యాన్ని
జోడించుకోవటమేకాక, అతి సహజమైన జాతీయాలతోనిండి మరింతగా హాస్యానికి మెరుగు
పెడుతూంది. దాశరాజువంటి పాత్రల మాటలలో వారి 'యాస' కూడ అనుకరింపబడింది.
పల్లెవారిమాటలేకాదు వారి తీరూ తిన్నదనమూ, సరస సంప్రదాయమూ వగైరాలన్ని
చక్కగా చిత్రించబడి అనాగరిక హాస్యాన్ని అందించేవిగా ఉన్నాయి. ఈక్రిందివి
దాశరాజు సత్యవతినిగూర్చి భీష్మునితో ఆడినమాటలు.

" మేము సదువుకోకున్నను
సామీ మాముద్దు బొట్టె సదువుకొన్నదో
నామాలంట యదేదో
రామాయణమంట నాకురావా పేరుల్."

ఇవిగాక, మూలకథలో లేకపోయినా హాస్యంకోసమని రాజసచివుడుగా 'వికట
శర్మ' పాత్ర సృష్టించబడింది. ఈవిదూషికపాత్ర. అటు కావ్యానికి నాటకత్వాన్ని,
యిటు పాఠకులకి హాస్యాన్నికూడ చేకూరుస్తూంది. అంబ భీష్ముని మోహించి వచ్చిన
ఘట్టంలో శృంగారం ఆభాసగానూ, ఆపహాసభాజనంగానూ పోషింపబడి హాస్యాన్ని
రసాంతరంగా ధ్వనించింది. ముక్కుమూసి చదువవలసే పురాణకథలో యింతగా హాస్యానికి
జాగాచేసి పోషించడంగాని, హాస్యాన్ని అసలుగ్రహించడంగాని వికట ప్రజ్ఞాధురీణుడైన
కవికే చెల్లుతుందిగాని అందరికీ చెల్లదు.

వీరేశలింగం పంతులుగారికి పూర్వం తెలుగులో చెప్పుకోదగిన గద్యలేదు. కాని
ప్రజాసమూహంలో ప్రచారం పొందిన 'మౌఖిక సాహిత్యం' లో కొన్ని హాస్యకథలు
మాత్రం కలవు. ఇవి ఏనాటినుంచో ఆనోటినుండి యీనోటికి దిగుమతీ అవుతూ, అనేక
మార్పులు కూడ పొందిన కథలు. ఈ కథలలో కొన్ని కేవలకల్పితాలు, కొన్ని కొంతసత్యం
కొంతఅసత్యం కలిపిఅల్లినవి. తెనాలి రామలింగని కథల గురించి లోగడచెప్పాను. ఇట్లే
పరమానందయ్యగారి శిష్యుల కథలు కూడ ప్రజాభిమానానికి పాత్రమైన కథలు, వీటిలోబాటి

తమోలం మూర్ఖత్వానికి సంబంధించిన హాస్యం. అయితే యీ మూర్ఖులు లోకకంటకులు కారు. ఇది అమాయికమైన మూర్ఖత. అభిమానించి, హర్షించి, హసించదగిన మూర్ఖత. భట్టివిక్రమార్క కథలు, రేచుక్క పగటిచుక్క కథలు, వ్యవహారాలు యుక్తి చాతుర్యానికీ, తగుమాత్రం వికట పక్షకీ (Wit) సంబంధించినవి. వీటికంటె బీర్బలు వినోద కథలలో గలయుక్తి చాతుర్యం హాస్యానికి సన్నిహితమైనది. శుకసప్తతి, మదన కామరాజు కథలు వ్యవహారాలలోది శృంగారానికి సంబంధించిన హాస్యం. పంచతంత్రి కథల వంటి పశు పక్ష్యాదుల కథలలో వ్యంగ్య హాస్యం అక్కడక్కడ దొరుకుతుంది. అలాగే అరేబియన్ నైట్సు కథల వంటి కథలలోగూడ అక్కడక్కడ యీవ్యంగ్య హాస్యం లభిస్తుంది. ఇటీవల యీరకమైన ప్రాతకథలన్నీ పుస్తకరూపంలో, సంగ్రహించి ప్రకటింపబడ్డాయి.

పద్యాలలో రచనలు వెలువడడం ప్రారంభమవటం తడవుగా చక్కని హాస్యమిశ్రితమైన రచనలు వెలయడం జరిగింది. వీరేశలింగంగారు ఏ విషయం వ్రాసినా సహజ హాస్య ధోరణిలో వ్రాయగల చతురులు, వీరిస్వీయచరిత్ర చదివినట్టయితే, యీ హాస్యశీలత్వం చక్కగా బోధపడుతుంది. వీరు హాస్యాన్ని కేవలం వినోదం కోసమనిగాక, సంఘ సంస్కారానికొక ఆయుధంగా వినియోగించిన యోధులు, ఫలితంగా యీ హాస్యం వ్యంగ్యమయమైంది. కొన్నికొన్ని చోట్ల ఎత్తిపొడుపు హెచ్చి హాస్యంలోని సరసతను కూడా తగ్గించిన పట్లు దొరుకుతాయి. అయినా, వీరి రచనల్లో ఉన్న ప్రథమాకర్షణ మాత్రం హాస్యమే, వీరు ఎన్నో ప్రహసనాలు, నాటకాలు, నవలలు వ్యాసాలు వ్రాసేరు. అన్నిటిలోనూ నాటి సంఘంలో గల అవినీతి, అనాచారం, అత్యాచారం అహంభావం, మౌఢ్యం వగైరా కల్మషాలన్నీ వేలెత్తి చూపి అపహసించి సంస్కరించడానికే ప్రయత్నించేరు. ప్రయత్నంలో సఫలులై, ప్రతివాదుల నోరుకట్టించేరు. వీరి హాస్యానికి గురియైన విషయాలు ముఖ్యంగా మూడు రకాలు. మొదటిది సనాతనాచార పరాయణత. ఇది వీరి జీవితానికే లక్ష్యం, సమాజాన్ని సంస్కరించడానికి పూనుకొని, ప్రతిస్పర్థుల యుక్తులు ఖండించి, వారి మనసు మార్చి తన పక్షానికి త్రిప్పుకొని, లేదా వారినోటికి తాళం వేసి తన వాదాన్ని సర్వజనమాన్యంగా చేయడానికని ప్రయోగించిన ఆయుధమే యీ హాస్యం. దీనికి సంబంధించినవే వీరి ప్రహసనాలన్నీనూ, రెండవది మానవ స్వభావం. ఇది సహజంగా మనలో కనిపించే లోపాలను వెక్కిరించి నవ్వుకొనే విశుద్ధ హాస్యం, వీరు కవులు, హాస్యప్రియులు, కూడ అయిన కారణంచేత మానవస్వభావంలో గల లోపాలను గుర్తించి, అతి నేర్పుగా వాటిని వెల్లడించి మనకు చూపగలిగేరు. ఈ హాస్యం చాలవరకు సానుభూతి మూలకం. వీరి నవలల్లో ఈ రకమైన హాస్యం మనకు విశేషంగా అందించబడింది. వికృతిని గమనించి,

వ్యంగ్యంగా ధ్వనించి తాను లోపల నవ్వుకొని మనల్ని ఆకాలువని నవ్వించగల హాస్య ప్రజ్ఞ వీరి నవలల్లోనే కాదు వ్యాసాలలో కూడ కనిపిస్తుంది. వ్యాసాలలో యీ హాస్యం, విషయాన్ని సరసంగా చేసి పాఠకుల మనస్సు నాకర్షించడానికి పనికి వస్తుంది. మూడవది సాంప్రదాయకమైన తెలుగు ప్రబంధ సాహిత్యం. ఇది కూడ సంస్కారాభిలాషతో కూడిన హాస్యమే కాని మొదటి రకపు హాస్యంలో ఉన్నంతగా యీ హాస్యంలో ఎత్తిపొడుపులు లేవు. సరస్వతి, నారదుడు వంటి పాత్రలనోట నాటి మన ప్రబంధ శైలి, తద్గత పదాడంబరత, అలంకార ప్రియత, శృంగార తత్పరత వగైరాలను వెల్లడింపజేసి, వాటివల్ల కవితకు కలిగిన నష్టాన్ని నిరూపించి, వాటినే పట్టుకొని వేళ్లాడే వ్యక్తుల్ని అపహసించి, వీరు తమ నాటకాల్లో గూడ సాహిత్య సంస్కారానికి జాగా చేసుకొన్నారు. విమర్శన చేస్తూ వ్రాసిన వ్యాసాలలో యిట్టి వ్యంగ్య హాస్యము అత్యంతమూ ప్రయోగింపబడినట్లు వేరే చెప్పనక్కరలేదు. అక్కడక్కడ వీరి హాస్యం కోపంగా మారి తారసిల్లడం కూడ కద్దు. తారాశశాంక విజయం వంటి శృంగార ప్రబంధాల్ని విమర్శిస్తూ వ్రాసిన వ్రాతల్లో యీ క్రోధమిశ్రితమైన హాస్యం చూడవచ్చు. ఏది ఎట్లున్నా వీరు హాస్యాన్ని ప్రయోగించి సామాజిక, సాహిత్య క్షేత్రాలు రెంటిలోనూ సంస్కారోద్యమాన్ని నడిపి సఫలత పొందిన మాట మరువరాని సత్యం.

వీరేశలింగంగారివలెనే సహజంగా హాస్యప్రియులైన కవులు చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు. వీరు కూడ వారివలెనే బ్రహ్మసమాజ మతాభిమానులు. సనాతన ఛాంధస సాచారాలను మనిపించటానికి వీరు కూడ హాస్యమునే ఆయుధంగా గ్రహించేరు. కాని వీరి రచనల్లో ఎత్తిపొడుపు తక్కువ. విశుద్ధ హాస్యము వీరి లక్ష్యము. వీరి ప్రహసనాలు సంస్కారాభిలాషతో వ్రాసినవే అయిననూ, వినోదం కోసమని వ్రాసినట్లుగా రూపిస్తాయి. వీరి 'గణపతి' తెలుగు సాహిత్యములో అమూల్యమైన హాస్యరచన. ఈ కథ మూడు తరాలకి సంబంధించి నడిచింది. కడుపు గడవక కక్కూర్తి పనులకి దిగే బ్రాహ్మణుల చర్యలన్నీ యిందులో వర్ణించబడ్డాయి. బ్రాహ్మణార్థాలు చేసేవారు, శవాలు మోసేవారు, నీళ్లకావిడీవారు, సంభావనలు పుచ్చుకొనేవారు, వంటకత్తెలు, వగైరా లెందరో యిందులోహాస్య భాజనులుగా చేసి వర్ణింపబడ్డారు. ప్రసంగము దిగిచి, వీరు తత్కాలీన సామాజిక వ్యవస్థలోగల అవకతవక లెన్నిటినో యీ రచనలో అపహసించేరు. వీటిలో ముఖ్యమైనది కన్యావిక్రయం. రెండవది వైదిక వృత్తి. కథను ఎన్నెన్నో ఘట్టాలలోకి దింపి, ఎక్కడికక్కడే వెక్కిరింపు, హాస్యానికి సరిపోయే సన్నివేశాలు సమకూర్చి, అంతటా పాత్రల స్వభావగతలోపాలనూ, వాటికి గల

పూర్వాపర హేతు ప్రత్యయాలనూ కూడ చిత్రిస్తూ వీరీ 'గణపతి'ని వ్రాసేరు. ఈ పాత్ర లెక్కడా మనద్వేషానికి పాత్రంగావు. అన్నీ మన అభిమానానికో, సానుభూతికో పాత్ర మవుతాయి. పాత్రగతమైనలోపాలు మనకు నచ్చవు. కానిలోపాన్ని సకారణంగా నిరూపించటం యీ కవిలోగల విశేషం. ఇవి మనల్ని క్షమాశీలురుగా చేసి, పాత్రల పట్ల మనలో మమత్వాన్ని ప్రవేశపెడ్తూంచి. ఈ గణపతి పాత్ర శాశ్వతంగా తెలుగు హృదయంలో స్థానం సంపాదించుకొంది. గణపతి రూపురేఖలుగాని, సోమరి తనంగాని, బడి మేష్టరీగాని మరుపురాని విషయాలుగా వర్ణించబడ్డాయి. ఇవిగాక యీ నవలలో ప్రాసంగికంగా అందించిన, వల్లిమండ మీది ఉపన్యాసం, ఉల్లిపాయ మహాత్మ్యం. 'శుక్లాంబర ధరం' వ్యాఖ్యానం వగైరాలలోని హాస్యం, కడుపు చెక్కలయ్యేలా నవ్వించే రకమైన హాస్యం. పురుషపాత్రకి బదులుగా స్త్రీ పాత్రను నిల్పి, గణపతి వలెనే వ్రాసిన వీరి రెండవ హాస్యరచన 'దుందుభి' లో మాత్రం హాస్యం చప్పగా ఉంటూంది. అందులో హాస్యానికి నవ్యత కొరవడింది. వీరి ప్రహసనాల్లో కూడ నవ్యత చూపని హాస్యంచాలా చోట్ల దొరుకుతుంది. కాని వీరిలో ఉన్న విశిష్టత ఆనాటి వరకు తెలుగునాట ప్రచారంలో ఉన్న ప్రాత కట్టు హాస్యాన్నంతటినీ లిపిబద్ధం చేయటం. తెలుగు వారి 'వాడుక హాస్యం' అంతా వీరి రచనల్లో ప్రతిఫలించింది. ఇలా 'కట్టు హాస్యం'గా దిగుమతీ అయిన కారణం చేత అక్కడక్కడ వీరి హాస్యం చప్పగానూ, వెకిలిగానూ, ఉబుసుపోనిరకంగానూ తయారైన మాట వాస్తవం. కాని వీరి హాస్యం ఎక్కడా ఒకరిని నొప్పించే రకం మాత్రం కాదు.

ఆంగ్లేయ సాహిత్యంలోని 'స్పెక్టేటరు' రచనలననుకరించి తెలుగులో వెలువడిన రచన 'సాక్షి' వ్యాసకర్త పానుగంటి లక్ష్మీనృసింహారావు గారు. వీరు తమ సాక్షి మొదటి భాగములో సాక్షి సంఘ నిర్మాణోద్దేశములు, కార్యకలాపములు మొదలగువాటిని గురించి వ్రాస్తూ, 'రాజకీయ దండనములేని సాంఘిక నేరములను' 'వ్యక్తుల మాయా ప్రచారములను,' సంఘదూషణకు గురిచేసి, దండించి. సంస్కరించడమే తమ అభిప్రాయమని వెల్లడించేరు. నేరాన్ని వెల్లడించి, దాని స్వభావాన్ని విశదపరచి, దానివల్ల సంఘానికి కలిగుతూన్న నష్టాన్ని స్పష్టపరచడమే తమ లక్ష్యమని పేర్కొన్నారు. ఈ సాంఘికదోషాలపై ప్రజలకసహ్యాము కలిగించటమే ధ్యేయమని చెప్పేరు. ఈ ఉద్దేశాలకనుగుణంగానే, వీరీ ఉపన్యాసములలో నాటి సమాజాన్ని విభిన్న కోణములనుండి చూపి, బాహ్యాంతర స్వరూపాలు రెండూ ప్రకటించి, సనాతనాధునాతన రూపాలలోగల

తారతమ్యం గూడ వెల్లడించి, తప్పొప్పులు నిర్ణయించి, అనుసరణీయమేదో అనుకరింపదగినదేదో అననుకూలమైనదేదో అక్కరమాలినదేదో కూడ విపులంగా, విసుపులేకుండా చెప్పేరు. 'పాచక మహాసభ,' 'మశక మత్కుణ మూషకాది సభ,' 'మహిష మహాసభ' మొదలైన ఉపన్యాసములలో వీరు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడ నాటి సంఘంలోనూ, వ్యక్తులలోనూ బలిసిన అహంభావం, అవినీతి, స్వార్థం, దురాచారం, దురభిమానం వగైరా గుణాలెన్నింటినో అపహాస్య ధోరణిలో వెల్లడించేరు. డాక్టర్లు, శాస్త్రజ్ఞులు, పరిశోధకులు, రాజకీయవేత్తలు, కన్యావిక్రేతలు, కాముకులు మొదలైనవారి అన్యాయాలు, మూర్ఖతలు, దుష్పాండిత్యాలు, దంభాచారాలు వైర్జన్యాలు, తంత్రాలు వగైరాలన్నీ అట్టుముట్టు అనవాళ్లతో సహా వెల్లడించి, పైరూపూ, లోచూపూ కూడ స్పష్టపరచి స్వభావాన్ని విశ్లేషించి, సంచారాన్ని బయలుపెట్టి, అధిక్షేపించి, అపహసించి సంస్కరించే ప్రయత్నం యీ సాత్త్యుపన్యాసాల్లో అడుగడుగునా కనిపిస్తుంది. నవీన నాగరికత వ్యామోహం, పూర్వాచారనిరసనం, ఆత్మవంచన, పరదూషణ వగైరా దుర్గుణాల నాటి సమాజంలో ఎంత విశృంఖలంగా విహరిస్తున్నాయో చాటి చెప్పడమేగాక, వీరీ ఉపన్యాసాల ద్వారా పాఠకులలో మనజాతి, మన సభ్యత, మన సంస్కృతి, మన మతం, మన భాష, మన దేశం, అనేవాటిపై అభిమానం కలిగించడానికి కూడ విశేషంగా ప్రయత్నించేరు. వీరు స్వతః జాతీయవాదులు తత్ఫలితంగా జాతీయాభిమానాన్నీ, స్వీయగౌరవా దృతినీ, స్వధర్మాభిరుచినీ, స్వాతంత్ర్యపిపాసనీ కూడ ప్రచారం చేసేరు. మతం, ఆరోగ్యం, శాస్త్రమర్యాద, విద్యాభివృద్ధి, చరిత్ర, రాజభక్తి, కవితాద్యభిరుచి, కళా తత్వం మున్నగు విషయాలు కూడా యీ వ్యాసాలలో స్థానం సంపాదించుకొన్నాయి. అన్నిటిలోనూ హాస్యం కద్దు అంతటా ఎత్తిపొడుపు కద్దు. వాచాలత ఉంది, వ్యంగ్యం ఉంది. ఆవ్యంగ్యం కూడ కటువుగానే ఉంటుంది. అక్కడక్కడ విషయాన్ని బట్టి అసభ్యాన్ని అతిశయించి చూపి అసహ్యం కలిగించేటంతగా వర్ణించడం కూడ కనిపిస్తుంది. సారంగధర నాటకం తోలుబొమ్మలాట వగైరాలపై వ్యాసాలు మోటు హాస్యాన్ని సహా అందిస్తున్నాయి. అసభ్యమైన దాన్ని వ్రేలెత్తి చూపునపుడు వీరేవిధమైన తెరమరుగులు ఉండనీయరు. అయితే, యిది 'జాడ్యం కొద్దీ మందు' అనే సామెత చొప్పున ఉంటుంది. కాని ఎక్కడా వీరు వ్యక్తి నిందకి పూనుకోలేదు. వ్యక్తిగతమైన దోషాలనే అధిక్షేపించేరు కాని వ్యక్తులతో తంటాలకి దిగలేదు. అక్కడక్కడ గ్రంథాలయోద్యమాలనీ, వ్యావహారికభాషావాదమనీ, కవికాలస్థలాది నిర్ణయాలనీ కొందరు పెద్దలు నాడు చూపిన కొన్ని కొన్ని మూర్ఖపు పట్టుదలలు మాత్రం గర్హితంగా అందిం

చబడి అపహసించబడ్డాయి. కాని యిట్టి చోట్ల వ్యంగ్యం కొంత మృదువుగా ఉండి పొరపాటును సూచించేదిగానే ఉంటూవచ్చింది గాని తీవ్రంగా లేదు. సాక్షిసంఘసభ్యుల పాత్రలు మనం ఎన్నటికీ మరువరానివి. ఈ 'సాక్షి' గాక వీరు వేరే కొన్ని హాస్యనాటకాలు కూడ వ్రాసేరు. వృద్ధవివాహం, కంఠాభరణం వగైరా నాటకాలు సామాజికలోపాల్ని ఎత్తి చూపే హాస్యనాటకాలు. కరడు గట్టిన ఛాందసం, అంధవిశ్వాసాలు, సర్వజ్ఞత్వమ్మన్యత, మతంచాటు అవినీతి మొదలైనవి నాటకాలలో ప్రదర్శింపబడి హేళన చెయ్యబడ్డాయి. కన్యావిక్రయం, వృద్ధవివాహం, వివాహాచారం, వగైరా సాంఘిక దురాచారాలన్నీ వ్యంగ్యం గానూ, హాస్యంగానూ కూడ అపహసింపబడ్డాయి. ఈ నాటకాల్లో కేవలం వినోదం కోసమే కూర్చిన ఘట్టాలు కూడ చాలా దొరుకుతాయి. కథను వక్రగతికీడ్చి, అనుకోని విధంగా అంతం చేయడమే కాక, అంతకూ అల్లరి, యుక్తి, దగా, మోసం, తిరుగుడు వగైరాలు చిత్రిస్తూ నాటకాన్ని నడిపే నేర్పు వీరి నాటకాల్లో కనిపిస్తుంది. విప్రనారాయణ, రాధా కృష్ణ, పాదుక వగైరా నాటకాల్లో కూడ ఏదో ఓ పాత్ర చేత విదూషకుని పని చేయించి, నవ్వించడానికి తగిన అనువులు కూర్చి, అందు కనుకూలమైన ఫంపుల్లోకి కథను నడపడం వీరి హాస్యప్రియతకి, హాస్య ప్రజ్ఞకి కూడ ఉదాహరణగా చూపవచ్చు. ఈ హాస్యేతర నాటకాల్లో పోషించిన హాస్యం చాలా సరసంగానూ, సభ్యంగానూ ఉంది. వీటిలో వ్యంగ్యం అంత కటువుగా ఉండక లోపాన్ని మృదువుగా సూచించేదిగా ఉంటూంది.

తెలుగు నాట విశేషఖ్యాతి గడించిన నాటకం గురజాడ వారి కన్యాశుల్కం. మూలతః ఇదికూడ సంస్కారాభిలాషతో అవతరించిన నాటకమే. సామాజిక సంస్కారంతో పాటు యిది భాషా సంస్కారాన్ని కూడ ఉద్దేశించి వ్రాయబడిన నాటకం. నాటక కర్త గురజాడ అప్పారావుగారు లౌక్యులు. వ్యంగ్యహాస్యం అతిసరసంగా ప్రయోగించగల చతురులు. వీరిలో గల విశేషం, దోషాన్ని చూపెడతారు గాని దానిపై తిరిగి వ్యాఖ్యానించరు. దోషాన్ని తిరస్కరించటం కూడ ఎక్కడో ఎప్పుడో గాని చేయరు. ప్రస్తుత నాటకం కన్యాశుల్కంలో వీరు మనకు శాశ్వతంగా అందించిన పాత్ర గిరీశం. ఇతడు యింగ్లీషులో వ్రేలు పెట్టిన తెలుగు యువకుడు. ఈ సుగుణాల కుప్పకు సంస్కారాభిలాష కలగటం వితంతూద్ధరణకే నన్నదీ పాత్రగత ధ్వని. ఇదిగాక యీపాత్రలో నాటి తెలుగు యువకులు కొందరిలో గల యింగ్లీషు వ్యామోహం దాన్ని అంతో యింతో నేర్చిన వారి డాబు, పాపభీతిలేని వర్తనం, తప్పుచేసి దానినే ఒప్పని సమర్థింపగల లోక కంటకమైన నేర్పు, స్వార్థసాధనకై అలవరచుకొనే చాతుర్యం, అవసరం తీర్చుకొనేందుకని పొందే నైచ్యం వగైరాలన్నీ పోతపోసి అందించబడ్డాయి. పైగా కథలో సనాతనులు, వారి

ఆచారాలు, అతిబాల్య వివాహాలు, కన్యా శుల్కాలు, మధ్యవర్తులతతంగాలు ధర్మం పేరిట అధర్మాలు, వేశ్యలమాయలు, జూదగొండుల తగవులు, నిజాయితీ లేని శౌక్యం, నీచాతి నీచమైన వైదికం మొదలైనవెన్నో సమావేశపరచి ప్రదర్శింపబడ్డాయి. మధురవాణి వాక్చాతుర్యం, ఉక్కాబత్తునిశంత్రిం, కొండుభట్లుస్వార్థం, రామప్పంతులు నియోగం, వెంకటేశం చేగోడీప్రియత, వగైరాలు మరువరానివిధంగా తీర్చిదిద్ది అందించబడ్డాయి. వీరువ్రాసిన కొండుబొట్టీయనాటకంలో కూడ యిదేవిధంగా సాంఘికదోషాలెన్నో చిత్రించబడ్డాయి. కాని ఆనాటకం అసంపూర్ణం. వీరి 'మాటా మంతీ' వగైరా వ్యాసాలుకూడ నాటి వ్యావహారిక భాషావాదాన్ని సమర్థిస్తూ, ప్రతివాదుల శాస్త్రీయతనీ, సాంప్రదాయక భావదాస్యాన్ని ఖండిస్తూ వ్రాసినవ్యంగ హాస్యపూర్ణమైన రచనలే. అసలీరచయిత వ్యంగ్యప్రయోగంలో జాణ. లోకవృత్తమెరిగిన లౌక్యుడు. వికృతినెరిగి చిటికలో చూపగల నేర్పరి. మానవ స్వభావాల్ని, తద్గతలోపాల్ని ఎరిగి, తదనుకూలమైన పరిస్థితులుకూర్చి, అనువైన వాతావరణంలో పాత్రల్ని నిలబెట్టి, ప్రపంచాన్నంతటినీ ఓ అద్దంలోకి తెచ్చి, తనకునచ్చినవంపులో అద్దాన్నిత్రిప్పి కావలసినవిధంగా వికృతిని ప్రతిఫలింపజేసి చూపగల చతురుడు. ఏపాత్ర ఎక్కడ, ఎప్పుడు ఎలా మాట్లాడతాడో, ఎందుకాలా మాట్లాడతాడో రెండూ అతిచక్కగా ఎరిగిన రచయిత. హాస్యం అతిమృదువైన వ్యంగ్యాన్ని ఆశ్రయించి వడిచేరకం. 'అయ్యోపాపం' అనిపించి నవ్వించడమేగాక 'పోనీలే' అనిపించి నవ్వించడంకూడ వీరి వ్యంగ్యహాస్యాలలో చూపిస్తాయి. పాత్రలను మూర్ఖులుగాజేసి చూపి నవ్వించటంతోబాటు అల్లరి, హంగామా, అసందర్భప్రలాపం వగైరాలు చూపి నవ్వించటంకూడ వీరి హాస్యంలో జాగాచేసుకున్నవే. వీరి గిరీశం పాత్రను మనమెన్నటికీ మరువలేముకాని అతని చర్యలు మాత్రం ఎన్నడూ సహించలేము. ఇతడు తనకుతాను గొప్పవాడని తలంచుకోవడంలోనే మూర్ఖుడుగాని, యితరుల్ని మూర్ఖులుగాచేసి మోసగించి స్వప్రయోజనాన్ని సాధించుకోవటంలో అతిచతురుడు. ఇదేకారణంగా యీపాత్ర మన సానుభూతికి పాత్రం కాలేకపోతూంది. ఇంతకంటె చిలకమర్తివారి గణపతి మన ప్రీతికి మిక్కిలి పాత్రుడు. కారణం అతని అమాయికత, గిరీశం అమాయకుడు, అన్యాయానికి వెనుదీయని సంఘసంస్కారి. ఇట్టి సంస్కారులవల్ల, సంఘానికి జరిగే ఉపకారంకంటెఅపకారమే ఎక్కువ అనేది యీనాటకల కర్తమనకిచ్చిన సందేశం.

ఈకాలపు సంస్కార ప్రియతమ ఫలితంగా తెలుగులో ప్రహసనాలు, హాస్య నాటికలు కుప్పలు తెప్పలుగా, వ్రాయబడ్డాయి. వీటికైకొన్ని గ్రంథమండలులు స్థాపింపబడి, రచయితలను ప్రోత్సహించి రోజుకో రచన చొప్పున ప్రకటించేయి. వీటన్నిటికి

ధ్యేయము సమాజ సంస్కారమే. అందరి హాస్యానికీ ఆలంబన సనాతనాచార పరాయణులే. అంతటా కనిపించేది వితంతువుల చరిత్రే. నిజానికి యీరచయితల్లో కొందరు సంస్కారమన్న మాటకే సరిగా అర్థం తెలియని సంస్కారులు. చాల రచనలలో హాస్యం జడ్డిజంతులు కరిసినట్టికో, వెర్రిమొర్రి వెకిలిచేష్టలు చేసినట్టికో అయి కనిపిస్తుంది. నవ్యత అసలేలేదు. పైగా మరోవిశేషం, శృంగారాంగంగా హాస్యాన్ని కూర్చటం అనేది రంకుతనాన్ని చూపడమే అని వీరికర్థమైనట్టు తోస్తుంది. అయితే, యిట్టి అనధికార రచనలు చాలవరకు పుబ్బలోపుట్టి మఖలో మాడిపోయేయన్నది ఎంతో సంతోషించవలసిన సంగతి. వరద వచ్చినట్లు వచ్చిన యీ కాలపు ప్రహసనాల్లో కొంతవరకు ఔచిత్యపూర్ణమైన హాస్యం శ్రీపాద కామేశ్వరరావుగారి ప్రహసనాల్లో మాత్రమే దొరుకుతూంది.వీరి 'క్రొత్తల్లుడు' వగైరా ప్రహసనాలు సరసమైన హాస్యాన్ని అందిస్తున్నాయి.

చారిత్రక నాటకంగా వెలసి హాస్యాన్ని అపారంగా అందిస్తూన్న నాటకం వేదం వెంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయం. ఇందులో హాస్యము విశుద్ధ కోటికి చెందినది. పండిత హాస్యము మొదలు పామరహాస్యము వరకూ గలభేదవిభేదాలన్నిటితోనూ ఈ హాస్యం పోషించబడింది. విద్యానాథుని వాక్చమత్కృతి, పెనుముకిశాస్త్రి వ్యంగ్య ధోరణి, పేరిగాని స్వాభావిక భాషాశైలి, పిచ్చివాని కృతక వాగ్విలాసం, మహమ్మదీయ పాత్రల సంకరభాష అన్నీ హాస్యాన్ని ఎక్కడికక్కడే ప్రత్యేకత, విశిష్టత చూపి ఆకర్షణీయంగా చేస్తున్నాయి. పెనుముకిశాస్త్రికి మహమ్మదీయులతో జరిగిన సంభాషణ నాటకీయ వ్యంగ్య ధోరణిలో నడిచి రక్తి కట్టిస్తూంది. ఈ శాస్త్రిగారి వ్యంగ్య వాక్కు లొకటి రెండు చోట్ల అశ్లీలతనూ, అసభ్యతనూ ధ్వనించేయి. పేరిగాని పాత్ర యీ నాటకానికే నాయకుడుగా మారినది. పిచ్చివాని చేష్టలు మాటలు వగైరాలెప్పుడూ హాస్యాని కాలంబనలే. అందులోనూ కేవలమూ పిచ్చివాడుగా గాక, ఎరువుదెచ్చుకొన్న పిచ్చితనమవటంచేత, యీ పిచ్చివాని ప్రలాపాలు హాస్యాన్ని ఔచిత్య పూర్ణంగానూ, శాస్త్రీయంగాను అందించేయి. పడవస రంగులలో, పామరుల మతక హాస్యం కూడ చూడవచ్చు. కేవలం మాటలేగాక, యీ నాటకంలో హాస్యపు పాటలు కూడ ఎన్నో చేర్చబడ్డాయి. భాషా శైలీ విభేదాలు హాస్యాన్ని వేరు వేరు తరహాలలో చూపి అందించడానికి ఉపకరించేయి. ఏ పాత్రకాపాత్ర భావంలోనూ భాషలోనూ వ్యక్తిత్వం చూపుతూ, తన వర్గపు జనుల హాస్యానికి ప్రతినిధిగా రూపిస్తూంది. ఈ నాటకంలో కథ అతి గంభీరమైన భావాలు రేకెత్తించేది. కాని యీ హాస్యం కథలోని గంభీర్యత నుండి మనకు ఎంతో విశ్రాంతి కలిగిస్తూంది. మరో విధంగా చెప్తే, మితిమీరిన హాస్యం మూల కథలోని రసాన్ని

విచ్ఛిన్నం చేస్తూందని కూడ చెప్పవచ్చు; కాని హాస్యం హాస్యం కోసమనీ గాక కథాగతికి చేయూత నిచ్చేదిగా ఉండి, అత్యంత సందర్భ శుద్ధితో ఒప్పుతూన్న కారణంచేత, పై సిద్ధాంతాన్ని అపాస్తంచేస్తూంది.

లెక్కకు మిక్కిలిగా హాస్యపు రచనలు చేసిన ఆధునికులలో శ్రీ పాద సుబ్రహ్మణ్యంగారొకరు. వీరికథలెన్నో యీ వెనుక పుస్తకరూపంలో ప్రకటించబడ్డాయి. వీరి ఏకాంకికలు వ్యాసాలు గూడ ప్రజాదరణ పొందినవే. వీరి 'కలంపోటు' తెలుగు ఏకాంకి కలలో, ఎన్నదగిన వాటిలో ఒకటి. వీరి కథలలో గల ప్రత్యేకత, సంవాదశైలి, వీరి హాస్యంలో వ్యంగ్యం చాలా సభ్యంగానూ, సరసంగానూ కూడ ఉంటుంది. హాస్యం తరుచు గార్హస్థ్య హాస్యంగా రూపొంది ఉంటుంది. మానవస్వభావంలో గలలోపాలు చూసి, చూపించి నవ్వడం వీరికి ప్రియమైన హాస్యం. హాస్యం కోసమని వికృతిని అతిశయించి చూపడం కూడ వీరికి మామూలే, మచ్చుకి వీరి 'యావజ్జీవం హోష్యామి' అనే కథలోని పంక్తులు కొన్ని యీ క్రింద చూడండి.

" - ఏ మట్టుకు వచ్చింది వంట ?

'అన్నం వార్చాలి.'

'ఇంకా అక్కడే ఉన్నావూ !'

'అన్నట్టు మరిచిపోయి తీరా మడిగట్టు కొన్నాను; బియ్యం కొలిచి పట్టుకురండీ.'

'ఇంకా ఎసట్లో బియ్యమేనా పొయ్యలేదా. యేమిటే ?'

'ఎసరు కాగి తేనా ?'

'మరి వార్చాలన్నావేం !'

'అత్తెసరు మెతుకులు తినడం నావల్ల కాదుసుమండీ ?'

'ఛీ. బుద్ధిలేని దానా !'

'అలా రుంజు కొంటూ వెళ్లిపోతే కాదుమరి. దానీ పీనుగు అంట్లు పట్టుగో వెళ్లి చెరువు దగ్గర కూచుంది. తొరగారమ్మనండి వెళ్లి.'

'ఎసరేనా పెట్టలేదా యేమిటే.'

'గిన్నెలు లేందీ వన్నేం చెయ్యమంటా రండీ !'

'పొయ్యిలో నిప్పేనా వేశావా ?'

'ఇప్పుడే కాదుటండీ పొయ్యలికేనూ.' కాస్తేనా ఆరాలా అక్కర్లేదా.' ఇంతకీ ఎక్కడ దొరికేయో మీకు చెక్కపేళ్లు.

పచ్చి ముద్దలు. బుడ్డెడు కిరసనాయిలు పోసినా తగులడ్డం లేదు.'

'ఏమీ లేందీ మరే కట్టు కొన్నారెందుకూ మరి.'

'చద్దన్నం తినండీ నేనుండ లేను బాబూ!"

వీరి రచనలన్నిటిలోనూ యీ విశిష్టమైన చక్కని హాస్యం, అందుకు తగిన నిత్య జీవితంలోని సరసమైన సన్నివేశాల ద్వారా, వికట ప్రజ్ఞకి నిదానమై పొరుకుతుంది.

హాస్యపు పాత్రను సృష్టించి, కథ అల్లి, అంతటా అస్వాభావికతనే చిత్రిస్తూ, అనూహ్యమైన వికృతినే తారసింప చేస్తూ, మాటి మాటికీ పొరపాటుకే దారితీస్తూ, చివర కంతా సహజమనిపించే నేర్పుతో వ్రాసిన పెద్దకథ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి 'బారిష్టరు పార్వతీశం.' ఈ పాత్రను ఎరుగనివారు తెలుగు నాట లేరు. ఇది యిటీవల వెండితెర కెక్కిన కథ. లండను వెళ్లి బారిష్టరు పరీక్ష ప్యాసవుదామనే ఉబలాటం, ఉత్సాహం కల ఆంధ్ర సనాతన బ్రాహ్మణకుటుంబానికి చెందిన యువకుడే పార్వతీశం. ఆంగ్లేయ విద్యతోపాటు అబ్బవలసే అనేక రకాలైన సుగుణాలితనిలో కొరత. నేటి నాగరికత అంతా యితనికి క్రొత్త. ఎన్నడూ రైలెక్కి కూడా ఎరగని యీ వ్యక్తికి యిల్లు బయలుదేరింది మొదలు అడుగడుగునా విపరీత పరిస్థితులే తారసిల్లి, ఎక్కడికక్కడే అతనిని మూర్ఖుడుగా చేసి ప్రపంచమే తల్లక్రిందులైనట్లు అతనిచేత భావింప చేస్తాయి. రైలులో అతడు నడిచిన నడత, మద్రాసులో అతడుపడిన యిబ్బందులు, స్టీమరులో అతడు పడిన అవస్థలు, క్రొత్త ప్రదేశాల్లో అతడు పడిన చిక్కులు అన్నీ చదివి తీరవలసినవే కాని వ్రాయడానికి అలవుకావు. కడుపుచెక్కలైనంతగా నవ్వించి, ఓ ఘట్టాన్ని మించి మరో ఘట్టాన్ని హాస్యప్రదంగా చిత్రించి యీరచయిత తెలుగులో అనుపమానమైన హాస్యరచనగా యీకథ మనకందించేడు. మన మెరుగని వస్తువులేదైనా మన చేతబడినప్పుడు, దానినెల్లా పట్టుకోవాలో, దానికి తలఏదో, తోకఏదో తెలియక మనం ఒకప్పుడు కాకపోతే యింకొకప్పుడైనా నవ్వులపాలై చరిస్తాము. ఇదే సూత్రం యీపార్వతీశంకథలో ఆద్యంతమూ యిముడ్చబడి హాస్యాన్ని పోషించింది. అంతా అసహజంగానే కల్పించి అత్యంత సహజమని ఆఖరికి తేలుస్తూ ఉంటుంది. పొరపాటు మరోపొరపాటుకి మూలమై, వికృతులొకదానికొకటి గుదిగ్రుచ్చినట్లు, పెనవేసుగొన్నట్లు, రూపించి, ఊహాకందని వంపులలోకి కథనీడుస్తాయి. పాత్ర స్వభావతః మూర్ఖుడుకాడు, పరిస్థితులతనిని మూర్ఖునిగా చేసి వెక్కిరిస్తూ ఉంటాయి. ఈ పార్వతీశాన్ని మించి నవ్వుల

పాత్రైన అవస్థలు మనంకూడ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడనుభవించి ఎరిగినవే. అందుకే యీపాత్రఅంటే మనకి మమత్వం, అభిమానం, సానుభూతి అన్నీ కలిగేయి. ఇది మన జాతీయమైన సొత్తుగా తయారైన పాత్ర. గిరీశాన్ని సహించలేము కాని పార్వతీశాన్ని విడిచి ఉండలేము. ఈ రచన ననుకరిస్తూ వ్రాసిన 'లాయరు గిరీశం' 'డాక్టరు రమేశం' వంటి రచనల్లో నవ్యతలేక హాస్యం శక్తికట్టలేదు. 'పార్వతీశం' ఈ క్షేత్రంలో ఏకైక హాస్య పాత్రగా నిర్వాలిగేడంటే తప్పులేదు. ఈ రచయిత అనేక హాస్యవ్యాసాలు, కథలు గూడ వ్రాసేరు. అంతటా సరసమైన హాస్యాన్నే అందించేడు. హాస్యపు పాత్రను సృష్టించడం యితనిలోగల విశిష్టత. ఈ పాత్రలుకూడ మన ప్రేమకు పాత్రమై ఉంటాయి.

ప్రసిద్ధులైన ఆధునిక హాస్య రచయితలలో భమిడిపాటి కామేశ్వరరావు గారొకరు. వీరు చిన్నకథ, ఏకాంకిక, వ్యాసం వగైరాలన్నిటిలోనూ హాస్యాన్నే ప్రధానోద్దేశంగా పెట్టుకొని కలంనడిపించేరు. వీరి ఏకాంకిక లెన్నోచోట్ల రంగస్థలం మీద ప్రదర్శింపబడి మెప్పులందేయి. ఇప్పటికి పుస్తక రూపంలో వెలువడిన రచనలేగాక, మాస పత్రికలలో నేటికీ వీరి రచనలు మనకు లభిస్తున్నాయి. ఎలాంటి వారినైనా నవ్వించి తీరతాననే ప్రతిజ్ఞతో అలవర్చుకొన్నట్లుగా ఉంటుంది వీరి హాస్య కల్పనా విధానం. నేటిసమాజంలో వ్యాపించి ఉన్న అహమిక, అసూయ, అసహనం, చేతగానితనం, వృథాభిమానం వగైరాలు వీరి హాస్యానికి ఆలంబనలు. మునుపటి పద్ధతులు నేటి వారికీ, నేటి పద్ధతులు మునుపటి వారికీచూపి, యిరుతెగల వారికీ నవ్వు పంచి యివ్వటం వీరి విలాసం. హాస్య సృష్టికై అనుసరించిన మార్గాలలో ముఖ్యమైనవి వాచాలత, అతిశయోక్తి, అల్లరి, మూర్ఖత వగైరాలు. వీరి పాత్రలన్నీ ఒకేతీరున, ఒకే ధోరణిలో మాట్లాడతాయి. కొన్ని కొన్ని సన్నివేశాలలో పాత్రల నడవడి స్వాభావికంగా ఉండక, బలాత్కరించినట్లు ఉంటుంది. అందరూ మూర్ఖులుగానే చరిస్తారు. ఈకారణంచేత వ్యంగ్యానికి బలం తగ్గిపోవటం కూడ తరుచు సంభవిస్తుంది. హాస్యం కూడ పరిసరపు రసిక భాష నాశ్రయించి, కళామయంగా దిద్దబడి, ఉత్తమ కోటికి చెందినదిగా లభించదు. కాని నవ్వించడానికి మాత్రం సాటిలేనిరకంగా ఉంటుంది. మచ్చుకి వీరి 'పేషంతగాదా' లోని కొన్ని పంక్తులు చూడండి. ఇది ఒక సభాప్రారంభ ఘట్టం. ప్రార్థన జరగవలసిన పట్టు. నవరసరావుగారు సభాధ్యక్షులు. తక్కినవారు సభ్యులు, సంగీతరావు ప్రార్థన చెయ్యబోతాడు.

శాస్త్రి :- అంతాలేచి నిలబడడం ధర్మం మరి (ఎవడో ఒకడు అల్లూపెకి అనేసిన తరువాత బాగుండదని చెప్పేసి. కొందరులేచి, కొందరు సగంలేచి, చాటు

వాళ్లు కూర్చొని, కొందరు పక్క వాళ్లని పట్టుకు వేళ్లాడి ఎల్లానో యిదవుతారు.)

సంగీతరావు:— "నిటలాక్షుండెపుడెత్తి వచ్చినను రానీ" (అనే పద్యం పూరీకల్యాణి రాగం లో పాడబోగ నలుగురూ పకాలుమంటారు.)

శాస్త్రి :— (సంగీతరావు దగ్గరికెళ్ళి అతడిచెవులో) తెలుగుని ప్రార్థనేమిటి నీమొహం దేవుడికి తెలుగురాదు. సంస్కృతాన్ని కానీ.

సంగీ :— (కొంచెంకోపం నటించి) 'వృక్షాగ్రవాసేనచపక్షిరాజా' (అనేది ప్రారం భించినా అందరూ గోలగానే వర్తిస్తారు. సంగీతరావుకి చాలా కోపం వస్తుంది.)

నవరసరావు:— ( కలుగజేసుకోక పోతేబాగుండదని ) కార్యదర్శిగారూ ! ఇదంతయూ మున్ముందే నిష్కర్ష చేసి యుండవలసినదే !

ఆనందరావు:— 'జనగణమన' పాడవోయ్.

శేషు :— అందులో 'ఆంధ్ర' అనే మాటగాని కృష్ణాగోదావరీ నదుల స్మరణగాని లేదు. కనక వద్దు.

భావ :— వందేమాతరం పాడండి.

శాస్త్రి :— దేవుణ్ణిగురించి అయితే 'వందేపితరం' పాడాలి

భావ :— పితరం అంటే మాత్రలు చెడతాయి.

శాస్త్రి :— మాతరం అంటే గోత్రాలు విడతాయి.

నవరసరావు:— అయ్యా ! ఇది నాశాసన. సంగీతరావుగారూ, తమరు తమచిత్తమునకు వచ్చిన దైవప్రార్థన మాకు చేసిపెట్టుడు.

సంగీ :— చిత్తం, కాని సృతిలేదు గనక నేను పాడనేపాడను. క్షమించాలి."

వీరి ఏకాంకికలన్నిటిలోనూ యీవిధమైన మూర్ఖహాస్యం (Foolshy) గూడు కట్టుకొనిల్చింది. కథాగతిలో మాత్రం వీరుచూపే పతాకాస్థానకం చాలా సంభావ్యంగానూ సరసంగానూ ఉంటుంది, గాని అంతవరకూ నడిచే యితర ఘటనలన్నీ అసహజంగానూ, అల్లరిచిల్లరిగానూ, అతివాస్తవికంగానూ ఉంటాయి. పాత్రలందరూ ఏదో మరుపుమందు తలకెక్కించుకొన్నవారి చందంలో అవతరించి, మనప్రపంచమే వేరు,వారి ప్రపంచమేవేరు అనేతీరులో నటిస్తారు. ఆడేమాటలుకూడ స్వాభావికంగా ఉండవు! హాస్యం తరుచుగా శబ్దాధారంమీద నడుస్తుంది. కట్టుమాటలు, సాంకేతికాలు, యింగ్లీషు తెలుగు కలగలపు పదాలు వగైరాలు తరుచు వినిపిస్తాయి. ఇవి అందరికీ అర్థంకూడ కావు. ఈదోషాలున్నా

వీరిహాస్యం ప్రజాదరణకి పాత్రమైన హాస్యమని ఒప్పుకోక తప్పదు. వీరివ్యంగ్యం ఒకరిని నొప్పించదు. హాస్యంతోపాటు జాతీయత, స్వీయగౌరవం, స్వసంస్కృతి, నిజాయితీ, నిలకడ, వంటి సద్భావాలు ధ్వనించి, మనకు కళ్లువిడినట్లు చేయడం వీరెన్నడూ మానరు. పినాటినుండో జాతిలోనూ, సమాజంలోనూ ఆదరాభిమానాలకి పాత్రమై ఉన్న పాత్రలను గాని, వ్యక్తులనుగాని చివరికి సాంప్రదాయాలను గాని వీరెన్నడూ అపహాసించి, న్యూన పరచి, కించపరచి, ఎరుగరు. అసభ్యతగాని, అశ్లీలతగాని, వీరి హాస్యంలో వెదకినా దొరకవు. ఇలా 'హాస్యం కోసమే హాస్యం' అనే సిద్ధాంతాన్ని అనుసరిస్తూకూడా, హాస్యాన్ని మర్యాదాబద్ధంచేసి నడిపిన ఘనత ఈ కామేశ్వరరావుగారి కొక్కరికే చెల్లుతుంది.

ఏకాంకనాటికలద్వారా హాస్యాన్ని అందించడంలో విశేష కీర్తిగడించిన వారిలోమల్లాది విశ్వనాథ కవిరాజుగారొకరు. హాస్యం కోసమని వీరు స్వాభావికతను బలియివ్వరు. వీరివ్యంగ్యం కూడ మిక్కిలి సరసంగా ఉంటుంది. వీరి హాస్యానికి నేటి విద్యావంతులైన యువకులలోగల నిస్సారత, మేకపోతు గాంభీర్యం, చేతగాని శౌర్యం కల్లబొల్లి అనుమానాలు, అక్కరకురాని విజ్ఞానం, వ్యవహారయోగ్యం కాని ఊహాపోహలు వగైరాలు ఆలంబనలుగా గ్రహింపబడ్డాయి వీరి సంభాషణలలో వికట ప్రజ్ఞ ( Wit ) మూర్తీభవించి కనిపిస్తుంది. కాని యింగ్లీషు తెలుగు కలగాపులగపు ధోరణిలో నడిచిన సంభాషణాశైలి తరుచు పాత్రల్ని ఊరకే మూర్ఖులుగాచేసి, మితిమీరిన అల్లరికీ, అపహాస్యానికీ గురిచేయటం కూడ వీరికి మామూలే. వీరిరచనల్లో స్థానికులైన వ్యక్తులు, వారి చర్యలు, గూడ గర్భితంగా ( Allusions ) అందించబడి, అపహాసించబడటం కద్దు. అక్కడక్కడ అసభ్యత కూడ ధ్వనిస్తుంది. అయినా, వీరిలో గల విశేషం, నేటి మన ఆంధ్రయువకుల జీవితానికీ, స్వభావానికీ సంస్కారానికీ చదువు సంధ్యలకీ సంబంధించిన సరసమైన ప్రసంగాలెన్నో కూర్చి, అందుకు తగిన వాతావరణాన్ని సృష్టించి, అతిసహజమైన ధోరణిలో కథ నడపుతూ, చక్కని వ్యంగ్యపూర్ణమైన హాస్యాన్నందించటం. వీరి పాత్రలు మన మెరిగినవీ ; మనం నిత్యం చూస్తున్నవీ అయి ఉంటాయి. వాటి పరిస్థితులు మనకు మన నిత్యజీవితంలో తారసపడేవిగా ఉంటాయి. మన తెలివితక్కువతనం మనమే గమనించి నవ్వుకొన్న చందంలో యీ వ్యంగ్యహాస్యం మనల్ని నవ్విస్తుంది. 'దొంగాటకం', 'డొంకలోషరాబు', 'కిర్రుగానుగ', 'ఆంధ్రాస్పిరిట్' వగైరా వీరి నాటికలు ఎన్నో సార్లు రంగస్థలంమీద ప్రదర్శింపబడి ప్రజాదరణ బడసేయి, వీరి 'పంతులుపస్మా' కథ సినిమా రంగాని కనువుగా కొంత మార్చబడింది.

మల్లాది వెంకటకృష్ణశర్మగారు నేటి మన రాజకీయాన్ని వ్యంగ్యంగా హేళన చేస్తూ చాలా ఏకాంకికలు వ్రాసేరు. నేటి ప్రజా స్వాతంత్ర్య పరిపాలనలో ఏర్పడిన అవకతవకలు, అనర్హులైన అధికారుల గర్వాలు. ప్రజాసేవకులమని చెప్పిచేసే మోసగులు పవిత్రమైన ఆచారాలకే అపకీర్తి ఘటించే ప్రచారకుల స్వార్థప్రవర్తనలు వర్గైరాలు వీరి అధిక్షేపానికి గురిఅయిన విషయాలు. జమీందారీబిల్లు, విడాకుల బిల్లు, ఎలెక్షన్లు రేషనింగు మొదలైన వెన్నో వీరి వ్యంగ్య రచనలలో స్థానం సంపాదించుకొన్నాయి. విషయాన్ని అట్టు ముట్టు ఆనవాళ్లతో మన కళ్లకుకట్టే విశదంగా వర్ణించి, కుళ్లుస్పష్టపరచి, అందుకు హేతువు లేవో కూడ నిర్దేశించిచూపి, అతి నిర్దాక్షిణ్యంగా ఆక్షేపించి, అసహ్యం కలిగించ డంలో వీరు నేర్పరులు. తరచుగా రూపకాన్నాశ్రయించి రచనసాగించడం వీరి విశిష్టత. వీరి వ్యంగ్యం చాల కటువుగా ఉంటుంది. స్వాభావికతకివిలువ అసలే ఉండదు. తగు మనిషితరహాకి చెందిన హాస్యం కూడ అరుదుగానే ఉంటుంది. చిన్న పిల్లలు పది మంది కూడి వేరొక కుర్రవాణ్ణి అల్లరిచేసి ఏడిపించి నవ్వుకొనే ధోరణిలో ఉంటుంది ఘటనా కల్పన, అధిక్షేపానికి గురిచేసిన వస్తువులో అప్పుడప్పుడు దోషం కేవలం. అభూత కల్పనగా ఉండటం కూడ కద్దు. ఇది వ్యంగ్యాన్నే కాక అసలు రచననే నీరసంగానూ, విరసంగానూ తయారు చేస్తూంది. మల్లాది అవధానిగారి రచనలు కూడ యిదేరకపు అసభ్య హాస్యాన్ని అందించేవిగానే తయారైనాయి. వీరి 'అసంపూర్ణ రామాయణం' శుద్ధతందనాలాట. అంతటా కృతకమూ, అతివాస్తవికమూ, అసంభర్భమూలకమూ, బలాత్కృతమూ అయిన ఘటనావిధానమే కనిపిస్తుంది. పదిమంది తప్ప త్రాగి ఓచోటగూడి చిందులు త్రొక్కినట్టుంటుంది పాత్రోలచర్య. అతిశయోక్తి ఆకాశ పథాన్నంటి నడిచిన కారణాన్న రచనకి లక్ష్యచ్యుతి కలిగి, ఉబుసుపోని పనిగా రూపిస్తూంది. నేటి రాజకీయాలు, అంతర రాష్ట్రీయ సమస్యలు, కవి సమాజాలు, నాటక సభలు వర్గైరాలపై వీరిట్టి వ్యంగ్య రచనలెన్నో చేసేరు. పాత్రలు వ్యక్తులను మారు జంతువులుగా కూడ తారస పడ్డాయి. అంతటా సంభాషణ అసహజంగానూ, ఘటన అనౌచిత్య పూర్ణంగానూ, అధిక్షేపం విరసంగానూ ఉండి రచనల్ని పేలవంచేసి విడు స్తున్నాయి. కొన్ని రచనలు రంగ స్థలానికి అనుకూలించక కేవలశ్రవ్య (పాఠ్య) నాటికలుగా తయారైనాయి.

గుడిపాటి వెంకట చలంగారి రచనల్లో కూడ హాస్యం లభిస్తుంది. కాని యీ హాస్యం వల్లమాలిన కోపం, అత్యధికమైన ఆవేశం, అక్కరమాలిన అక్కసు, వగైరాలను ప్రచ్ఛన్నం చేయడానికే వినియోగింపబడింది. వీరి రచనల్లో స్వేచ్ఛ, విశృంఖలవిహారం, అవినీతి, అతివర్తనం, అనేవి ప్రచారం చేయడం ప్రధానోద్దేశంగా కనిపిస్తుంది. వీటిని

కాదనే సమాజం యీ రచనల్లో అపహాస్యానికి ఆలంబనగా గ్రహించ బడింది, నేటిసమాజం లోని యువతీ యువకుల కామ ప్రవృత్తికి సంబంధించిన సమస్యలెన్నో వీరి రచనల్లో చక్కగా చిత్రించిన మాట వాస్తవం. కాని యీ సమస్యలకి వీరు చూపిన పరిష్కార మార్గాలు భారతీయ సంస్కృతికిగాని సభ్యతకిగాని సరిపోయినవి కావనే సంగతి రూఢి. ఈ సంగతి గమనించిపీరు సీత దమయంతి, చంద్రమతి వగైరా ఆదర్శ పాత్రలలో కూడ లోపకల్పనకి దిగి, అనాదిగా మనహృదయాలలో పీటిపట్లగల ఆదర భావానికే ఎసరుపెట్టి, అతినిరుత్సాహదాయులై కలం నడిపేరు. రావణుడు పది నోళ్లతోటీ పదిసిగరెట్లు, చాలకపోతే ఎంగిలి సిగలతోసహా, కాల్చి పొగ వదుల్తున్నాడనో, విశ్వామిత్రుడు చంద్రమతిని తన్ని బూతులు తిట్టేడనో, నలుడు చేతగాని చవట అనో, దమయంతి రెండో పెళ్లికి సర్వసన్నద్ధురాలనో వ్రాస్తే, చూసినవ్వే వాళ్లు సంఘంలో ఎప్పుడూ కొరవడరు. కాని వాళ్లే సంఘం అనిగాని, ఆ నవ్వే హితమైనదని కాని అనుకోవటం భ్రమ. సమాజంలో భావపరివర్తనం కలిగించే మార్గము తుంటరితనంగాని, దురుసుతనంగాని ఎన్నడూ కాదు. దోషాన్ని భూతద్దంలో చూపి, దానికి ఊహ జోడించి, అతిశయించి ప్రదర్శించడం ఆఘాయిత్యం వంటిదే అవుతుంది సరసమైన అపహాస్యమనిపించు కోదు. అశ్లీలత హాస్యాన్ని జుగుప్సగా మార్చి విడుస్తుంది. అసభ్యత రచనకే అల్పాయు ర్యోగం పట్టిస్తుంది.

అతి విశుద్ధంగానూ, సభ్యతాయుతంగానూ, సరసగానూ తీర్చిదిద్ది అందించిన హాస్యం మునిమాణిక్యం నరసింహారావుగారి రచనల్లో దొరుకుతుంది. వీరి 'కాంతం' ఆంధ్రుల ఆడుబిడ్డ, కాంతం భర్త, తెలివి తేటలలో ఎప్పుడూ ఆమెకు క్రిందుచెయ్యే. వీరి కాపురం గాని, కబుర్లుగాని, కలహాలుగాని, కలకలంగాని ఆంధ్రజాతి ఏ నాటికీ మరిచిపోదు. వీరిని అభిమానించి, ఆదరించి, హర్షించి గర్వపడని తెలుగువాడు 'నభూతో నభవిష్యతి'ముని మాణిక్యం వారి 'కాంతం' కథలన్ని స్వగత భాషణ శైలిలో నడిచేయి. ఇందులో రచయిత యింకొరి దోషాలన్నీ తనమీదనే ఆరోపించుకొని, తనకు తానే మూర్ఖుడని ఒప్పు కొంటూ, తనకు గల్గిన శృంగభంగాలన్నీ ఏ కరువు పెడతాడు. ఇలా ఎరువు దెచ్చుకొన్న మూర్ఖత కూడ సంభవమూ, సహజమూ, సత్యమూ అనిపించే ధోరణిలో కథ నడిపిస్తాడు. ముని మాణిక్యం వారిలో యీ కళ పాకానికి వచ్చింది. వీరి యీ కథలన్నిటిలో గార్హస్థ్య హాస్యం ముమ్మరంగా అందింపబడింది. ఇల్లు, సంసారం, పిల్లలు, పశువులు, భార్య బయట వూళ్లో ఉన్నప్పటి భర్త బ్రతుకు, పెళ్లిళ్లు, ప్రయాణాలు, అలకలు, అనుమానాలు, నగలు, నాణాలు, చీరలు, కూరగాయలు సహా, యీ హాస్యానికి విభావాలుగా గ్రహింపబడ్డాయి.

అంతటా అత్యంత స్వాభావికమైన గార్హస్థ్య జీవితం హాస్యమయంగా చిత్రించబడింది. తెలుగు దంపతుల సంసారంలో ఉన్న సరసత, సఖ్యత, సంస్కృతి, సంప్రదాయం వగైరాలెంతో ముచ్చటగా తీర్చి దిద్ది అందించబడ్డాయి. అన్ని చోట్లా అతిమృదువైన హాస్యం, అతిసరసమైన వ్యంగ్యం, చక్కని వాక్చమత్కృతి, స్వాభావికమైన సన్నివేశాలు, జాతీయమైన ప్రసంగాలు కూర్చబడ్డాయి. ఇంటి విషయాలే గాక సమయా సమయాల్లో హరినాథ భజనలు, క్రాస్‌వర్డ్ పజిల్సు, యుద్ధవార్తలు, బడి మేష్టరీ, ప్రబంధ శృంగారం వగైరా విషయాలపై కూడ సాంసారికమైన వ్యంగ్య హాస్యం కన్పించబడింది. ఇక, కాంతం, ఆమె రూపురేఖలు, చదువు సంధ్యలు, తెలివి తేటలు, మాటనేర్పు, సతీత్వం, మాతృత్వం, గృహిణీత్వం మొదలైనవి ఎంత చెప్పినా తనివితీరని విషయాలు. “మీరు యింగ్లీషులో మాట్లాడుతుంటే నాకేదో అర్థమైనట్లే ఉంటుందండీ” అన్నప్పటి ఆమె పరేంగిత గ్రహణశక్తి, “రేపు యుద్ధం ఆపి నవరసులు ఒక గంటసేపు చవుకగా అమ్మతారని” యెవరో చెప్తే విశ్వసించిన ఆమె అమాయికత్వం, “పిల్లవాడికి గుర్రాలను గూర్చి గాడిదలను గూర్చి పాఠాలు చెప్పుతారండీ!” అన్నప్పటి ఆమె ఆశ్చర్యం, “పాడి గొడ్డును అమ్ముకొంటారండి పొట్లకైనంత మాత్రాన ఆమాటకొస్తే, నేను మిమ్మల్ని పెట్టుకో కాపురం చెయ్యాలేదండి యిన్నాళ్లు” అన్నప్పటి ఆమె సహాస్యకుశలమైన వ్యవహారజ్ఞానం, “ఏమే పిల్లా, అదేమి ఆగడమే. పెరుగు బాగుంటే ఇంకా రెండు ముద్దలు తినాలిగాని బుగ్గలకు పూసుకుంటారా” అని హాస్యమాడిన వదినగారితో “మీ తమ్ముడు సరిగ్గా తిన కుండా లేచిపోయినారు, చూశావా వదినా – వారి కొరకే కాస్త బుగ్గలకు పూసుకొన్నాను” అన్నప్పటి ఆమె సమయస్ఫూర్తి, “మీ చెల్లెలు ఒకకోతి, మీ అక్కయ్య మరోకోతి తోకలు మాత్రం లేవు” అని హేళన చేసిన మగనితో “మీ చెల్లెళ్లకి ఆలోటూలేదు” అని అంటించిన మాటకారితనం, “నేను ఒట్టి తెలివితక్కువ వాడిననానీ అనుమానం” అని అడిగిన భర్తతో “అహః హః హః అనుమానమేమీలేదు గట్టినమ్మకమే “ అని అన్నప్పటి దిట్టతనం వగైరాలు ఎన్నిమార్లు చెప్పుకొని ఆనందించినా, తిరిగి, స్మరించి, నవ్వుకో ఆనందించాలనిపించే నిత్యనూతనమైన ప్రసంగాలు.

చింతా దీక్షితులుగారి ‘వటీరావు’ కథలలో హాస్యం కంటె వికట ప్రజ్ఞ ఎక్కువగా గోచరిస్తుంది. ‘వీరి హాస్యకథలు’ అనే సంపుటంలో కొన్ని చక్కని హాస్యాన్ని అందించే కథలున్నాయి. వీరిది చాలా సరసమైన హాస్యం. డి. వి. నరసరాజుగారి ‘అంతర్వాణి’ అనే హాస్య నాటికల సంపుటిలో కూడ చక్కని హాస్యం

ఘోషింపబడిన రచనలున్నాయి. కొడవ గంటి కుటుంబరావుగారి రచనల్లో
మైన హాస్యం లభిస్తూంది. నేటి పత్రికల్లోనూ, రేడియోలోనూ గూడ కొన్ని
నలు, ఉత్తమ కోటికి చెందినవి వెలువడుతున్నాయి. మొత్తం మీద నేడు
గుల్లో హాస్యరచనలకి ఆదరం ఎక్కువగా లభిస్తుంది. చక్కని హాస్యం కూ
లభించింది. ముందు ముందు మరీ ఎక్కువగా హాస్యరచనలు వెలువడగలవనే
జాలు గూడ కనిపిస్తున్నాయి.



## పారిభాషిక పదముల పట్టిక

అపచేతన Sub conscience
అధిక్షేపము Satire
అనుకరణ రచనలు (హాస్యానుకృతులు) } Parodies
భావ విశ్రాంతి Relief
వ్యంగ్యము Irony
విధి లేక ఘటనా వ్యంగ్యము Irony of fate or action
నాటకీయ వ్యంగ్యము Dramatic Irony
సహజప్రవృత్తి Instinct
హాస్యము Humour హాస్యోపమానాలు Laughable Comparisons
వికట ప్రజ్ఞ Wit
వికటోక్తి Witticism
హాస్యనాటిక Comic Play
హాస్యపాత్ర Humorous Character
మూర్ఖహాస్యం Foolesny
ఫార్సు Farce
శ్లిష్ట రూపకరచన Allegorical Composition
ప్రసంగ గర్భిత Allusion

## ఈ రచనకు తోడ్పడిన గ్రంథములు.

సాహిత్యదర్పణం — రసగంగాధరం — దశరూపకం — ప్రతాపరుద్రీయం
Laughter-Burgson
Lectures on Comic Writers-Hazlitt
English Humour-J. B. Priestly
English Verse satire-H. Wolfe
Satire and satirists-H. Walker
Introduction to the Plays of Moliere by George Saintsbury.
चिंतामणि-रामचंद्र शुक्ल
नवरस-गुलाब राय
आधुनिक हिन्दी साहित्य का विकास-श्री कृष्णलाल
ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము_కవిత్వవేది
సాహిత్య విధులు_కురుగంటి సీతారామాచార్యులుగారు
వేమన_రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారు
తెలుగు నటుడు (వ్యాసం)_భమిటి కామేశ్వరరావుగారు